ఓమ్ నమో నారాయణాయ

హరిః ఓమ్



# బుద్ధభగవానుఁడు

# జీవిత సంఘటనలు





చర్ల గణపతిశాస్త్రి

మొదటి ముద్రణము 1959
ప్రతులు 1000
రెండవ ముద్రణము 1995
ప్రతులు 1000

వెల: రూ॥ 15-00

చర్ల గణపతి శాస్త్రి
33 కిర్లంపూడి కాలనీ
విశాఖపట్నం
53002
ఫోను నెం. 575098



ముద్రణ:
లలితా ఆర్టు ప్రెస్సు,
టౌనుహాలు రోడ్డు,
విశాఖపట్నం-1.

# -: సమన్వయము :-

—•—

ప్రాచీనకాలము నుండి అనుస్యూతముగా వచ్చుచున్న ధర్మములు మాటలలోఁ జెప్పుకొనుచు వానిప్రకారము ఆచరింపక ప్రజలు భ్రష్టులగుచుండుట వలన ఆయా కాలములలో మహాత్ములు పుట్టి వానిని సరిదిద్ద యత్నించుచుందురు. ఆ మహాత్ములు చెప్పి యాచరించినదానిలో పైపైకి వాని రూపములు వేఱుగా గనిపించినను వాని మూలరూపములు ఒకటే. మనుష్యులు సాధారణముగా ఆశకు వశులై తాము తప్పు పనులు చేయుచుందురు. ఆశచేఁ దప్పు పనులు చేయుచు అందులోనే సుఖము శుభము గలుగునని తలఁతురు. కాని వాస్తవమునకు ఆశలోఁ బడుటయే దుఃఖమునకు మూలమని తెలియలేకున్నారు. అందుచే ఆశను వదలుము అని ప్రపంచము పుట్టినదగ్గఱ నుండి అందఱు మహాత్ములు చెప్పుచునే యున్నారు. అజ్ఞానులైన ప్రజాసామాన్యమున కిది మనస్సున కెక్కదు. ఆ మహాత్ములు మననము చేసి చెప్పినదే మతము అయినది. తమ దేశకాలపరిస్థితులను అవగాహనము చేసికొని చెప్పిన మతప్రవక్తల మూలాశయములను గ్రహించలేక యా మతముల బాహ్యరూపములనె చూచి సత్యాన్వేషణము చేయనివారికి దేశకాలభేదములలో నేర్పడిన మతములు భిన్నములుగను విరుద్ధములుగను దోఁచును. ఆ మతకర్తల యాశయములో సూక్ష్మమైన భేదములున్నను ఆచరణకు అవి యడ్డురావు. అసలు అది సరియైన మతమే యయినచో దానికి ఇతర మతముతో విరోధము రానేరాఁగూడదు. ఆశ వదలి ప్రేమతో నుండుటయే మతమునకు మూలము. మతము

యొక్క మూలసూత్రములను జూడక పై పై విషయములను జూచి తమ మత సత్యములను జూడకపోవుటచే ఆ యా మతములవారు తమ మతమె గొప్పదని గర్వించి యితర మతముల వారితోఁ గలహించుచుఁ దమ మతములలోనికి ఇతర మతముల వారిని గలుప యత్నింతురు. ఇటువంటివారికిఁ దమ తమ మతముల మూలాశయమేమో తెలియనే తెలియదన వచ్చును. దేశకాలములనుబట్టి ఆచారవ్యవహారములలోను దేశభాషలలోను ఏవైనఁ గొలఁది భేదములున్నను వానిని సమన్వయదృష్టితోఁ బరికించి సరుదుకొనవలసినదే కాని ఏమాత్రము సంఘర్షణము కలహము చేయరాదు.

పూర్వపు భారతఋషులు రచించిన ధర్మశాస్త్రములలో వర్ణాశ్రమ విభాగము అంగీకరింపఁబడినది. దేవునిగూర్చియు ఆత్మను గూర్చియు నిశ్చయము చేయఁబడినది. బుద్ధుడు వర్ణాశ్రమ విభాగమును అంగీకరింపలేదు. దేవుడు ఆత్మ అనునవి అవ్యాకృతములు (నిర్వచింపరానివి) అని చెప్పెను. వీని విషయములో పూర్వ ఋషుల భావమునకు బుద్ధుని యుపదేశములకు విరోధము పైకిఁ గన్పట్టునట్లు తోఁచుచున్నది. కాని లోతుగ ఆలోచించినచో వానికి అట్టి విరోధము లేకపోవుటయే గాక ఏకతయుఁ దోఁపక మానదు. పూర్వము ఋషులు మనుష్యులలో బ్రాహ్మణులు ఉత్తములని చెప్పిరి. మఱియును బ్రాహ్మణు లెవరు? ఎందుకు వారు ఉత్తములైరి? అని ప్రశ్నించుకొని శమదమాదులు (అంతర్బహిరింద్రియ నిగ్రహాదులు) గలవారె బ్రాహ్మణులు అనియు 'నకులేన నజాత్యాహి క్రియాభిర్బ్రాహ్మణో భవేత్' (భారతము) కులముచేతను జాతి



చేతను బ్రాహ్మణుఁడు గాఁడు. సత్కర్మలచేతనె బ్రాహ్మణుఁడగును అనియు చెప్పిరి. విప్రాణాం జ్ఞానతో జ్యైష్ఠం (మనుస్మృతి) జ్ఞానమువల్లనే బ్రాహ్మణులకు శ్రేష్ఠత్వము గలుగుననియుఁ జెప్పిరి. మఱి వారు ఆశకు లోఁబడి ధనాదులు పుచ్చుకొనరాదని "ప్రతిగ్రహరుచి ర్నస్యాత్" ధనాదులు ప్రతిగ్రహించుటయందు ఆసక్తి గలవాఁడయి యుండరాదనిరి. సరే పుచ్చుకొనునయ్యా వాఁడేమగును? అనఁగా "స్థిత్యర్థాదధికం గృహ్ణన్ బ్రాహ్మణో యాత్యధో గతిం" శరీరము నిలఁబెట్టుకొనుట కంటె ఎక్కువ పుచ్చుకొన్నచో అధోగతి గలుగునని చెప్పిరి. దీనికిని బుద్ధుడు బ్రాహ్మణాది ధర్మములలో చెప్పిన దానికిని భేదము కొంచెమైనను లేదు. నేఁడు సంఘములో నున్న వర్ణములు సరియైన వర్ణములు కాకపోవుట చేతనె బుద్ధుఁడు వర్ణవ్యవస్థను ఖండించెను. పూర్వము ఋషులు చేసిన విభాగము జీవితవృత్తులను బట్టి ధర్మప్రక్రియ విభజింపఁబడినది. బుద్ధుని కాలమునకే వర్ణవ్యవస్థ పాడైనది. నేఁడు అసలు సంఘములో ఏ వర్ణమును లేదు. అసలు వర్ణధర్మములోఁ బరార్థమై వారు చేయవలసిన వృత్తులు చెప్పఁబడెను. నేఁడు ఎవరో కొందఱు వ్యక్తులను తప్పించినచో మిగిలినవారందఱు స్వార్థపరులె. పూర్వ ధర్మములో స్వార్థపరత్వమునకుఁ జోటే లేదు. అర్ధకామములకు దాసులయిన లోకులు తలఁచునదే ధర్మముగా గ్రహింపరాదు.

ఇంక ఆత్మసంగతి. ఆత్మను నమ్మినచో జన్మలను పుణ్యపాపఫలములను అనుభవించునది యేది యని ప్రశ్నించుకొని పూర్వులు ఆత్మను అంగీకరించిరి. బుద్ధుఁడు ఆత్మవిచారణలో

భిన్నమతములను ప్రదర్శించి ఆత్మవాదమును ఈశ్వర వాదమును అవ్యాకృతముగా (చూ. 83 పుట) స్పష్టముగా చెప్పరానిదిగా చెప్పెను. జన్మలను పుణ్యపాపాదులను అనుభవించుట యెట్లు అనుదానికి క్రింది విధముగా సమాధానము చెప్పఁబడెను. పాలు పెరుగుగా మాఱుటకై కాచఁబడుట మొదలగు రూపములను పొందుచున్నవి. పెరుగు వెన్నగా వగుటకు మథింపఁ బడుచున్నది. ఇట్లే పుణ్య పాపాదులను జేసిన జీవుఁడు తన తరువాతి రూపమును పొందును. పూర్వరూపము తరువాతిదానికిఁ గారణమగుచున్నది. ఇది జన్మజన్మాంతరములకును వర్తించును. ఇట్లు వారు చిత్త ప్రవాహమును అంగీకరింతురు. ఇందులో నామములోనే గాని అసలు విషయములో ఎక్కువగా భేదము గానరాదు. ప్రస్తుతము ధర్మాచరణము ముఖ్యమను దృష్టితో సగుణ నిర్గుణ శివకేశవాది భేద పరిహారమునకై ఈశ్వర వాదమును గూడ బుద్ధుఁడు అవ్యాకృతమనెను. బుద్ధుఁడు స్వర్గాది లోకములనంగీకరించునట్లు గనిపించుచున్నది. పూర్వఋషులు మోక్షమునకు సమాధిని సాధనముగాఁ జెప్పిరి. బుద్ధుఁడు నిర్వాణమునకు ధ్యానమును జెప్పెను. ధ్యానము సమాధి యీ రెండును ఒకటే. బుద్ధుఁడు చెప్పిన భిక్షుధర్మములకు పూర్వులు చెప్పిన సంన్యాసధర్మములకు భేదము అంతగాఁ గన్పట్టదు. నిష్కామకత్వవైరాగ్య బ్రహ్మచర్యములు సమానములె పోనీ ఏ మాత్రమైనను గొంత భేదమున్నదని యన్నను అవి సాంఖ్యాది ధర్మములకు ప్రాచీన ధర్మములకుఁ గలిగినంత మాత్రము భేదమె గలదు. లోకములోని సామాన్యజనులలోఁగల భావములను పురస్కరించుకొని మతములలో భేదమున్నదని కలహింప



రాదు. పూర్వాచార్యులలోఁ గూడ మతఖండనములు లేకపోలేదు. కాని అవి వారి వారి కాలములలోఁ గల అధర్మ ప్రాబల్యమును తగ్గించుటకై ఏర్పడినవిగా మనము తలంపవలయును. కనుకనే పురాణములలో బుద్ధుని దశమావతారముగాఁ జేర్కొనుట తటస్థించినది. శివకేశవులకు భేదము గలదని కలహించిన ప్రజలను వివేకులుగా మనము గ్రహింపఁగలమా? ద్వైతాద్వైత విశిష్టాద్వైతమతములు అధికారిభేదములను బట్టి గలిగినట్లే బౌద్ధాదిమతములును అధికారిభేదమునుబట్టి గలిగెనని మనము చెప్పుకొని సమన్వయించుకొని మనము వాని మూలములను ఆ యా కాలములలో ఆ మహానుభావులెందుకు అట్లు చెప్పవలసివచ్చినదో తెలిసికొని పరస్పరసహము గలిగి వారి వారి ధర్మములను చక్కఁగా గ్రహించి యాచరింపఁ బూనుకొందుముగాక.

ఈ నా "బుద్ధభగవానుఁడు—జీవితసంఘటనలు" అను గ్రంథము పూర్వపు త్రిపిటకములను ఆధారము చేసికొని వ్రాయఁబడినది. ఇందు ముఖ్యమైన సంఘటనలును ముఖ్యమయిన బుద్ధోపదేశములును వీలైనంత సమగ్రముగాఁ జేర్పఁబడెను. త్రిపిటకములలో మహిమలకు ప్రాధాన్య మీయఁబడినది. ఇది బుద్ధుని ఆశయములకు విరుద్ధమను భావముతో అలౌకికసంఘటనలకు ప్రాధాన్యమీయక లౌకిక మానవత్వమె యిందు ప్రదర్శింపఁబడినది.

అన్ని విధముల బౌద్ధ మతమును గూర్చి తెలుపుటకై క్షేత్ర, మతాది విషయములును దెల్పఁబడినవి. దీనిని సహృదయులు తగినరీతితో నాదరించి తగు ఫలితమును పొందుదురుగాక యని యాశించుచున్నాను.

22-2-59, ఇట్లు,
ఆర్షగ్రంథమాల. చర్ల గణపతిశాస్త్రి.
16-9-95



పూజ్య
గాంధి మహాత్మునికి

# విషయసూచిక

—*—

| | పుట | | పుట |
|---|---|---|---|


# బుద్ధభగవానుఁడు – జీవితసంఘటనలు

## బుద్ధుని జన్మ

జంబూద్వీపమున భారతవర్షమను దేశము గలదు. అందు మధ్యప్రదేశమున బీహారులోఁ దూర్పుగ కజంగలమను రాష్ట్రము గలదు. నేఁడది బీహారులో సంథాలు జిల్లాలో 'కంకజోలు' అను పేర పిలువఁబడుచున్నది. అందు శాక్యవంశ రాజులు ప్రసిద్ధులు శాక్యకులము సూర్యవంశీయుఁడైన ఇక్ష్వాకుని వంశములోని యొకశాఖ. శాకవృక్షములతో నిండిన నివాసములు గలవారై యుండుటచే వారు శాక్యులనఁబడిరి. ఆ కజంగమును శుద్ధోదనుఁడను శాక్యవంశపురాజు పరిపాలించుచుండెను. అతనికి కపిలవస్తుపట్టణము రాజధానిగా నుండెను. అది కపిల మహాముని వాస్తువునందు (పట్టణము కొఱకు ఏర్పఱచఁబడినచోట)గట్టఁబడిన పురము గాన కపిలవస్తువనఁబడెను. అతనికి మహామాయ, ప్రజావతి అనునిద్దఱు భార్యలు గలరు. ఆషాడోత్సవములలో ఒకనాఁడు మహామాయ స్నానముచేసి పరిశుద్ధురాలై యుపవాస వ్రతముపూని నిశ్చలమనస్సుతో రాత్రి నిదురించెను. రాత్రిసమయమున ఆమె "ఒక తెల్లనియేనుఁగు తనగర్భమున జొచ్చినట్లు" కల గనెను. ఆమెకు ఒక మహాపురుషుఁడు జనించునని బ్రాహ్మణులు స్వప్నఫలము చెప్పిరి. పిదప ఆమె గర్భవతి యయ్యెను. పది మాసములు నిండిన పిదప ఆమెకు తన పుట్టినింటికిఁ బోవవలయునని కోరిక గలికొనది. ఆమె కోరిక ప్రకారము శుద్ధోదనమహారాజు కపిలవస్తు పట్టణమునుండి యామె పుట్టినిల్లు దేవదహపట్టణమునకుఁ బంపెను. మహామాయ దేవదహ పట్టణమునకుఁ బోవుచు మార్గమధ్యమున లుంబియను శాలవనములో క్రీ. పూ. 923 సంవత్సరమున వైశాఖ పూర్ణిమనాఁడు

బుద్ధునిఁ గనినది. ఆ సమయముననే యా యా ప్రదేశములందు బుద్ధునికిఁ గాఁబోవు భార్య యశోధర, సారథి ఛందకుఁడు, అమాత్యుఁడగు కాలఉదాయి, ఉత్తమగజము, కంఠకమను గుఱ్ఱము. మహాబోధి వృక్షము ఉద్భవించెను. అనంతరము పరివారము రెండు నగరములవారును కుమారుని తల్లిని దీసికొని కపిలవస్తు నగరముఁ జేరిరి.

శుద్ధోదనునకుఁ గుమారుఁడు కలిగెనని విని కాలదేవలుఁడను నామాంతరము గల యసిత మహర్షి చూచుటకు వచ్చెను. రాజు కుమారునిచే ఋషికి నమస్కారము చేయించెను. అసిత మహర్షి చూచి యాశ్చర్యపడి "ఈ కుమారుఁడింటిలో నున్నచో మహా చక్రవర్తి యగును. ఇల్లు వీడినచో బుద్ధుడయి (మహా జ్ఞానియయి) సర్వప్రాణుల నుద్ధరించును" అని చెప్పెను.

కుమారుఁడు పుట్టిన కాలమున జనులు సకల సంపదలతో తులతూగుచుండిరి. ప్రజల యర్థములు సిద్ధించుటచే తండ్రి తన కుమారునకు సిద్ధార్థుఁడని పేరు పెట్టెను. సిద్ధార్థుఁడు పుట్టిన యేడవనాఁడు తల్లి మహామాయ తన సపత్నియగు ప్రజాపతి గౌతమి చేతిలోఁ గుమారుని నప్పగించి పరలోకమున కేగెను. గౌతమి యొడిలోఁ బెరిగి క్రమముగాఁ గుమారుఁడు గౌతముఁడనఁబడెను.

## బుద్ధుని బాల్యము

ఒకనాఁడు శుద్ధోదనుఁడు తొలకరికి ముందు ఒకటి తక్కువగా ఎనిమిది వందల నాగళ్ళతోఁ బొలము దున్నుచు హలోత్సవము ఏఱువాఁక పండుగు సాగించుచుండెను. అంతఃపురము



కూడ ఉత్సవము చూచుటకు వచ్చెను. పరిచారికలు కుమారుని ఒక్కనిని ఒక చెట్టుక్రిందఁ గూర్చుండఁ బెట్టి యుత్సవములో మునిఁగియుండిరి. అపుడు సిద్ధార్థ కుమారుఁడు పద్మాసనము వైచుకొని ధ్యాననిమగ్నుఁడయ్యెను. పరిచారిక లది చూచి యబ్బురపడి రాజునకుఁ జూపిరి.

క్రమముగ సిద్ధార్థుఁడు పదునాఱు సంవత్సరముల వాఁడయ్యెను. ఒకనాఁడు తోటలో విహరించుచు బాణము దెబ్బ తిని క్రిందఁబడిన యొక హంసను జూచి దాని ప్రాణములు కాపాడెను. పినతండ్రి కొడుకు దేవదత్తుఁడు తన బాణముచేఁ బడిన యా హంసను దీసికొన వచ్చెను. అపుడు కొట్టినవానిదే హంస అని దేవదత్తుఁడన రక్షించినవానిదే అని గౌతముఁ డనెను. చివరికి "రక్షించినవానిచే గాని కొట్టినవానిది గాదు హంస" అని న్యాయాధికారి యిచ్చిన తీర్పుచేత నిరాశుఁడై యప్పటి నుండి సిద్ధార్థుని మీఁద దేవదత్తుఁడు అసూయ వహించియుండెను.

## వివాహము–వైరాగ్యము

అది మొదలుకొని సిదార్థుఁడు విరాగియై యుండ మొదలిడెను. శుద్ధోదన మహారాజు తన కొడుకు వైరాగ్యమును అసిత మహర్షి చెప్పిన భవిష్యవాణిని దలఁచుకొని తన కుమారునికి రాజ్యభోగాదులందుఁ గోరిక కలుగుటకై వివాహము చేయ నిశ్చయించి యొక యుపాయము పన్నెను. ఒకరోజున రాజకుమారునిచే కన్యలకుఁ గానుకలిప్పింపఁ జేసెను. ఆ కానుకలిచ్చునప్పుడు రాజకుమారుని దృష్టి యొక కన్యపై లగ్న

మగుట చూచి యాకన్య దేవదహమహారాజగు దండపాణికుమార్తె యైన గోప యని తెలిసికొని యామెను దన కుమారునికి పెండ్లి చేసెను. గోపకు యశోధర, మృగ్య, ఉత్పలవర్ణ అను నామములు గూడఁ గలవు. వివాహమైన నాఁటినుండి రాజకుమారుఁడు తన భార్యయందు మిగుల అనురాగము గలవాఁడై యుండెను. ఇట్లుండ ఒక దినమున సిద్ధార్థుఁడు తన తండ్రి సెలవు పొంది సమస్తాలంకార శోభితమగు కపిలవస్తు పట్టణమును జూడ రథమెక్కి బయలుదేఱెను. శుద్ధోదనుఁడు తన కుమారునకు దుఃఖకర దృశ్యములు గనిపింపకుండ నగరము నలంకరింపఁజేసి కట్టుదిట్ట మొనర్చెను. సారథి ఛందకుఁడు రథము నడపుచుండెను.

## ముసలివారు మొదలగువారిని చూచుట

దైవవశమున దారిలో సిద్ధార్థునకు ఒక ముసలివాఁడు కనఁబడెను. వానిదంతము లూడిపోయియుండెను. జుట్టు నెఱసినది. ఒడలు ముడతలు పడినది. చేతితో నొకకఱ్ఱ పట్టుకొని వెళ్ళుచుండెను. ముసలివానిని ఎప్పుడును జూడని సిద్ధార్థుఁడు ఛందకుని నడిగెను. "సౌమ్యుఁడా! ఇతఁడెవరు? వీని జుట్టుకూడ మన జుట్టువలె లేదే" అపుడు సారథి యిట్లనెను. "ఆయుష్మంతుఁడా! ఇతఁడు ముసలివాఁడు. ఈ చిహ్నములు ముసలితనపు లక్షణములు. పడుచుఁదనములో ఇతఁడును మనవలె ఉన్నవాఁడే వయస్సు గడచినకొలఁది శరీరమిట్లు అయిపోయినది." ఇది విని సిద్ధార్థుఁడు వడఁకిపోయి "అయితే మనముగూడ ఇట్లు అయిపోవువారమేనా?" అని విచారముతో నడిగెను. "అవును



అందఱును ఇట్లే అగుదురు" అని సారథి యనెను. ఇది విని వినుటతోడనే సిద్ధార్థుని మనస్సు దుఃఖములో మునిఁగిపోయెను. ఇంక నగరమును జూడఁజాలించి "రథమును ఇంటికి నడపు" మనెను.

ఇట్లే ఒక రోగిని, ఒక శవమును జూచి 'తానును రోగి యగుదునని, తన ప్రాణములును పోయెడివే' యని సారథి వలనఁ దెలిసికొని ముసలితనము, రోగములు, చావు రాకుండ నుండు నుపాయమేమి యని నిరంతరము విచారముతో నాలోచింపఁ దొడఁగెను. "తాను ముసలివా డనగుదునని తలంచుకొన్నప్పుడు వాఁడింక ఈ జీవితములో ఆనందమెట్లు పొందఁ గలఁడు? రోగములచేఁ బీడింపఁబడుచు పుట్టిన ప్రతివాఁడు చని పోవలసినదేనా? చావునుండి తప్పించుకొను మార్గము లేదా? ఓ మూర్ఖపు నరుఁడా! ఎంత భ్రమలోఁ బడియున్నావు. ఏదో యొక దినమున నీ శరీరము మట్టిలోఁ గలిసిపోవలసినదే యని నిశ్చయముగాఁ దెలిసియుండియు నీవెంత యజాగ్రత్తగా నున్నావు. ఎంత మోహాంధుఁడవై యున్నావు" అని విచారించుచు విరక్తుఁడై యుండెను.

ఇట్లు ఆలోచించుచు నొకనాఁడు ఆ నగరము మార్గము వెంబడి పోవు నొక సంన్యాసిని జూచెను. ఆ సంన్యాసిని జూచి యిట్లు సారథి నడిగెను.

"సౌమ్యుఁడా! ఇతఁడెవరు?"

"ఇతఁడు సంన్యాసి." అని సారథి యనెను.

"ఇట్లు జుట్టు తీయించుకొని కాషాయబట్టలు గట్టుకొని తిరుగుచున్నాఁడేమి."

"సంసార సుఖము అసారమని తెలిసికొని, శరీరములు నిత్యములు గావని గ్రహించి యన్నిటిని వదలి భిక్షావృత్తితోఁ దిరుగుచున్నాఁడు."

సిద్ధార్థునికిఁ దానుగూడ సంన్యాసి గావలయునని తలఁపు గలిగెను. ముసలితనము మొదలగువానినుండి ముక్తి పొందుట కీసంన్యాసము నుపకరించునని తలపోసి యానాఁడే యిల్లు వీడ నిశ్చయించుకొనెను.

## రాహులజన్మ

ఆనాఁడే యశోధర యొక కుమారునిఁ గనెను. నాఁటికి సిద్ధార్థునికి ఇరువది యెనిమిదేండ్లు నిండెను.

ఆ వార్త విని నన్ను మ్రింగుటకు ఇంకొక రాహువు ఉదయించెనా "వీఁడు రాహులుఁడు" (రాహువును దీసికొని వచ్చిన వాఁడు) అని సిద్ధార్థుఁడనుకొనెను.

తన కుమారుని నోట వెలువడిన "రాహులుఁడు" అను పేరునే తన మనుమనికి శుద్ధోదనుఁడు పెట్టెను. మనుమఁడు కలిగినందులకు శుద్ధోదనుఁడు పట్టణమంతయు అలంకరింపఁ జేసెను. సిదార్థుఁడు ఆ దినమే యిల్లువీడ నిశ్చయించుకొనుచు మామూలు ప్రకారము రథమెక్కి యుద్యానవనమునకుఁ బోవు



చుండెను. అపుడు కృశాగౌతమి యను క్షత్రియ కన్య మేడ మీదఁ నుండి చూచి సిద్ధార్థుని సౌందర్యమును మెచ్చుకొనుచు ఇట్లనెను. "ఆ తల్లి పరమ శాంతురాలు, ఆ తండ్రి పరమ శాంతుఁడు. ఆ స్త్రీ పరమ శాంతురాలు ఏ పతి యిటువంటి వాఁడో" ఈ మాటలు విని "ఏ రాగాదులు శాంతించుట వలన హృదయము శాంతము కాఁగా తనకుఁ దాను ఎవఁడు ప్రభువుగ నున్నాఁడో యట్టి వానినిగన్న తల్లి పరమ శాంతురాలు, తండ్రి పరమ శాంతుఁడు, భార్య పరమ శాంతురాలు రాగాదులు శాంతించుట వలన మనుజుఁడు పరమశాంతుఁ డగును" అని యామె నాకుఁ బ్రియముపదేశించుచున్నదని తలఁచి యామెకు గురుదక్షిణగా నొక ముత్యాల హారమును బంపెను. ఈ సిద్ధార్థుఁడు ఈ హారమును నాకుఁ బ్రేమ కానుకగాఁ బంపెనని కృశా గౌతమి యనుకొనెను.

## గౌతముని యభినిష్క్రమణము (ఇల్లు వీడుట)

ఆనాఁటి రాత్రి యింటికి గౌతముఁడు ఆలోచనా నిమగ్నుఁడై వచ్చి కొలఁదిసేపు మంచముపై బరుండెను. తమ నృత్యాదులు చూచి యానందింపక పరుండియున్న రాజకుమారునిఁ జూచి యతని కక్కఱలేని యీ నృత్యాదుల వలనఁ బని యేమి" యని యెక్కడి వారక్కడనే నిదురించిరి. కొలఁది సేపటిలో మెలఁకువ రాఁగా రాజకుమారుఁడు ఆ స్త్రీ సమూహమును జూచెను. ఒకతె గుఱ్ఱుపట్టుచుండెను. ఒకతె పండ్లు కొఱుకుచుండెను. ఒకతె నోటి వెంబడి చొంగ కారుచుండెను. కొందఱు వస్త్రములు జాఱి వికృతముగ నుండిరి. ఇది చూచి,

ఆ యంతఃపురమును శ్మశానముగఁ దలఁచి వెంటనే యిల్లు వీడి బయలుదేఱెను. ద్వారముకడనె యున్న తన సారథిని ఛందకుని లేపి కంథకమను గుఱ్ఱమును సిద్ధపఱుపుమని చెప్పి చివరిసారి తన కుమారునిఁ జూడఁగోరి తన భార్య శయనాగారమునకు వెడలెను.

యశోధర తన శిశువు శిరస్సుపైని చేయియుంచి నిదురించుచుండెను. సిద్ధార్థుఁడు చివరిసారి కుమారుని నెత్తుకొనిపోఁదలంచెను. కాని తన భార్య చేయి తొలఁగించినచో ఆమె లేచును. తన ప్రయాణమున కడ్డు కలుగును అని తలఁచి వెనుకకు మరలెను.

ఛందకుఁడు మఱుమాటాడలేక సిద్ధపఱచిన కంథకమను గుఱ్ఱమునెక్కి "కంథకమా! ఈ రాత్రి యిక్కడ నుండి దాటింపుము. నేను జ్ఞానము పొంది సమస్త ప్రజలను సకల విధ దుఃఖములనుండి దాటింతును" అని యనుకొనుచు సిద్ధార్థుఁడు బయలు వెడలెను.

"ఇంత రాజ్యమును ఇట్టి భోగములను విడిచిపెట్టుచుంటివే. నేనొక గొప్ప చక్రవర్తిని గాఁబోవుదునుగదా" అని వెనుదిరుగఁ *గోర్కెపొడమెను. అంత సిద్ధార్థుఁడు ఆ కోర్కెను ద్రోసివైచి తన నిశ్చయమును దృఢపఱచుకొని యట నుండి వెడలిపోయెను. రాజకుమారుని మాట కెదురాడలేక ద్వారపాలకులు కోటగుమ్మమును దెఱచివైచిరి. అతఁడు మూఁడు రాజ్యములు దాటి అనోమానదిదగ్గఱకు (గోరఖ్పూరు జిల్లా) వచ్చెను. సిద్ధార్థుఁడు ఆ గుఱ్ఱముతోనే యొక్క మాటుగా ఆ నదిని దాటెను.



"నేను బుద్ధుఁడనైన పిదపఁ దండ్రిగారిని దర్శింతును" అని తండ్రితోఁ జెప్పుమని చెప్పి సారథి ఛందకునిఁ బంపివైచెను. తన యజమానుని గమ్యస్థానము చేర్చి కంథకమను పేరు గల గుఱ్ఱము మేను విడిచెను. ఛందకుఁడు విచారముతో పాటు వెనుకకు మరలెను.

## తపస్సు

సిద్ధార్థుఁడు అనోమానది దగ్గరనున్న "అనూపియ" అను మామిడి తోటలో ఒక వారము దినములుండి యటనుండి బింబిసారుని పట్టణమగు రాజగృహము చేరెను. అక్కడ భిక్షయెత్తి పరిపోయినది మాత్రమె గ్రహించి భుజింప మొదలిడెను. అది వఱకు బహురుచ్యపదార్థములను దిన్నవాఁడగుటచే అతనికి ఆ మామూలు భిక్ష రుచింపదయ్యెను. అప్పుడు తనలోఁదానిట్లు తలంచుకొనుచు బోధించుకొన సాగెను. "ఓ సిద్ధార్థా! నీవు గొప్ప కులములోఁ బుట్టి సుగంధయుక్తములు బహుమూల్యములునగు భోజనములు భుజించుచు నీవు ఒక సంన్యాసిని జూచి 'ఏనాఁడు సంన్యాసినై భిక్షయెత్తుకొని భుజింతునో' అని తలఁచితివే; ఇప్పుడా భిక్షను భుజించు సమయము రాఁగా ఆ భిక్షను భుజింపలేక విచారించుచుంటివా?" అని తన్నుఁ బ్రబోధించుకొని సంతృప్తితో భుజించెను.

ఈ సిద్ధార్థుని యాకారాదులను జూచి యారాజు బింబిసారుఁడు తన యైశ్వర్యమునిచ్చి తీసికొని సుఖింపుమనెను. "నాకీ యైశ్వర్యమునందుఁ గోర్కెలేదు. జ్ఞానము పొందుటకు

బయలుదేఱితిని" అని సిద్ధార్థుఁడనెను. "అయితే బుద్ధుఁడ (జ్ఞాని) వయిన పిదప ఈ రాజ్యమునకు వచ్చి నాకు జ్ఞానము పదేశింపుము" అని ప్రార్థించెను. "అట్లే వచ్చెదను" అని చెప్పి సిద్ధార్థుఁడట నుండి వెడలిపోయెను.

అట్లు పోవుచు ఉద్దక రామపుత్త్రుఁడయిన యాలార కాలాముఁడను తపస్వి దగ్గఱ సమాధిజ్ఞానమును బొంది బుద్ధత్వమును బొందుట కదియును జాలదని తలఁచి యట నుండి గయకుఁ బోయి గయాశీర్ష పర్వతము దగ్గఱ నిరంజనా (ఫల్గు నద) నది తీరమున "ఉరువేల" అనుచోట ఆఱు సంవత్సరములు ఘోర తపస్సు చేసెను. అచట కౌండిన్యుఁడు మొదలగు భద్రవర్గీయ బ్రాహ్మణు లైదుగురు అతని తపస్సున కాశ్చర్యపడి 'ఇతఁడు ఇప్పుడే బుద్ధుఁడగునో రేపే బుద్ధుఁడగునో' అను నాసతో అతనికిఁ బరిచర్య చేయుచుండిరి. సిద్ధార్థుఁడు కొంతకాలము తిలతండులములతోడను క్రమముగాఁ గేవలజలముతోడను శరీర యాత్ర గడపుచుఁ గఠోర తపస్సు చేసెను. అతని బంగారు కాంతిగల శరీరము శుష్కించి నల్లఁబడెను. ఎముకలపోగు మాత్రమె మిగిలెను. కన్నులు గుంటలు పడెను. శ్వాసను గూడ బంధించి ధ్యానముఁపూను సమయమున ఎక్కువబాధ పొంది స్మృతి తప్పి క్రిందఁ బడెను. అప్పుడొక గొల్లవాఁడు గోవులఁ దోలుకొనివచ్చి పాలు పిదికి యతని నోటఁ బోసెను.

పిదప స్మృతి పొంది జ్ఞానము పొందుట కిది మార్గము గాదని తలంచి కొంచెము కొంచెముగా ఆహారము గ్రహింపఁ



దొడఁగెను. గ్రామములలోను బజారులలోను భిక్షను గైకొన సాగెను. ఇది చూచి యా సంన్యాసు లయిదుగురు "ఇతఁడు తపోభ్రష్టుఁడయ్యె" నని తలఁచి యతనిని వీడి వారణాసికిఁ బోయిరి.

## సుజాత పరమాన్నము పెట్టుట

ఆ సమయమున ఉరువేలకు దగ్గఱ సేనానియను గ్రామములో సేనాను లనఁబడు రైతు కుటుంబమునఁ బుట్టిన సుజాత యను యువతి "నాకు మొగపిల్లవాఁడు పుట్టినచో లక్షలు ఖర్చు చేసి నీకుఁ బూజ చేయుదును" అని ఒక వట వృక్షము దగ్గఱ దేవతను బ్రార్థించెను. ఆమె ప్రార్థన నెఱవేఱినది. అప్పుడామె వైశాఖ పూర్ణిమనాఁడు పూజాకార్యము చేయఁదలఁచి మొదట వేయి గోవులను యష్టిమధు వనములో మేపించి, ఆ వేయి గోవులపాలు అయిదువందల గోవులచేఁ ద్రాగించి, ఆ గోవులపాలు రెండువందల గోవులచేఁ ద్రాగించి యీ క్రమముగా జివరకుఁ బదునాఱు గోవులపాలు ఎనిమిది యావులకుఁ బోసి వైశాఖ పూర్ణిమనాఁడు ఉదయమున ఆ యావుల పాలు పితికించి యాపాలతో స్వయముగా క్షీరాన్నమును వండెను. పిదపఁ దన పరిచారిక పూర్ణతో "పోయి దేవస్థానమును శుభ్రపఱచి త్వరగా రమ్ము" అని చెప్పెను. పూర్ణయును "మంచిది" అని యా వట వృక్షము దగ్గఱకుఁ బోయెను.

అపుడే సిద్ధార్థుఁడు "నేఁడే జ్ఞానము పొంది బుద్ధుఁడను గావలయును" అను దృఢ సంకల్పముతో నుండి భిక్షా కాలము

కొఱకు వేచి యా చెట్టుక్రిందనే కూర్చుండియుండెను. పూర్ణ వచ్చి తూర్పుగఁ జూచి సిద్ధార్థునిఁ బరికించి "నేఁడె మా దేవతలు చెట్టునుండి దిగివచ్చిరి కాఁబోలును" అని తలఁచి తొందరగాఁ బోయి యా సంగతి సుజాతకుఁ దెలిపెను. అది విని సుజాత సంతోషముతోఁ బోయి దివ్యతేజముతో వెలుఁగు సిద్ధార్థుని సమీపించి "దీనిని స్వీకరింపుఁడు" అని మ్రొక్కెను. "నా కోరిక నెఱవేఱినట్లే నీ కోరికయు నెఱవేఱుఁగాక" అని పల్కి సిద్ధార్థుని చేతి కా బంగరు పాత్ర నర్పించెను. అంత పాత్రను సిద్ధార్థుఁడు గ్రహించి నేరంజరానది యొద్దకుఁబోయి స్నానము చేసి యా మధురపాయసమును భుజించి యా కాళీ పాత్రను నదిలోఁ బాఱవైచెను.

## జ్ఞానము పొందుట.

పిదప సుందరమగు శాలవనములో విహరించి సాయంకాలము బోధివృక్షము క్రిందఁ దృణములు పఱచుకొని తూర్పు దిక్కై బోధి వృక్షమును ఆనుకొని "నా శరీరము నశించిన నశించుఁగాక నాకు సంపూర్ణముగ జ్ఞానోదయము కానిదే యీ యాసనము నుండి లేవను" అని దృఢ నిశ్చయముతో ఆసనము వైచుకొని కూర్చుండెను.

"ఎందుకీ కష్టము సుఖముగా రాజ్య భోగములలోఁ బడి యుండక" అని యాశ చట్టున నుదయించెను. కాని యాతని దృఢ ప్రతిజ్ఞ ముందు వెంటనే యా యాశ నశించిపోయెను.

అతఁడు ఆ దృఢ ప్రతిజ్ఞతో నుండఁగా నప్పుడు అతనికి జ్ఞానోదయమయ్యెను. అంత నతఁడు బుద్ధుఁడై జ్ఞానముచే బుద్ధ



భగవానుఁ డయ్యెను. అప్పు డతని నోట నీ పల్కులు వెలువడెను.

"ఈ దేహ గృహనిర్మాతన్, చాలజన్మముల నుండియున్
కాంచక పర్వులెత్తితిన్, జన్మమెత్తుటె దుఃఖము
నేఁడె యోగృహనిర్మాత! చూడఁబడితివి
ఈ గృహంబును మరల నిర్మింపలేవు
చేతి పనిముట్లు చెడె గృహశిఖర మొఱఁగె
మనసు సంస్కారముల్ పోయె నణఁగెఁ దృష్ణ" అని.

(నాధమ్మపదము 153, 154)

## నిర్వాణ మార్గము

జ్ఞానోదయము కలిగిన పిమ్మట అట్లే నలువది తొమ్మిది దినములు ఆహారము లేకుండ సమాధియందుఁ గూర్చుండి బుద్ధుఁడు నిర్వాణానందమున మునిఁగి తేలుచుండెను. అప్పు డతఁడిట్లు మననము చేయఁ దొడఁగెను. "అవిద్యవల్ల సంస్కారము (మానసిక సంకల్పము) కలుగును. సంస్కారమువల్ల విజ్ఞానము (తద్విషయక జ్ఞానము) కలుగును. విజ్ఞానమువల్ల నామరూపములు, నామరూపముల వల్ల ఆఱు ఆయతనములు (1 కన్ను, 2 చెవి, 3 ముక్కు, 4 నాలుక, 5 చర్మము, 6 మనసు) ఆయతనముల వలన స్పర్శ (విషయేంద్రియ సంయోగము) స్పర్శవల్ల వేదన (సుఖదుఃఖాద్యనుభవము) వేదనవల్ల తృష్ణ (ఆశ) తృష్ణవల్ల ఉపాదానము (ఆసక్తి) ఉపాదానము వలన భవము (ఆవాగమనము = ఈ లోకమునకు వచ్చుట) భవమువల్ల జన్మ, జన్మవలన జరామరణ శోకాదులు

కలుగును. విరాగము వలన అవిద్య నశించినచో సంస్కారము నశించును. సంస్కారము నశించినచో విజ్ఞానము నశించును. విజ్ఞానము నశించినచో నామ రూపములు, నామరూపములు నశించినచో ఆఱు ఆయతనములు, ఆఱు ఆయతనములు నశించినచో స్పర్శము, స్పర్శము నశించినచో వేదన, వేదన నశించినచో తృష్ణయు, తృష్ణ నశించినచో ఉపాదానము, ఉపాదానము నశించినచో భవము, భవము నశించినచో జన్మము, జన్మము నశించినచో జరామరణ శోకాదులు నశించును." అని మననము చేసి తెలిసికొని యాసనము నుండి లేచి యీ ధర్మమును ప్రబోధించి జనులను జరామరణ దుఃఖాదుల నుండి విముక్తి పొందించుటకు బుద్ధభగవానుఁడు వారణాసి వైపు బయలుదేఱెను. ప్రజలు కామభోగములలో మునిఁగి పోకుండను, శరీరము శుష్కింపఁజేసి యత్యంతము కష్టము పొందకుండఁగను మధ్యమార్గము నవలంభింపఁ బ్రచారము చేయుటకై బుద్ధ భగవానుఁడు అనేక గ్రామముల వెంబడి పోవుచు నిర్వాణ జ్ఞానమును బోధింపఁ దొడగెను.

## ధర్మచక్ర ప్రవర్తనము

పిదప బుద్ధభగవానుఁడు బోధలు చేయుచుఁ గ్రమముగా వారాణసి యందలి ఋషిపతన మృగదావము (సారనాథు) నకు వచ్చెను. అపుడు అక్కడనున్న పంచవర్గీయ బ్రాహ్మణులు గౌతమబుద్ధునిఁ జూచి 'ఓహో ఆ సాధనాభ్రష్టుఁడగు సిద్ధార్థుఁ డిదిగో ఇటు వచ్చుచున్నాఁడు. మన మితనికి మ్రొక్కరాదు. నిల్చుండి యెదుఱుగాఁ బోయి యతని పాత్రయు దుస్తులు



పుచ్చుకొనఁ బనిలేదు. ఇట ఒక ఆసనము మాత్రము వేయుదము. అతని కిష్టమున్నచోఁ గూర్చుండును" అని అనుకొనిరి.

బుద్ధభగవానుఁడు దగ్గఱకు రాఁగానే తాము అనుకొనిన ప్రకారము నిలువఁజాలకపోయిరి. అందులో నొకఁడు పోయి పాత్రయు దుస్తులు పుచ్చుకొనెను. ఒకఁడు ఆసనము పఱచెను. ఒకఁడు పాద్యమిచ్చెను. ఒకఁడు కాళ్ళదగ్గఱ ఒక పీటపైచెను. మఱొకఁడు కాళ్ళు దోముకొను సాధనము తెచ్చి యిచ్చెను. అపుడు బుద్ధభగవానుఁడు పీటపైని గూర్చుండి కాళ్ళు కడుగుకొనెను. ఆ సమయమున ఆ బ్రాహ్మణులు బుద్ధునిఁ జూచి "ఆయుష్మంతుఁడా!" అని సంబోధింపఁ దొడఁగిరి.

అప్పుడు బుద్ధభగవానుఁడు వారితో నిట్లనియెను. "భిక్షులారా! తథాగతుని పేరుపెట్టిగాని ఆయుష్మంతుఁడా! (ఇది సామాన్యులను బిలుచు పేరు.) అనిగాని పిలువకుఁడు. ఇతఁడు బుద్ధుడైనాఁడు. ఇటు చెవియొగ్గి వినుఁడు. నేను పొందిన యమృతమును మీకొసఁగుచున్నాను. ఉపదేశించుచున్నాను. ఈ యుపదేశము ప్రకారము మీరు ఆచరించిన యెడల దేనికై కులపుత్రులు ఇళ్ళువాకిళ్ళు విడిచి సంన్యాసులగుచున్నారో యట్టి యనుత్తమమైన బ్రహ్మచర్య ఫలమును ఈ జన్మయందే శీఘ్రముగనే సాక్షాత్కరింపఁజేసికొని లాభమొందెదరు" అప్పుడు ఆ భిక్షువులిట్లనిరి. "ఓ గౌతమా! ఆ తపస్సాధనలో భ్రష్టుఁడవై గ్రామముల వెంబడి తిరిగితివి గదా. ఎట్లు ఆర్యజ్ఞాన దర్శనములోని పరాకాష్ఠను, ఉత్తమ మానవ ధర్మమును బొందఁగలుగుదువు."

"భిక్షులారా! తథాగతుఁడు సాధనాభ్రష్టుఁడు కాలేదు. నేటికితఁడు బుద్ధుఁడైనాఁడు. ఇంతకు పూర్వ మెన్నఁడైన మీకిట్లు చెప్పితినా?"

"భగవానుఁడా! చెప్పలేదు"

"ఓ భిక్షులారా! నేను కనుగొన్న యమృతమును మీరును గ్రహించి తరింపుఁడు"

అప్పుడా భిక్షులు బుద్ధునియందు విశ్వాసముంచి యా యుపదేశమును గ్రహింప సిద్ధపడిరి.

"ఓ భిక్షులారా! హీనులు పామరులు అనార్యులు సేవించు కామవాసనలలోఁ బడి కామసుఖములలో మునిఁగి యుండుట, అనార్యులు సేవించు దుఃఖమయమైన కాయక్లేశమును గలిగించు నుపవాసాది కఠోర తపస్సులలోఁబడి యుండుట యను నీ అతిప్రవర్తనలలో నడవరాదు. బుద్ధుఁ డీయతిప్రవర్తనలలోఁ బడక మధ్యమార్గమును గనుఁగొనెను. అది కన్ను తెఱచునది. జ్ఞానమిచ్చునది. శాంతి గూర్చునది. నిర్వాణ మొసఁగునది. ఆ మధ్యమార్గమె యష్టాంగిక మార్గము. 1 సమ్యక్ (=చక్కని) దృష్టి, 2 సమ్యక్సంకల్పము, 3 సమ్యగ్వచనము, 4 సమ్యక్కర్మ, 5 సమ్యగ్జీవిక, 6 సమ్యక్ప్రయత్నము, 7 సమ్యక్స్మృతి, 8 సమ్యక్సమాధి. ఇదియే మధ్యమార్గము. (1) జన్మమెత్తుట దుఃఖము, ముసలితనము దుఃఖము, చావు దుఃఖము, అప్రియ వస్తువులలోఁ గలియుట దు ఖము, ప్రియవస్తువులతో నెడఁబాటు దుఃఖము, కోరినది లభింపకపోవుట దుఃఖము ఇవి యుత్తమ సత్యములు (2) ఈ దుఃఖములకుఁ గారణములైన జన్మతృష్ణ,



కామతృష్ణ, విభవతృష్ణ ఈ మూఁడును సత్యములె. (3) ఆ దుఃఖముల నిరోధించుటయు సత్యమె. (4) సమ్యగ్దృష్టి మొదలగు అష్టాంగములు ఆ దుఃఖములను నశింపఁజేయు సాధనములు సత్యములె. ఈ నాలుగును ఉత్తమ సత్యములు. ఓ భిక్షువులారా! ఇదివఱకెన్నఁడు వినని యీ ధర్మములలో నా కన్ను తెఱచుకొన్నది. ప్రజ్ఞ యుద యుంచినది. విద్య యుత్పన్నమైనది. ఇదివఱకు ఇవి కనలేదు. వినలేదు. తెలిసికొనలేదు. ఈ విధముగా జ్ఞానోదయమైనది" అని బుద్ధ భగవానుఁడు చెప్పఁగా ఆ పంచవర్గీయ భిక్షువులు బుద్ధభగవానుని యుపదేశమును విని సంతోషముతో "భగవానుఁడా! మాకు ధర్మదీక్ష యిచ్చెదరు గాక" అనిరి. "భిక్షులారా! రండు, ధర్మము చక్కఁగా వ్యాఖ్యాతమైనది. చక్కఁగ దుఃఖములను క్షయింపఁ జేసికొనుటకు బ్రహ్మచర్యము పాలింపుఁడు" అని చెప్పి వారికి దీక్ష యిచ్చెను.

## యశుని సంన్యాస దీక్ష

కులీనుఁడగు యశుఁడు వారాణసిలోని యొక వైశ్యుని కుమారుఁడు. అతనికి హేమంత ఋతువునకొక మేడ, గ్రీష్మ ఋతువునకొక మేడ, వర్షాఋతువునకొక మేడ ఇట్లు మూఁడు మేడలు గలవు. అతఁడు వర్షాకాలము నాలుగు నెలలు, వర్షాఋతువు మేడలో స్త్రీలు గీతనర్తనాదులతో సేవించుచుండ మేడనుండి క్రిందకుఁ దిగకయే విహరించుచుండెను.

ఒకనాఁడు యశునికి నిద్ర మెలకువ వచ్చెను. రాత్రియంతయు అక్కడ దీపము వెలుఁగుచుండెను. అప్పుడతఁడు

అక్కడ నిద్రించు తన పరివారమువైపు దృష్టి నిగిడించెను. ఒకతె యొడిలో వీణ పడియున్నది. ఒకతె మెడదగ్గఱ మద్దెల యున్నది. ఒక స్త్రీ కేశములు చెల్లాచెదరై యుండెను. ఒక వనితకు నోటినుండి చొంగ కాఱుచుండెను. ఒక కాంత గుఱ్ఱు పెట్టుచుండెను.

ఇది యంతయు అతనికి ఒక శ్మశానముగఁ గనుపట్టెను. అంత అతనికి అసహ్యము గలిగినది. మనస్సున వైరాగ్యము అంకురించెను. "అయ్యో! దుఃఖితుఁడను. పీడితుఁడను" అని యశుని నోటనుండి వెడలెను.

అపుడు యశుఁడు బంగారు పాదుకలు తొడుగుగొని యింటి తలుపు తెఱచుకొని నగరము వెలుపలకు నడచెను. ఋషి పతనమందలి మృగదావము (కాశీ దగ్గరనున్న సారనాథము) వైపు నడచెను.

ఆ సమయమున రాత్రి వేకువవేళ లేచి బుద్ధభగవానుఁడు ఆఱుబయట నిటునటు తిరుగుచుండెను. దూరము నుండి యశుఁడు వచ్చుచుండుట బుద్ధభగవానుఁడు చూచి తిరుగుట మాని పఱచిన యాసనముపైని గూర్చుండెను.

అపుడు యశుఁడు భగవానుని సమీపించి "అయ్యో! దుఃఖితుఁడను, పీడితుఁడను" అనెను.

"యశుఁడా! మేము దుఃఖశూన్యులము మేము పీడా రహితులము" అని భగవానుఁడనియె.



యశుఁడు ఆ మాటలు విని సంతోషముతోఁ బ్రసన్న చిత్తుడై బంగారు పాదుకలు విడిచి భగవానుని దగ్గఱకుఁ బోయి నమస్కరించి ఒక ప్రక్కఁ గూర్చుండెను.

అప్పుడు బుద్ధభగవానుఁడు కామవాసనల దుష్పరిణామమును గూర్చి, నిష్కామత్వ మహిమనుగూర్చి, జరామరణాది దుఃఖములకు మూలమగు కామమును గూర్చి, ప్రపంచ నశ్వరత్వమును గూర్చి నిర్మల నిత్య నిర్వాణానందమును గూర్చి యుపదేశించెను.

ఇది వినఁగా యశునికి నిర్మలమైన ధర్మచక్షువు ఉదయించెను. బుద్ధభగవానుఁడు యశునికి దీక్ష యిచ్చెను.

మఱునాఁడు యశుని గానక వాని తల్లిదండ్రులు బుద్ధుని సమీపించి యశుని దీక్ష సంగతి విని బుద్ధుని యుపదేశముచే వారును దీక్ష గైకొనిరి.

* * * *

## భద్రవర్గీయులు

బుద్ధ భగవానుఁడు వారాణసిలో స్వేచ్ఛగ విహరించి, యఱువదిమంది భిక్షువులను ధర్మోపదేశమునకై యా యా దేశములకుఁ బంపి యురువేల (నేఁటి బుద్ధగయ) వైపు తిరుగఁ దలఁచి యటు బయలుదేఱెను.

బుద్ధ భగవానుఁడు మార్గమునుండి తొలఁగి యొక వనములో ఒక చెట్టుక్రిందకుఁ బోయి కూర్చుండెను.

ఆ సమయమున ముప్పదిమంది మిత్రులు భద్రవర్గీయు లనువారు తమతమ కాంతలతోఁ గూడి యా వనములోనే విహరించుచుండిరి. వారిలో ఒకనికి భార్యలేదు. వారు వానికై యొక వేశ్యను గొనితెచ్చిరి. ఆ భద్రవర్గీయులందఱు మత్తులోఁ బడి యొడలు తెలియని స్థితిలోఁ బడి యుండఁగా నా వేశ్య వారి భూషణము లన్నిటిని దొంగిలించుకొని పాఱిపోయెను.

వారందఱు ఆ వేశ్యను వెదకుచుఁ జెట్టుక్రిందఁ గూర్చుండి యున్న భగవానునిఁ జూచి యటకుఁబోయి యిట్లనిరి.

"అయ్యా! ఇటనే స్త్రీనైనను జూచితిరా"

"నాయనలారా! మీకు స్త్రీతోఁ బనేమి" అని బుద్ధుఁడనెను. అపుడు వారు జరిగిన సంగతి చెప్పిరి.

"అయితే నాయనలారా! మీ రేమనుకొనుచున్నారు. మీరు ఏదో యొక స్త్రీని వెదకుట మంచిదా? మిమ్ములను వెదకుకొనుట మంచిదా? ఏది యుత్తమమైనది."

"ఓయి భగవానుఁడా! మమ్ములను వెదకుకొనుటయె మంచిది. ఇదే యుత్తమమైనది."

"అయితే నాయనలారా! కూర్చుండుఁడు. నేను మీకు ధర్మమును ఉపదేశింతును."

"మంచిది భగవానుఁడా" అని యా భద్రవర్గీయులు భగవానునికి నమస్కరించి యొక ప్రక్కఁ గూర్చుండిరి.



అప్పుడు బుద్ధుఁడు వారికి జరామరణాది దుఃఖములకు మూలమగు రాగద్వేషాదులను వాని నుండి తప్పించుకొను నిష్కామమార్గమును నిర్వాణమును బోధించెను.

అపుడు వారిట్లనిరి "అయ్యా! మీ చేతితో మాకు దీక్ష యొసఁగుదురు గాక."

"సరే" అని బుద్ధభగవానుఁడు వారికి దీక్ష యిచ్చెను.

* * * *

## బింబిసారుఁడు-సారిపుత్రాదులు

బుద్ధభగవానుఁడు సంచరించుచు ఉరువేలలోని జటాధారులైన యురువేల కాశ్యపునికి, నదీకాశ్యపునికి, గయాకాశ్యపునికి దీక్ష యొసఁగి ఆ కాశ్యపులు ముగ్గురును వేయిమంది భిక్షువులును తన్ను అనుసరించుచుండ బింబిసారుని కిచ్చిన మాట ప్రకారము రాజగృహమునకుఁ జేరెను.

దారిలో ఒక మేకల మందను దోలుకొనుచు ఒక గొల్లవాఁడు పోవుచుండెను. అందు ఒక మేఁకపిల్ల గాయి తగిలి కుంటుచు నడవలేక మెల్లఁగాఁ బోవుచుండెను. దానిని మందతో పాటు పోవుటకు గొల్లవాఁడు కొట్టుచుఁ దోలుచుండెను.

అది చూచి బుద్ధభగవానుఁడు ఆ మేఁక పిల్లను దన భుజములపై నెక్కించికొని గొల్లవానితో నిట్లనియెను. "ఓ సౌమ్యుఁడా! ఈ మందను ఎక్కడికిఁ దోలుకొని పోవుచుంటివి"

"అయ్యా! బింబిసారుని యింటికి" అని యతఁడనెను.

"ఇన్ని మేఁకలు ఆ రాజునకు ఎందుకు"

"అయ్యా! అక్కడ మహారాజుగారొక యజ్ఞము చేయుచున్నారు. అక్కడ వీటిని బలి యిచ్చెదరఁట"

"అయ్యో! ఎంత యజ్ఞానము" అని పలుకుచు బుద్ధ భగవానుఁడు బింబిసారుని యింటిని సమీపించెను. లోపల ఋత్విక్కులు మంత్రములు చదువుచుండిరి. బింబిసారుఁడు అగ్నిలో ఆహుతులు అర్పించుచుండెను. బుద్ధభగవానుఁడు భుజము మీఁద మేఁకపిల్లతో లోనికిఁ బ్రవేశించెను.

"ఓ రాజా! ఈ సన్నాహమంతయు సెందులకు"

"స్వర్గాదులు పొందుటకు"

"రాజా! నోరులేని యీ జంతువులను జంపినందుచేతనే స్వర్గాదులు వచ్చినచో నోరు వాయిగల నన్ను బలియిచ్చినచో ఇంకను ఎక్కువ ఫలములు గలుగును గదా, కాన నన్ను బలిగొని యీ పశువులను వదులుము" అనెను.

అంత బింబిసారుఁడు అతనిని గుర్తుపట్టి మహాజ్ఞానమును బొంది తనకిచ్చిన మాటప్రకారము వచ్చిన సిద్ధార్థుని బుద్ధ భగవానునిగాఁ దెలిసికొని యా పశు యజ్ఞమును చాలించి వాని నన్నిటిని విడిపించి ధర్మోపదేశము చేయ నిట్లు బుద్ధుని వేడెను.

"భగవానుఁడా! ఎన్నఁడు నా దేశమునకు బుద్ధుఁడవై వచ్చి మమ్ము ధన్యమొనరింతువో యను కోరికతో నుంటిని. నేఁటికది తీఱినది ధన్యుఁడను. నాకు ధర్మోపదేశము చేసి దీక్ష యొసఁగుదురుగాక" అనెను.



"సరే మంచిది" అని బుద్ధభగవానుఁడు ధర్మోపదేశము చేసి దీక్ష యిచ్చి అతని యాతిథ్యము గ్రహించెను. అంత బింబిసారుఁడు పట్టణమునకు అంత దూరము అంత దగ్గఱ గాకుండ నొక రమ్యమైన ప్రదేశమున ఆ బుద్ధ సంఘమునకు ఒక విహారమును (భిక్షువులుండు నివాసగృహమును) నిర్మింపఁజేసెను.

ఆ రాజగృహములో నుండు సమయమున సారిపుత్రుఁడు మౌద్గల్యాయనుఁడు అనువారిరువురు బుద్ధభగవానుని ఘనతను అశ్వజితునివలనఁ దెలిసికొని గురువగు సంజయ పరివ్రాజకుఁడు వలదనుచున్నను తన శిష్యులతో వచ్చి బుద్ధభగవానుని దగ్గఱ శిరస్సు వంచి ప్రవ్రజ్యను ఉపసంపదను గ్రహించిరి.

* * * *

## పిప్పలీ మాణవకుఁడు - భద్ర కాపిలాయని

పిప్పలీ మాణవకుఁడు మగధ దేశమందలి మహాతీర్థ బ్రాహ్మణుల గ్రామములో నివసించు కపిల బ్రాహ్మణుని కుమారుఁడు. భద్రకాపిలాయని మద్ర దేశమందలి సాగల నగరములో నివసించు కౌశిక గోత్రుఁడగు నొక బ్రాహ్మణుని కుమార్తె. పిప్పలీ మాణవకునికి ఇరువది యేండ్లును, భద్ర కాపిలాయనికి పదునాఱు ఏండ్లును వచ్చెను.

"అబ్బాయీ! నీకు వయస్సు వచ్చినది. పెండ్లి చేసికొని మన వంశమును నిలుపుము" అని వాని తల్లిదండ్రులు తొందర పెట్టిరి.

"నా చెవిలో నిట్టిమాట వేయకుఁడు. మీరున్నంతవఱకు మీకు సేవ చేయుదును. పిదప సంన్యాసి నగుదును" అని పిప్పలీమాణవకుఁడు వారితో ననెను.

కొంతకాలమైన పిదపఁ దలిదండ్రులు కుమారునికి మరలఁ జెప్పిరి. అతఁడు మరల వలదనెను. పిదప వానితల్లి పదేపదే చెప్పఁదొడఁగెను. అపుడా మాణవకుఁడు తల్లికిఁ దెలియఁజెప్పఁ దలఁచి కంసాలిచే ఒక చక్కని స్త్రీ బొమ్మను బంగారముతోఁ దయారు చేయించి "అమ్మా! ఇటువంటి యందము గల స్త్రీ లభించినచోఁ బెండ్లి చేసికొందును" అని చెప్పెను.

ఆ మాణవకుని తల్లి పండితురాలు. "నా కుమారుఁడు పుణ్యాత్ముఁడు. ఇదివఱలో ఇతఁడు దానధర్మములు చేసియుండును. తప్పక యితనికి ఇట్టి రూపముగల స్త్రీ దొరకకమానదు" అని యామె తలఁచి ఎనమండ్రు బ్రాహ్మణులను బిలిచి వారికి వలయు ధనమొసఁగి "మనకు జాతిలోను గోత్రములోను భోగములోను అనుకూలమైన యిట్టి యందము గల స్త్రీని జూచి పెండ్లి కాయపఱచి నమ్మకమునకై యీ బొమ్మను వారిదగ్గఱ నుంచి రండు" అని వారిని బంపెను.

వారును బయలుదేఱి దేశములు తిరుగుచు మద్రదేశము సాగల నగరమునకు వచ్చి యా ప్రతిమను స్త్రీలు స్నానము

చేసి వచ్చిపోవుచోట ఒక గట్టుమీఁద నుంచి యొక ప్రక్కఁ గూర్చుండిరి. అప్పుడు భద్ర యొక్క పరిచారిక భద్రను స్నానము చేయించి యింటికిఁ బంపి తిరుగఁ దాను స్నానము చేయుటకు రేవునకు వచ్చెను. అక్కడి బంగారు బొమ్మను జూచి "ఇదియేమే మరల వచ్చి యిక్కడ నిలుచుంటివి" అని యా బొమ్మ వీఁపుపైని చేతితోఁ దట్టెను. అపుడు ఆమెకు 'అది బంగారుబొమ్మ' అని తెలిసెను. 'ఈమె నా యజమానురాలు అనుకొన్నాను. ఇది మా యజమానురాలి బట్టలుదుకు చాఁకలి దానివలెఁ గూడ లేదు' అనెను. అప్పుడా బ్రాహ్మణులు ఆమెను చుట్టుముట్టి "మీ యజమానురాలు ఇట్లుండునా?" అనిరి.

"ఈ బొమ్మవలెనా! ఈ బొమ్మకంటె వందరెట్లు, వేయిరెట్లు, లక్షరెట్లు అందమైనది. ఇంటిలో ఆమె యున్నచో దీప మక్కఱలేదు. ఆమె కాంతికిఁ జీఁకటి పారిపోవలసినదే".

"ఓహో అలాగుననా?" అని యా బొమ్మను దీసికొని యా పరిచారికతోఁ గూడ ఆ కౌశికగోత్ర బ్రాహ్మణుని యింటికిఁ బోయి తాము వచ్చిన పని యా బ్రాహ్మణునికిఁ జెప్పిరి. ఆ బ్రాహ్మణుఁడును వారిని గౌరవించి తన యంగీకారమును దెలిపెను. అంతట నా బ్రాహ్మణులు "కన్య దొరకినది" యని యక్కడనుండి కబురంపిరి.

"అట్టి కన్య దొరకదని తలఁచి యట్లు చేసితిని. 'కన్య దొరకిన' దని వారు తెలుపుచున్నారు. నాకు వలదని జాబు వ్రాయుదును" అని యాలోచించి పిప్పలీమాణవకుఁడు రహస్యముగా "భద్రా! నీ జాతి గోత్రములకు భోగమునకుఁ దగిన

యిల్లు వెదకికొనుము. నేనిల్లు విడచి సంన్యాసినగుదును. తరువాత దుఃఖపడవలసి వచ్చును" అని యొక జాబు భద్రకుఁ బంపెను. ఆ భద్రయును 'నన్ను యువకునికిఁ బెండ్లి చేయఁదలఁచియున్నారు." అని తెలిసికొని రహస్యముగా "ఆర్యపుత్ర! నీ జాతిగోత్రములకు భోగములకుఁ దగిన యిల్లు వెదకికొనుము నే నిల్లు విడచి సంన్యాసిని నగుదును. పిదపఁ బశ్చాత్తాప పడవలసివచ్చును" అని యొక జాబు వ్రాసి మాణవకునికిఁ బంపెను.

ఆ యిద్దఱు వార్తాహరులు దారిలోఁ గలిసికొనిరి. వారిద్దఱు ఆ జాబులు చదివి "ఏమి యీ పిల్లల పని" యని తలఁచి యా జాబులు చింపివైచి మరల అనుకూలముగ అంగీకరించినట్లు జాబులు వ్రాసి వారికి అందించిరి. వారి బంధువులు దీనికి సంతసించిరి. ఈ విధముగా వారిరువురకుఁ బెండ్లి జరిగినది.

ఆ దినముననే పిప్పలీమాణవకుఁడు భద్రయు రెండు పూలమాలలు గ్రుచ్చించి మంచము మీఁద మధ్యగా నుంచిరి. మాణవకుఁడు కుడివైపు నుండి భద్ర ఎడమవైపు నుండి యా మంచమెక్కి పరుండిరి. ఒకరినొకరు తాకుదురేమో యను భయముతో రాత్రియంతయు నిద్రింపకయె యుండిరి. పగలు ఒకరినొకరు విలాసముగఁ జూచుటగాని నవ్వుటగాని లేదు. ఈ విధముగ సంసారసుఖమున లిప్తులు గాకుండనె తల్లిదండ్రులు జీవించినంత కాలము గడపిరి.

తల్లిదండ్రులు పోఁగానే కుటుంబ భారము నెత్తిపైని బడినది. మాణవకుని దగ్గఱ చాల సంపదయుండెను. యఱువది



పాతర్ల ధాన్యము పండ్రెండు యోజనములవఱకు వ్యాపించిన పొలములు అనూరాధ పురమువంటి పదునాలుగు దాసగ్రామములు, పదునాలుగు ఏనుఁగు గుంపులు, పదునాలుగు గుఱ్ఱముల గుంపులు, పదునాలుగు రథసంఘములు గలవు. అతఁడొక నాఁడు గుఱ్ఱమెక్కి పొలమునకుఁ బోయి పొలము దిబ్బ మీఁద నుండి పొలము దున్నుచుండ నందు నాఁగటి చాలులోఁ పక్షులు వ్రాలి పురుగులను దినుచుండుట చూచి "నాయనలారా! అవి యేమి తినుచున్నవి" అని యాపనివారి నడిగెను. "పురుగులను" అని వారు చెప్పిరి. "అవి తినిన పాపము ఎవరిది" అని యతఁడు మరల ప్రశ్నించెను. "అయ్యా! తమదే" అని వారనిరి. అతఁడప్పుడిట్లు ఆలోచించెను. "ఈ పాపము నాదే యయిన యెడల ఇంత ధనము ఇన్ని భూములు ఇన్ని గ్రామములు నాకున్నందువల్లఁ బ్రయోజన మేమున్నది? ఇది యంతయు భద్ర కప్పగించి యిల్లు వీడి పోయెదను" అనుకొనెను.

ఇక్కడ ఇంటి దగ్గఱ ఆ సమయమునకే భద్ర కూడ మూఁడు కడవల నువ్వులు ఎండపోయించి పరిచారికలతోపాటు కూర్చుండి యుండెను. పక్షులు ఆ నువ్వులలోని పురుగులను దినుచుండఁ జూచి భద్ర పరిచారికలతో నిట్లనెను.

"అమ్మా! ఈ తినఁబడునవి యేమి."

"అమ్మా పురుగులు"

"ఈ పాపము ఎవరిది" అని యడిగెను.

"అమ్మా! తమదే" అని వారనిరి.

అప్పుడామె యిట్లు ఆలోచించెను. నాకుఁ గావలసినది నాలుగు గజముల చీర, ఒక సోలెఁడు బియ్యము, ఈ పాపమం

తయు నాదేయైన యెడల వేయిజన్మ లెత్తినప్పటికిని ఇదిపోదు. ఆర్యపుత్త్రుఁడు రాఁగానే యీ సంపద యంతయు అతని కప్పగించి సంన్యసించెదను" అని.

మాణవకుఁ డింటికి వచ్చి సౌధముపై కెక్కి తన యాసనమునఁ గూర్చుండెను. పరిచారికలు రాజుకుఁ దగిన భోజనము తెచ్చిరి. తాను భుజించెను. భద్రయు భుజించెను. పరిజనులు వెడలిపోఁగానే యేకాంతమున నిరువురు కూర్చుండిరి. మాణవకుఁడు భద్రతో నిట్లనెను.

"భద్రా! నీవిక్కడికి వచ్చునపుడెంత ధనము తెచ్చితివి"

"ఆర్యపుత్త్రా! ఏఁబది యయిదువేల బండ్లు"

"అదియును ఈ యింటిలోని ఎనుబది యేడుకోట్ల ధనము ఈ పొలములు ఈ సంపద యంతయు ఇదిగో నీ కప్పగించుచున్నాను.

"మఱి మీ రెక్కడికిఁ బోయెదరు"

"నేను సంన్యాసి నగుదును"

"ఆర్యపుత్త్రా! నేనును మీ రెప్పుడింటికి వచ్చెదరా అని చూచుచుంటిని. నేనును సంన్యాసిని నగుదును" ఆమె యనెను.

"మన యీ సౌధములు (జన్మలు) మండుచున్న గడ్డి యిండ్లవలె నున్నవి. మనము సంన్యాసు లయ్యెదము గాక" అని వారిద్దఱు ఆలోచించి కాషాయ బట్టలు మట్టి పాత్రలు తెప్పించి యొకరి కేశము లొకరు కత్తిరించి "ప్రపంచముతో నున్న యార్హతులఁగూర్చి మా యీ సంన్యాసము" అని తలఁచి వెంటనే మేడదిగి వెడలిపోయిరి.



ఈ సంగతి పరిజనుల కెవ్వరికిఁ దెలియదు. వారు ఆ గ్రామము విడిచి పోవుచుండ దాసగ్రామములలోని జనులు వీరిని గుర్తుపట్టి కాళ్ళపైని బడి "మమ్ము అనాథులఁ జేసి పోయెదరే" అని యేడ్చిరి.

"మా సౌధములు (జన్మలు) మండుచున్న గడ్డి యిండ్లవలె నున్నవి మిమ్ము ఒక్కొక్కరినే దాస్యమునుండి విడిపింపఁ బూనినచోఁ గొన్ని యేండ్లయినను బట్టును. మీయంత మీరే తల కడుగుకొని ఈ దాస్యము నుండి ముక్తులు కండు" అని చెప్పి వారేడ్చుచుండఁగనె వారిని విడిచి వారిద్దఱు వెడలిపోయిరి.

దారిలో మాణవకుఁడు వెనుదిరిగి భద్రను జూచి "ఈమె నాతోఁ గూడ వచ్చుచుండుటచూచి యితఁడు సంన్యాసి యయియు కూడ ఈ స్త్రీని విడిచిపెట్టలేక కూడఁ దీసికొని వచ్చుచున్నాఁడు. ఇది యనుచితము అని యెవరైన ననుకొన వచ్చును. కాన ఈమెను విడిచి యొంటిగఁ బోవుట మంచిది" యని తలఁచెను.

ముందు దారి రెండుగ విడిపోవుట చూచి తన భావ మామెకుఁజెప్పి "ఈ దారివెంబడి నీవు పొమ్ము. ఈ దారివెంబడి నేను బోయెదను" అనెను. ఆమెయు "సరే" అని యతనికి నమస్కరించి "ఎంతకాలము నుండియో వచ్చెడి యీ మన సంబంధము నేఁటితో విడిపోయినది" అని యామె యెడమవైపుగను అతఁడు కుడివైపుగను వెడలిపోయిరి.

× × × ×

పిదప బుద్ధభగవానుఁడు తనదగ్గఱకు వచ్చిన మాణవకు నకు భద్రగాపిలాయనికి ధర్మోపదేశము చేసెను. పిదప ఆ మాణవకుఁడు మహాకాశ్యపుఁ డనఁబడెను.

* * * *

## గోపాల మాత – కాత్యాయనుఁడు

ప్రద్యోత మహారాజు బుద్ధభగవానుని పేరు విని అతనిని దన యుజ్జయినికి రప్పింపఁదలఁచి తన పురోహితుఁడగు కాత్యా యనునిఁ బిలిచి యిట్లనెను.

"తండ్రీ! తమరు బుద్ధ భగవానుని దగ్గఱకు వెళ్ళ వలయును."

"మహారాజా! నేను సంన్యాసినగుటకుఁ దమరాజ్ఞ యిచ్చి నచో వెళ్ళెదను" అని కాత్యాయనుఁడనెను.

"తండ్రీ! ఏమైనను సరే బుద్ధ భగవానునిఁ దీసికొని రండు."

అని రాజు అనెను. పిదపఁ గాత్యాయనుఁడు ఏడెనమం డుగురను గూడఁ దీసికొని బుద్ధభగవానుని దగ్గఱకు వెళ్ళి ధర్మోప దేశమును విని యా యెనమండుగురతో పాటు దీక్ష స్వీక రించెను.

ఒకసారి కాత్యాయనుఁడు "ఉజ్జయినికి రావలసినది"గా భగవానుని గోరెను.

"పోవరానిచోటికి బుద్ధులు పోరు. నీవే వెళ్ళుము. నీవొక్కఁ డవె వెళ్ళినప్పటికిని రాజు సంతసించును." అని భగవానుఁ



డనెను. భగవానుఁడింక రెండవమాట పలుకఁడని తలఁచి భగవానునికి నమస్కరించి తనతోఁ గూడ వచ్చి దీక్ష పొందిన యా యేడుగురు భిక్షువులతోఁ గూడ ఉజ్జయినికిఁ బోవుచు దారిలో 'తేలప్పనాలి' యను పట్టణమునుజేరి భిక్షకై పట్టణము లోనికిఁబోయి తిరుగుచుండెను.

ఆ పట్టణములో ఇద్దఱు వైశ్యపుత్రికలు గలరు. అందు ఒకతె దరిద్రుల యింటియందు జనించెను. తల్లి దండ్రులు చనిపోయిన పిదప ఆమె తన పరిచారిక సాయముచే జీవ యాత్ర గడపుచుండెను. ఆమె చాల యందమైనది. ఆమె కున్నంత పొడవైన జుట్టు ఎవరికిని లేకుండెను.

రెండవ వైశ్యపుత్రిక చాల ధనవంతుల బిడ్డ. కాని ఆమెకు జుట్టులేదు. ఆమె చాలసార్లు "వందయైనను సరే వేయి యైనను సరే యిచ్చెదను. ఆ జుట్టు నాకు ఇమ్ము" అని కబురు లంపియును ఆమె జుట్టును పొందలేక పోయెను.

ఈ భిక్షువులు భిక్షకై తిరుగుచు శూన్యపాత్రలతోఁ బోవు చుండ ఈ దరిద్రురాలగు వైశ్యపుత్రిక చూచెను. "నా దగ్గఱ ఏమియు లేదు. ఆ ధనవంతురాలు ఈ జుట్టుకై కబురు లంపు చున్నది. ఈ జుట్టుకై వచ్చిన ధనముతో ఈ భిక్షులకు దాన ధర్మము చేయుదుఁను గాక" అని యప్పుడామె తలంచి తన జుట్టు కత్తిరించిపైచి "అమ్మా! ఈ జుట్టు ఆ ధనికురాలికిచ్చి యామె యెంత యిచ్చిన అంత తెమ్ము ఈ భిక్షులకు దాన ధర్మము చేయుదును" అని తన దాదితో చెప్పెను.

ఆ దాదియుఁ గన్నీళ్ళు తుడుచుకొని గుండె దిట్టపఱచుకొని యా భిక్షుల దగ్గఱ ఆ జుట్టు బట్టతోఁ గప్పి యా ధనికురాలి దగ్గఱకుఁ బోయెను.

"ఇదివఱలో నేనెంత ధన మిచ్చెదనన్నను ఈమె యివ్వనన్నది. ఇప్పుడు కత్తిరించి తెచ్చినది గాన వీటికి సరిపోవు ఖరీదు మాత్రమె యిచ్చెదను" అని తలఁచి యిచ్చెను.

"ఇదివఱకు నీ యజమానురాలికిఁ జాల ధన మిచ్చెదనని చెప్పి కూడఁ బుచ్చుకొనలేక పోతిని. ఇప్పుడు నీ యిష్టము వచ్చిన చోటికిఁ బట్టుకొనివెళ్ళి అమ్ముకో ఇప్పుడు ఎనిమిది కార్షాపణములకంటె ఎక్కువ ఇవ్వను" అనెను. ఆ దాది యవి తీసికొనిపోయి తన యజమానురాలి కిచ్చెను. ఆమె ఆ ధనముతో భిక్షువుల కెనమండుగురకు భిక్ష పెట్టించెను.

ఆ దాదిని జూచి 'మీ యజమానురాలు ఏది' అని యా భిక్షువులడిగిరి. అప్పుడా వైశ్యపుత్రిక వచ్చి నమస్కరించెను. ఆ దాదియు జరిగిన సంగతి యా భిక్షువులతోఁ జెప్పెను.

వారు ఆమె త్యాగమునకు మెచ్చి వెడలిపోయిరి.

పిదప వారు ఆ గ్రామమువీడి ప్రద్యోత మహారాజుతోటలో విడిసిరి. అప్పుడు అక్కడకు వచ్చిన మహారాజునకు ధర్మోపదేశము చేసి ఆ వైశ్యపుత్రిక త్యాగమును జెప్పిరి.

అంత నారాజు ఆ వైశ్య పుత్రికను రావించి తన యగ్రమహిషినిగాఁ జేసికొనెను.

కొంత కాలమున కా వైశ్యపుత్రి కొక కొమరుఁడు కలిగెను. ఆ కుమారునికి ఆమె మాతామహుఁడగు గోపాలుని పేరు పెట్టిరి.



అప్పటి నుండియు ఆమెకు గోపాలమాత యను పేరు ప్రసిద్ధమయ్యెను.

ఆ గోపాలమాత ఆ భిక్షులు నివసించుట కొక తోటలో విహారమును గట్టించెను.

* * * *

## శుద్ధోదనుఁడు - యశోధర

తన కుమారుఁడు సిద్ధార్థుఁడు చాల వత్సరములు తపస్సు చేసి బుద్ధ పదవిని బొంది ధర్మోపదేశములు చేయుచున్నాఁడని విని శుద్ధోదనుఁడు కుమారుని దీసికొని రావలసినదని పరిజనులతోఁ గూడ నొక యమాత్యునిఁ బంపెను. అతఁడును బోయి "తండ్రి యాహ్వానమును ఈ రోజు వినిపింతును. ఆ రోజు వినిపింతును" అనుకొనుచు బుద్ధభగవానుని ధర్మోపదేశములు విని పరిజనులతోఁ గూడ దీక్ష గైకొని యక్కడనే యుండిపోయెను.

ఎప్పటికిని మంత్రి తన కుమారునిఁ దీసికొని రాకపోవుటయును అటనుండి ఏ వర్తమానమును రాకపోవుటయును జూచి రాజు క్రమక్రమముగా తొమ్మండ్రు మంత్రులను బంపెను. వారును అట్లే దీక్ష గైకొని యటనే యుండిపోయిరి.

పిదప 'కాల ఉదాయి' అను విశ్వాసపాత్రుఁడైన మంత్రిని జూచి "తండ్రీ! నాకుఁ గుమారునిఁ జూడవలయునని యున్నది. ఎంతమందిని బంపినను తిరిగి కబురైనను వచ్చుట లేదు. నేను బ్రతికియుండగఁ గుమారునిఁ జూడవలయునని

యున్నది. నీవైనను వెళ్ళి నాకుమారునిఁ దీసికొనివచ్చి నాకుఁ జూపింపఁగలవా" అని యడిగెను.

"ప్రభూ! అట్లే చూపింపఁగలను. కాని నేను సంన్యాసి నగుటకు అనుజ్ఞ యిప్పింపవలెను" అనెను.

"తండ్రీ! నీవు సంన్యాసి వగుము, కాక పొమ్ము. నా కుమారునిఁ దీసికొనివచ్చి చూపింపుము అంతే చాలు" అని రాజనియె

"మంచిది అట్లే తీసికొనివచ్చి చూపింతును" అని చెప్పి యాకాల ఉదాయి బుద్ధభగవానుని దగ్గఱకుఁ బోయి ధర్మోప దేశము విని దీక్ష గ్రహించెను.

వారణాసిలో ఆశ్వయుజ పూర్ణిమవఱకు వర్షావాసము గడ పిన పిదప బుద్ధభగవానుఁడు ఉరువేలలో మూఁడు నెలలుండి పుష్యమాస పూర్ణిమకు రాజగృహముచేరి యట రెండు నెలలు గడపెను.

అంత కపిలవస్తువునకుఁ బ్రయాణమగుటకు వీలుగ నుండునని తలఁచి కాలఉదాయి బుద్ధభగవానునితో "తండ్రి శుద్ధోదనుఁడు తమ్ముఁ జూడఁగోరుచున్నాఁ"డని విన్నవించెను.

'సరే' అని బుద్ధభగవానుఁడు భిక్షువులతోఁ గూడ రాజ గృహమునుండి రోజుకు ఒక యోజనముచొప్పున అఱువది యోజ నముల దూరము గల కపిలవస్తువును రెండు నెలలలోఁ జేరెను.

శాక్యవంశస్థులు భగవానుఁడు ఉండుటకు రమణీయమైన న్యగ్రోధారామమును శుభ్రపఱచి యలంకరింపఁ జేసిరి. ముందు నగరములోని బాల బాలికలు పిదప రాజకుమారులు, రాజకుమారికలు నడువ వారి పిదవ గంధపుష్పాదులతోఁగూడఁ బోయి బుద్ధభగవానునిఁ బూజాపురస్సరముగ ఆయారామము నకుఁ దీసికొనివచ్చిరి.



మఱునాఁడు బుద్ధభగవానుఁడు భిక్షాపాత్ర, పై వస్త్రముమ దాలిచు భిక్షువులతోఁ గూడఁ గపిలవస్తు పట్టణమునఁ బ్రవే శించెను.

"ఆర్యపుత్రుఁడు సిద్ధార్థుఁడు భిక్షకై బయలుదేఱె" నని విని జనులు రెండు అంతస్థులపైని, మూఁడంతస్థులపైని ఎక్కి, కిటికీలు దెఱచి చూడఁ దొడఁగిరి.

రాహులుని తల్లి యశోధర కిటికీనుండి "చూచి రాజ మర్యాదలతో బంగరు పాలకిలోఁ గూర్చుండి యే పట్టణములో విహరించెనో, యా పట్టణములోనే యార్యపుత్రుఁడు బోడితలతో కావిబట్టలతోఁ భిక్షాపాత్రతోఁ దిరుగుచున్నా"డని కంగారుతో "మీ పుత్త్రుఁడు భిక్షకై తిరుగుచున్నాఁడు" అని రాజుకుఁ గబు రంపెను.

రాజును కంగారు పడుచుఁ జేతితోఁ గట్టుబట్ట సర్దుకొనుచు త్వరగాఁ బోయి భగవానుని దగ్గఱ నిలుచుండి "ఓ భగ వానుఁడా! మమ్మెందుకు సిగ్గుపఱచెదవు. ఈ భిక్షాచరణ మెం దుకు. ఈ మాత్రపు భిక్షువులకు భోజనము దొరకదా" అనెను.

"మహారాజా! ఇది మా వంశాచారము" అని భగవానుఁడు మెల్లఁగా నసెను.

"భగవానుఁడా! మా వంశము బహు ప్రసిద్ధమైన మను రాజవంశము. ఒక రాజుఁగూడ ఎన్నఁడు భిక్ష ఎత్తలేదు" అని

పలికి రాజు సమస్త భిక్షువులతోఁగూడ భగవానునిఁ గోటలోనికిఁ దీసికొనిపోయి యుత్తమ భోజ్యములతో సంతృప్తి పఱచెను.

భోజనమైన పిదప యశోధర తక్క సమస్త రాణివాసము వచ్చి భగవానునికి నమస్కరించెను.

భగవానుఁడు సారిపుత్రుఁడు మౌద్గల్యాయనులతోఁ గలిసి యశోధర శయనాగారమునకుఁ బోయెను. అపు డాయశోధర చిక్కిన మేనుతో వచ్చి భగవానుని కాళ్ళపైఁబడి నమస్కరించెను. "భగవానుఁడా! మా అమ్మాయి యశోధర తమరు కావి బట్టలు ధరించిరని విని యా దినము మొదలుకొని కావిబట్టలు ధరించి యొకపూటె భుజించుచు సువాసన ద్రవ్యములు విసర్జించి భిక్షురాలైనది" అని శుద్ధోధనుఁ డనెను.

పిదప భగవానుఁడు మెల్లఁగా నుపదేశముచేసి వెడలిపోయెను.

* * * *

## శాక్యానీనందులు

ఒకనాఁడు బుద్ధభగవానుఁడు కపిలవస్తు పట్టణమునకు భిక్షకై బయలుదేఱి నందుని మందిరము ముందు నిలచెను. శాక్యానీనందులు మేడ పై భాగమున నుండిరి. వారు విలాసములలో మునిఁగి తేలుచుండిరి. దాసదాసీ జనము సుగంధాది వస్తువులు తయారు చేయుచుండిరి. బుద్ధభగవానుఁడు కొఁది సేపుండెను. ఎవరును జూడలేదు. అంత నతఁడు అటనుండి వెడలిపోవుచుండెను. అపు డొక పరిచారిక మేడ కిటికీ నుండి



చూచినది. అంత ఆమెకుఁ గాలు నిలువలేదు. వెంటనే తొందరగా పరుగెత్తుకొని వెళ్ళి నందుని దగ్గఱ వ్రాలి "బుద్ధభగవానుఁడు మీ యన్న భిక్షకై వచ్చి వెడలిపోవుచుండె" నని చెప్పెను. లోకముచేఁ బూజితుఁడై భగవానుఁడని పేరుపొందిన తనయన్న వాకిటికి రాఁగా భిక్షపైనఁ బెట్టకపోతినే" యని తోఁచి వణఁకిపోయెను. అక్కడ అతఁడు ఉండలేకపోయెను. వెంటనే తన ప్రియురాలి దగ్గర "త్వరగా నిపుడే వచ్చెదను" అని పలుకుచు బయలుదేఱెను. అతని భార్య తీవవలెఁ జలించి "ఆర్యపుత్త్రా! ధర్మాతిక్రమణము చేయు" మని యెట్లు చెప్పఁగలను. వెంటనే రమ్ము. మేని మంచిగంధము ఆఱకుండునంత సమయములో రావలయును లేనిచో నిన్ను గట్టిగా శిక్షింతును జుమీ" అని శపథముతోఁ బలుకుచుఁ జేయునదిలేక దీనయై జాలిచూపులతోఁ గన్నీరు కాఱ వెళ్ళుచున్న నందునిఁ జూచుచు ఆడులేడివలె నిలఁబడిపోయెను. తన మనసు భార్యసుందరి వైపు పరువిడుచున్నను శరీరము ముందుకు లాగికొనిపోవుచుండ బుద్ధభగవానుని దగ్గఱకు తొందరగా వెళ్ళి దారిలో నమస్కరించుచున్న ప్రజలను దప్పించుకొని యెదుటనిలిచి నందుఁ డిట్లనెను. "అపరాధము మన్నింపవలయును. నేను మేడపైని ఉండుటచే భగవానుని దర్శింపలేక పోతిని" అపుడు బుద్ధ భగవానుఁడు "మంచిది దానికేమిలే" అని పలికి నవ్వుచు నందుని చేతికిఁ బట్టుకొను మన్నట్లు భిక్షాపాత్రము అందిచ్చి ముందుకు ఆగకుండ సాగిపోవుచుండెను. నందుఁడా పాత్రను పుచ్చుకొననని యెట్లు అనఁగలఁడు. మనస్సు ఇంటివైపు పరుగెత్తుచుండెను. తన చుట్టుగల జనమును భగవానుఁడును ఏమనుకొనునో యని యా పాత్ర గ్రహించి భగవానుని వెనుక నడవసాగెను.

భగవానుఁడు ఆ పాత్రను ఇక్కడనే తీసికొనునో, అక్కడనే తీసికొనునో, ఇప్పుడే తీసికొనునో, అప్పుడే తీసికొనునో అని యనుకొనుచు విధిలేక మనసు వెనుకకు లాగుచున్నను నందుఁడు బౌద్ధ విహారము వఱకుఁ బోయెను. విహారము దగ్గఱకుఁ బోయిన పిదప బుద్ధభగవానుఁడు "నందా! ఏమి. దీక్షను గైకొందువా" అనెను. అసలే భగవానుఁడు ఏమి పలుకునో యని భయపడు నందుఁడు ఈ మాటలు వినఁగనే నిశ్చేష్టుఁడయిపోయెను. నోటి వెంబడి మాట రాలేదు. ఇంతమంది యెదుట అట్టి లోకపూజ్యుఁడైన భగవానుని యెదుట అతనిమాట కాదనుట యెట్లు? మఱి తన సుందరియో. దిగాలుపడిన యా నందుని నోటనుండి యప్రయత్నముగా 'అట్లే' అను మాట వెలువడెను. అంత బుద్ధుఁడు "నందునికి దీక్షయిండు" అని తోడి భిక్షువులతో అనెను. అన్నదే తడవుగా భిక్షులు నందునిజుట్టు తీయించి కషాయ వస్త్రములు గట్టఁబెట్టిరి. ఈ భిక్షువులు ఏమి చేయుచున్నారో అతనికిఁ దెలియలేదు. ఒక ఱాతి ప్రతిమవలె అతఁడు నిలఁబడిపోయెను.

× × × ×

బుద్ధభగవానుఁడు ఆసనమునఁ గూర్చుండి యుండ నొక భిక్షువు వచ్చి యిట్లనెను.

"నేనా బ్రహ్మచర్య వ్రతమును నిశ్చల మనస్సుతోఁ బరిపాలింపలేను. నేను ఈ వ్రతమును పాలింపలేను. ఈ దీక్షను విడిచి గృహస్థుఁడనగుదును, అని మీ పినతల్లి కొడుకు నందుఁడు భిక్షులతో ననుచున్నాఁడు" అని, అపుడు నందునిఁ బిలుచుకొని తమ్మని భగవానుఁడనెను. అంత నందుఁడు వచ్చి నమస్కరించి నమ్రవదనుఁడై యొక ప్రక్క నిలుచుండెను. అపుడు



భగవానుఁడు నందుని తన దగ్గఱగాఁ గూర్చుండఁబెట్టుకొని వీపుమీఁద చేయివైచి "నందా! ఇది నిజమేనా! నేను బ్రహ్మచర్య వ్రతమును పరిపాలింపలేను. ఈ దీక్ష వదలి గృహస్థునగుదును. అని భిక్షువులతో అనుచుంటివఁట నిజమేనా?"

"భగవానుఁడా! అవును. అని నందుఁడు సిగ్గువడుచుఁ బలికెను."

"ఏమి బ్రహ్మచర్యవ్రతమును పరిపాలింపలేవా? మరల గృహస్థుఁడవు కాఁగోరుచున్నావా?"

అపుడు నందుఁడు ధైర్యము తెచ్చుకొని యిట్లనెను.

"భగవానుఁడా! తాము మా యింటికి భిక్షకు వచ్చి వట్టి చేతులతోఁ బోవుచుండఁ దమ్ముని బిలువ నేను మా మందిరము వీడి వచ్చునపుడు జనపద కళ్యాణి యగు శాక్యాని విడిన కేశపాశముతో నావైపు దృష్టి నిలిపి "ప్రియా! త్వరగా తిరిగి రమ్ము" అన్నది. భగవానుఁడా! అది తలఁచుకొని యీ దీక్షను నిశ్చల మనస్సుతో జరపలేక పోవుచుంటిని. నేనీ వ్రతమును పాలింపలేను. గృహస్థుఁడ నగుటకుఁ గోరిక కలుగుచున్నది. క్షమింపుఁడు."

"నీకు నిర్వాణానందము వలదా"

"వలదు భగవానుఁడా."

"నిర్వాణానందము జరా వ్యాధి మరణములను దరింపఁజేయును గదా."

నందునికి సాంసారిక భోగముల సుఖమె తెలియును గాని నిర్వాణానందము సంగతి తెలియదు కాన "గృహస్థుఁడనుగానె యుందును." అనెను.

అపుడు బుద్ధభగవానుఁడు 'నందుని పరిచితమైన భోగములను భావింపఁజేయుట ద్వారానే నిర్వాణానందములోనికిఁ దీసికొని పోవలయు' నని తలఁచి యిట్లనెను.

"సరే కాని నందా! నీవు స్వర్గమునుగూర్చి స్వర్గభోగములను గూర్చి అప్సరస్ స్త్రీల విహారములనుగూర్చి వింటివా?"

"వింటిని" అని నందుఁడనెను.

"పోనీ అవియైన నక్కఱలేదా!"

"అవి యెట్లు లభించును"

"అయితే అట్టి భోగము లెట్టివో యెఱుఁగుదువా?"

"అవి చాల గొప్పవని వింటిని."

"ఆ దేవభోగములముందు ఈ భోగము లెట్టివి."

"అవును. వానిముందు ఇవి తక్కువవే"

"అమర్త్యులైన యప్సరస్ స్త్రీల విహారములకును మర్త్య స్త్రీల విహారములకును బోలిక యేమైనఁ గలదా?"

"ఎట్లు ఉండును."

"అయితే అట్టి స్వర్గభోగములకంటెను గొప్ప భోగములను పొంద నీకుఁ గోరికలేదా!"

"ఉండును"

"అయితే అట్టివి గావలసినచో నిశ్చల మనస్సుతో బ్రహ్మచర్యదీక్ష వహించి యుండవలెను. లేనిచో నీ యిష్టము వచ్చిన ప్రకారము ఈ భోగములలోనే పడి యుండవచ్చును. ఏమందువు."

నందుఁడు సంశయములోఁ బడెను. అతఁడిట్లనెను.



"అవి లభించుట నిజమగునా?"

"అయితే నేను జెప్పుదానిలో నీకు నమ్మకము లేదా?"

నందుఁడు నమ్మకములేదని యెట్లు చెప్పఁగలఁడు? అతఁడిట్లు పలికెను.

"మీ వంటివారు చెప్పుదానిలో నమ్మకము లేక యుండునా?"

"అయితే నేను చెప్పినట్లు చేయుము."

నిర్వాణ సుఖమును గూర్చి లేశమైనఁ దెలియని నందునికి భూలోక భోగముల నెఱిఁగిన నందునికి అప్సరస్ స్త్రీ భోగములందు ఆశ కలిగెను. స్వల్పమగు భూలోక భోగములను వీడి గొప్పవైన స్వర్గలోక భోగములందు మనస్సు లగ్నమైనది. అంత నందుఁడు తలయూపి తన యంగీకారము తెలిపెను. అపుడు బుద్ధభగవానుఁడు "సరే మంచిది దీక్ష వహింపుము." అని చెప్పి నందుని ఆ భిక్షులతోఁ గూడ మరల దీక్ష పూని ధ్యానింపఁబంపెను.

నాఁటినుండి నందుఁడు నిశ్చల మనస్సుతో బ్రహ్మచర్య వ్రతమును బాలింపఁదొడఁగెను. ఇట్లు కొంతకాలము గడచెను.

"నందుఁడు దేవేంద్ర భోగములకై అప్సరస్ స్త్రీలతో విహరించుటకై బ్రహ్మచర్యము నిశ్చల మనస్సుతోఁ బాలించుచున్నాఁడు" అని తెలిసికొని తోడిభిక్షులు పరిహసింపఁదొడఁగిరి.

ఈ పరిహాసములు నందుని చెవి కెక్కలేదు. వెంటనే నిశ్చల మనస్సుతో ఆత్మ సంయమముతో ధ్యానమగ్నుఁడై

బ్రహ్మచర్యమును బాలింపఁ దొడఁగెను. కొంత కాలమునకు నందునిలోఁ గల వాసనలు నశించెను. బ్రహ్మచర్య నిష్ఠుఁ డయ్యెను. చిత్తవృత్తులు క్షీణించెను. ధ్యానములోని అమందానందమును గ్రోలఁ దొడఁగెను. దుఃఖమిశ్రితముగాని ధ్యానసౌఖ్యము అతనికి గోచరమయ్యెను.

ఇది తెలిసికొని యొకనాఁడు బుద్ధభగవానుఁడు నందుని సమీపించి 'నందా! నీవు బ్రహ్మచర్యమును సరిగఁ బాలించితివి స్వర్గము నీ యఱచేతిలోనిదే ఆ స్వర్గభోగములను నీవు పొందఁగలవు' అని యనెను.

"భగవానుఁడా! ఆస్వల్ప స్వర్గభోగములతో నాకుఁబనిలేదు నాకు నిర్వాణానందము గలుగ నాశీర్వదింపుఁడు"

"ఏమి యిట్లందువు."

"భగవానుడా! ఇప్పటికి నిర్వాణానంద మెట్టిదో తెలిసినది సంసార సుఖము దుఃఖ మిశ్రితము."

"నందా నీలోని వాసనలు నశించినవి. నిర్వాణానందము నిదివఱకే పొందితివి" అని మఱియు బుద్ధుఁడిట్లు పలికెను.

తే. గీ. గాఢమగు రాగపంకము గడచెనెవఁడు
ఎవఁడు కామపాశముల ఛేదించపై చె
వేఁడు మోహము నణఁచెనో వాఁడె భిక్షు
వతఁడె సుఖదుఃఖములవిడి నిర్వాణమొందు.
(నాధమ్మపదము)

× × ×



పిదపఁ గొంతకాలమునకు శాక్యాని సుందరి భగవానుని దగ్గఱ దీక్షగైకొని భిక్షురాండ్ర సంఘములోఁజేరి నిర్వాణానందము పొందెను.

* * *

## రాహులుఁడు

ఒకనాఁడు బుద్ధభగవానును ప్రొద్దుటనె వస్త్రములు ధరించి పాత్రయును బైబట్టయును దాల్చి శుద్ధోదనుని యింటికిఁ బోయి యటఁబఱచిన యాసనమునందుఁ గూర్చుండెను.

అప్పుడు రాహులుని తల్లి యశోధర రాహులునిఁ బిలిచి "రాహులా! ఇదిగో నీ తండ్రి, వెళ్ళి నీ పిత్ర్యాస్తి నడుగుము" అనెను. అపుడు రాహులుఁడు భగవానుని దగ్గఱకుఁబోయి నిలుచుండి "శ్రవణా! నీ నీడ సుఖముగా నున్నది." అని పలుక మొదలిడెను. అపుడు భగవానుఁడు ఆశనమునుండి లేచి బయలుదేఱెను. రాహులుఁడు గూడ భగవానుని వెంటఁబడి

"శ్రమణా! నాకు బిత్ర్యాస్తి నిమ్ము" శ్రమణా! నాకుఁ బిత్ర్యాస్తి నిమ్ము" అని యడుగ మొదలిడెను,

"అయితే సారిపుత్రా! ఈ రాహులునికి దీక్ష యిమ్ము" అని భగవానుఁడు సారిపుత్రుని యుద్దేశించి యనెను. అపుడు సారిపుత్రుడు రాహులునిచే బుద్ధుని శరణు చొచ్చుచున్నాను ధర్మమును శరణు చొచ్చుచున్నాను. సంఘమును శరణు చొచ్చుచున్నాను." అని మూఁడు సార్లు అనిపించి దీక్ష యిచ్చెను,

ఇది విని శుద్ధోధనుఁడు మిగుల విచారముతో భగవానుని సమీపించి నమస్కరించి యొకప్రక్కఁ గూర్చుండి యిట్లనెను.

"భగవానుఁడా! మిమ్మొక వరమడుగుచున్నాను"

"బుద్ధులు వరములకు దూరముగ నుందురు."

"భగవానుఁడా! ఉచితమని తోఁచినచో దోషరహితమైనచో నిచ్చెదరుగాక."

"మహారాజా! చెప్పుఁడు."

"భగవానుఁడా! మీరు సంన్యసించినపుడె నాకుఁ జాల దుఃఖము గలిగినది నందుని సంన్యాసము ఇంకను దుఃఖకరమయినది. రాహులునికిఁ గూడ సంన్యాస మిప్పింపఁగా నా దుఃఖమున కింక నంతులేకున్నది. భగవానుఁడా! పుత్త్రప్రేమ నా శరీరమును జీల్చివైచుచున్నది. శరీరమును జీల్చి మాంసమును జీల్చి హృదయమును జీల్చి వైచుచున్నది. ఇంకనెన్నఁడు తల్లి దండ్రుల యనుమతి లేనిదే యెవరికిని దీక్ష యివ్వకుందురు గాక."

"సరే యట్లే" అని చెప్పి "తల్లిదండ్రుల యనుమతిలేనిదే యెవరికిని దీక్ష యివ్వరా"దని భిక్షులకు శాసనముచేసి శుద్ధోధనునకు ధర్మముపదేశించి యటనుండి వెడలిపోయెను.

మఱి కొంతకాలమునకు శుద్ధోధనునకు జబ్బు చేసెను. అప్పుడు శుద్ధోదనుని యిచ్ఛ ప్రకారము శుద్ధోదనుని చివరి సమయములో అక్కడనె యుండి శుద్ధోదనుఁడు చనిపోయిన పిదప బుద్ధభగవానుఁ డతనికి అంత్యక్రియలు చేసెను.

## భద్దియుఁడు

ఒకమాఱు అనూపియ యను వనములో బుద్ధభగవానుఁడు విహరించుచుండెను.



ఆ సమయమున అనేకులు శాక్య రాజకుమారులు బుద్ధుని ధర్మోపదేశములు విని సంన్యాసు లగుచుండిరి. మహానామ శాక్యుఁడు, అనిరుద్ధ శాక్యుఁడు అను సోదరు లిద్దఱు గలరు. అనిరుద్ధుఁడు సుకుమారుఁడు. వానికి శీతకాలమున కొక భవనము, వేసవికాలమున కొక సౌధము, వర్షాకాలమున కొక మేడయుఁ గలవు. అతఁడు ప్రాసాదముల నుండి యెన్నఁడును దిగక యందె భోగముల ననుభవించుచుండెను.

అపుడు మహానాముఁడు తన మనస్సులో "నేఁడు గొప్ప కులస్థులగు శాక్య కుమారులు బుద్ధ భగవానుఁడు సంన్యాసి యగుటఁ జూచి సంన్యాసు లగుచుండిరి. మా కులము నుండి యెవరును ఇల్లు వీడి సంన్యాసులగుట లేదు. నేనుగాని యనిరుద్ధుఁడుగాని యేల సంన్యాసదీక్ష గైకొనరాదు." అని తలఁచుకొని వెంటనే యనిరుద్ధునిఁ బిలిచి యీ సంగతిఁ జెప్పి "నీవుగాని, నేనుగాని సంన్యాసదీక్ష పుచ్చుకొందమా" అని యడిగెను.

నేను సుకుమారుఁడను. ఇల్లు విడిచి నేను సంన్యాసినిగా లేను. నీవే సంన్యాసి వగుము" అని యనిరుద్ధుఁ డనెను. "అయితే నాయనా! ఇట్లు రమ్ము. నీకు ఇల్లు చక్కఁబెట్టుకొనుట తెల్పెదను. మొదటఁ బొలము దున్నింపవలెను. దున్నించి గింజలు చల్లింపవలెను. గింజలు చల్లించి నీరు పెట్టించవలెను. నీరు పెట్టించి పండిన పిదప మరల నీరు తీయింపవలెను. నీరు తీయించి యెండింపవలెను. ఎండింపఁజేసి కోఁత కోయింపవలెను. కోయించి కట్టలు కట్టించవలెను. కట్టించి త్రొక్కింపవలెను. త్రొక్కించి గడ్డి దులిపించి తీయింపవలెను. గడ్డి తీయించి గింజలు ప్రోగుచేయించి యింటిలోఁ బోయింపవలెను.

ఇట్లే ప్రతియేఁడు ఎల్లపుడు చేయింపవలెను. ఈ పనులకు అంతులేదు. వీనికి అంతు గనఁబట్టదు" అనెను. "ఎప్పు డీపనులు ముఁగియును. వీనికి అంతు లేనే లేదా? ఎప్పుడు మనము నిర్విచారముగ నుండి పంచేంద్రియముల భోగము లనుభవించుచుండఁగలము" "నాయనా అనిరుద్ధా! ఈ పనులకంతము లేదు. ఈ పనులకు ముఁగింపు లేనేలేదు. ఈ పనులు ముగించకుండనే మన తండ్రి తాతము త్తాతలు చనిపోయిరి" "అయితే నీవే యీ యిల్లు చక్కఁదిద్దుకొనుము. నేనే సంన్యాసము పుచ్చుకొందును." అని యనిరుద్ధుఁడు వెంటనే తన తల్లిదగ్గఱకుఁబోయి యిట్లనెను.

"అమ్మా! నే నీ యిల్లు విడచి సంన్యాసము పుచ్చుకొన గోరుచున్నాను. నా కనుమతి యిమ్ము."

"నాయనా! మీ యన్నదమ్ము లిద్దఱు నాకుఁ బ్రియులు. నా మాట కెదురాడనివారు నా ప్రాణము పోయినను మిమ్ముఁ బ్రేమింపకుండ నుండఁజాలను. మంచిది. బ్రతికుండఁగనే నే నిట్లు మీ సంన్యాసమునకు అంగీకార మెట్లు ఈయఁగలను."

ఇట్లు తల్లి వలదన్నను అనిరుద్ధుఁడు మాటిమాటికి నడుగ దొడగెను. తల్లి యెంత వలదన్నను అనిరుద్ధుడు మానలేదు. అప్పుడు వానితో "సరేకాని నీ మిత్రుఁడగు శాక్యరాజు భద్దియుఁడు సంన్యాసము పుచ్చుకొన్నచో నీవును బుచ్చుకొనుము" అని యా రాజు సంన్యసింపఁడు గదా యను నుద్దేశముతో వాని తల్లి యనెను.

అపుడు అనిరుద్ధుఁడు శాక్యరాజు భద్దియుని దరికేగి యిట్లనియెను.



"ఓ సౌమ్యుఁడా! నా సంన్యాసము నీ చేతిలో నున్నది

"అయితే సౌమ్యుఁడా! నీ సంన్యాసము నా చేతిలో నున్నచో నే ననుమతి యిచ్చుచున్నాను. ముక్తి పొందితివి సంన్యాసివి కమ్ము."

"సౌమ్యుఁడా! రమ్ము మన మిద్దఱము సంన్యాసు లగుదము."

"సౌమ్యుఁడా! నేను సంన్యాసిని గాలేను. నీకు నేను జేయఁగల సాయము చేయుదును. నీవు సంన్యాసివి కమ్ము".

"నీవు సంన్యాసము పుచ్చుకొన్నచో నాకును సంన్యాసము పుచ్చుకొనుటకు ననుమతి యిచ్చెదనని నా తల్లి యన్నది. కాన మనమిద్దఱము సంన్యాసుల మగుదము రమ్ము"

అప్పటి జనులు సత్యవాదులయి సత్యప్రతిజ్ఞులయి యుండిరి. అపుడు భద్దియుఁడు అనిరుద్ధునితో నిట్లనియె.

"సౌమ్యుఁడా! ఏడేండ్లు ఆగుము. ఏడేండ్లయిన పిదప నిద్దఱము సంన్యాసు లవుదము."

"సౌమ్య! ఏడేండ్ల కాలము చాల యెక్కువ. నే నంత వఱకు వేచి యుండలేము."

"పోనీ యాఱేండ్లాగుము"

"నేనంత వఱకు వేచి యుండలేను"

"అయితే ఒక యేడాగుము"

"అంతవఱకు నుండలేను"

"పోనీ ఒకనెల యాగుము"

"అదియు నెక్కువే! అంతవఱకును ఉండలేను"

అయితే ఒక వారము ఆగుము. నే నీ రాజ్యమును నా కొమారుల కప్పగించి వచ్చెద నుండుము."

"సౌమ్యుఁడా! వారము ఎక్కువ గాదు. అంతవఱ కాగుదును"

అప్పుడు శాక్యరాజగు భద్దియుఁడు, అనిరుద్ధుఁడును ఇంకను సంన్యసింపఁదలఁచిన ఆనందుఁడు, భృగువు, కింబిలుఁడు దేవదత్తుఁడు అను శాక్యపుత్త్రులును ఉపాలి యను మంగలిని దీసికొని పరివారముతోఁ గూడ మఱియొక రాజ్యము వఱకుఁ బోయి పరివారమును వెనుకకుఁ బంపివేసిరి. తమ భూషణము లన్నియు మూటఁగట్టి యిచ్చి యుపాలితో నిట్లనిరి.

"సోదరా! ఉపాలీ! నీవు ఇంటికి వెళ్ళుము. నీ జీవికకు ఇవి సరిపోవును''

అపుడు ఉపాలి ''శాక్యరాజులు కోపనులు. వీఁడు రాజకుమారులఁ జంపె'నని తలఁచి నన్నుఁ జంపివేయుదురు. వీరు రాజకుమారులై యుండి సన్న్యాసు లగుచుండ నింక నాకు మాత్రము వీనితోఁ బనేమి'' అని తలఁచి యా భూషణముల మూటను విప్పి భూషణములను జెట్లపైని వ్రేలాడఁగట్టి 'వీనిని జూచినవాఁడు వీనిని దీసికొనునుగాక' అని యా శాక్యకుమారుల దగ్గఱకుఁ బోయెను.

''ఏమి మరల వెనుకకు వచ్చితివే'' అని యుపాలిని ఆ శాక్యపుత్త్రులడిగిరి. అపుడు ఉపాలి తనకుఁ గలిగిన భావమును జెప్పెను. ''సరే మంచిపని చేసితివి'' అని వారందఱు బుద్ధ భగవానుని దగ్గఱకుఁబోయి యొక ప్రక్కగఁ గూర్చుండి యిట్ల



నిరి. ''ఓ భగవానుఁడా! మేము రాజపుత్త్రులము మాకు అభిమానము మెండు. ఈ యుపాలి మమ్ములను జాల కాలము నుండి సేవించు సేవకుఁడు. మొదట వీనికి దీక్షయిండు. వీనికి నమస్కరించెదము. ఇంక మాకుఁగల యభిమానము పోవును.''

అప్పుడు మొదట భగవానుఁడు ఉపాలికి దీక్ష యిచ్చి పిదప ఆ శాక్య కుమారులకు దీక్ష యిచ్చెను. వారందఱు క్రమముగా జ్ఞానము పొందిరి.

ఒకమాఱు భద్దియుఁడు అడవిలోఁగూర్చుండి "ఆహా ఎంత సుఖముగా నున్నది ఎంత సుఖముగా నున్నది" అనుచుండెను.

ఆ మాటలు విని కొంతమంది భిక్షువులు "ఈ భద్దియుఁడు నిశ్చల మనస్సుతో బ్రహ్మచర్యమును పరిపాలించలేకపోవుచున్నాఁడు. తాను గృహస్థుగానుండి పొందిన రాజ్యసుఖమును దలఁచుకొని అది యెంత సుఖముగా నున్నది ఎంత సుఖముగా నున్నది. అనుకొను చున్నాఁడు." అని తలఁచి బుద్ధ భగవానుని దగ్గఱకుఁ బోయి నమస్కరించి యొక ప్రక్కగాఁ గూర్చుండి యిట్లనిరి. "ఓ భగవానుఁడా! భద్దియుఁడు నిశ్చల మనస్సుతో బ్రహ్మచర్యమును బాలించక రాజ్య సుఖమును దలఁచి ఎంత సుఖముగా నున్నది ఎంత సుఖముగా నున్నది" అని యనుకొనుచున్నాఁడు."

అది విని భగవానుఁడు భద్దియుని రప్పించి యిట్లనెను.

"ఓ భద్దియా! ఆహా! ఎంత సుఖముగా నున్నది. ఎంత సుఖముగా నున్నది యని యనుచుంటివఁట నిజమేనా."

"అవును నిజమే" అని భద్దియుఁడనెను.

"అయితే దేనిని దలఁచుకొని యిట్లనుచుంటివి"

"ఓ భగవానుఁడా! నేను గృహస్థుగా నున్నపుడు రాజ్యసుఖమును అనుభవించుచున్నపుడు అంతఃపురము లోపల అంతఃపురము యొక్క వెలుపల దేశములోను దేశము వెలుపల అన్నిచోట్ల రక్షకభటులు జాగరూకులై పహరా యిచ్చుచునే యుండిరి. అయినను నిత్యము భయముతో అనుమానముతో నుండెడివాఁడను. ఇప్పుడో అడవిలో నున్నను, చెట్లక్రింద నున్నను శూన్య గృహములలోఁ దిరుగుచున్నను నిర్భయుఁడనై యనుమానములేక దొరకిన భిక్షతోఁ దృప్తిపడి సంతోషముతో విహరించుచుంటిని ఈ సంగతి తలఁచుకొని ఆహా యెంత సుఖముగా నున్నది. ఎంత సుఖముగా నున్నది." అనుకొనుచుంటిని. అని భద్రియుఁడనెను.

ఇది వినిన పిదప బుద్ధుని నోటినుండి యీ పలుకులు వెలువడెను.

"మాయొద్ద నేమియున్‌లేక, యాహా యెంత సుఖింతుము
తృప్తియే మాకు నాహార, మా భాస్వరులకున్ బలెన్"

"ఎవని మదిలోన మఃటికి సుంతేని లేదొ
ఎవఁడు లాభ నష్టాదుల నెల్లదాటె
అట్టి నిర్భయు సుఖిని శోకాదిశూన్య
దేవతలుగూడఁ బూర్తిగాఁ దెలియలేరు."

(నా ధమ్మ పదము.)

* * *



# ధర్మ పరీక్ష

ఒకసారి బుద్ధభగవానుఁడు కోసలదేశమున నలకపానుని పలాశవనమున విహరించుచుండెను. ఆ సమయమున అనిరుద్ధుఁడు నందియుఁడు, కింబిలుఁడు భృగువు కుండధానుఁడు రేవతుఁడు ఆనందుఁడు మొదలైన యుత్తమ కులజులగు రాజపుత్త్రులు భగవానుని దగ్గఱ దీక్ష గైకొని యిల్లువీడి సంన్యాసులగుచుండిరి.

బుద్ధభగవానుఁడు భిక్షువులతోఁ గూడ ఆరుబయటఁ గూర్చుండి యుండెను.

"ఓ భిక్షువులారా! శ్రద్ధతో నాదగ్గఱ దీక్ష గైకొనిన వారందఱు మనఃపూర్తిగా బ్రహ్మచర్యమునఁ బ్రసన్నులయి యున్నారుగదా" అని యా భిక్షువులను భగవానుఁ డడిగెను. ఎవరును సమాధానము చెప్పరైరి. మరల మూఁడుసార్లు అడిగినను సమాధానము రాకుండుటఁజూచి "పోనీ నేనే ప్రత్యేకముగ వారి నేల నడుగరాదు". అని తలఁచి భగవానుఁడు అనిరుద్ధుని బిలిచి యిట్లనియెను.

"ఓ యనిరుద్ధా! మీరందఱు నిశ్చలముగ బ్రహ్మచర్యమునందుఁ బ్రసన్నులయి యున్నారుగదా."

"భగవానుఁడా! అవును మేము బ్రహ్మచర్యమునఁ బ్రసన్నుల మయియే యుంటిమి." అని యనిరుద్ధుఁడనెను.

"సెబాసు! సెబాసు! అనిరుద్ధా! మీ రందఱు నిశ్చల మనస్సుతో బ్రహ్మచర్యమునఁ బ్రసన్నులయి యుండుట

శ్రద్ధతో దీక్షగైకొనుట మీవంటి యుత్తమ కులస్థులకుఁ దగి యున్నది. మీరు మంచి పడుచుఁదనములో నుండియు నూనూఁగు మీసములవారై యుండియు కామములను అనుభవించుచుండియు ఇళ్ళు వాకిళ్ళు వీడి సంన్యాసులైతిరి రాజు బలవంతము వలనఁ గాని, దొంగల భయము వలనఁ గాని, అప్పులపాలయి గాని, భయము వలనఁగాని, ఇంటిలోని కలహముల వలనఁగాని సంన్యాసులు గాలేదు. జన్మ జరా మరణ శోకాదులవలనఁ జిక్కకుండ నిర్వాణానందము పొందుటకు సంన్యాసులయితిరి గదా. అనిరుద్ధా! ఇట్లే గదా సంన్యాసులైతిరి."

"అవును భగవానుఁడా!"

"ఇట్లు దీక్షగైకొన్న వారేమిచేయవలయునో తెలియునా? కామభోగముల నుండియు అశుభ కర్మల నుండియు విడివడి యుండవలయును. రాగద్వేషాదులను విడువనంతవఱకు శాంతి యుండదు గదా. మీరు నా విషయములో నేమనుకొనుచున్నారు. భగవానుని కింకను రాగద్వేషాదులు పోలేదు. జన్మ జరా మరణాదులు ఇంకను విడవలేదు కాన ఒకదానినే సేవించుచు ఒకదానినే విడచుచు ఒకటి తీసికొనుచున్నాఁడని తలచుచున్నారా?

"భగవానుఁడా మేమిట్లనుకొనుటలేము. మీకు రాగ ద్వేషాదులు జరామరణాదులు పోయినవి గాన ఒకటే సేవించుచుంటిరి"

"సెబాసు! సెబాసు" అనిరుద్ధా, బాగుగాఁ దెలిసికొంటిరి. రాగ ద్వేషాదులు నశించిన పిదప తల నఱుకఁగా తాటి చెట్లు మొలవనట్లు అవి తిరిగి పుట్టవు.



## అనాథపిండికుఁడు

ఒక సమయమున బుద్ధభగవానుఁడు రాజగృహమున శీతవనమున విహరించుచుండెను.

ఆ సమయమున అనాథపిండికుఁడు తన బావమఱఁది యగు రాజగృహ మందలి శ్రేష్ఠి యింటికి వచ్చి యక్కడ మహోత్సాహముతో అనేకులు వంటలు చేయుచుండుటఁ జూచి యా సన్నాహమంతయు భిక్షులతోఁ గూడిన బుద్ధభగవానుని భోజనమున కని తెలిసికొని తాను మఱునాఁడు భిక్షుసంఘసహితుఁడగు బుద్ధభగవానుని అనేక రుచ్యభక్ష్యములతో సంతృప్తిపఱచి బుద్ధభగవానుని దగ్గఱ ఒక ప్రక్కగాఁ గూర్చుండి యిట్లనెను.

"భగవానుఁడా! తమరు భిక్షుసంఘముతో పాటు వచ్చి శ్రావస్తిలో వర్షానాసము గడపవలయును."

"సరే యట్లే" యని బుద్ధభగవానుఁడు భిక్షుసంఘముతోఁ గూడ శ్రావస్తికి బయలుదేఱెను. అపుడు అనాథపిండికుఁడు మార్గమధ్యమున భగవానుని కనుకూలమగు విహారములు తయారు చేయించెను.

అనాథపిండికుఁడు శ్రావస్తికి ముందుగాఁ బోయి భగవానునికి నివాసము ఎచ్చట ఏర్పఱచిన బాగుండునో యాలోచించెను. ఆ నివాసము శ్రావస్తికి అంతదూరముగ నుండరాదు. మఱియు దగ్గఱగను నుండరాదు. వచ్చుపోవువారి రాకపోకలకు అనువుగా నుండవలయును. పగలు హెచ్చు గుంపులు చేర

కుండ రాత్రి నిశ్శబ్దముగ నుండి యేకాంతమై ధ్యానమునకుఁ దగినదై యుండవలయును. ఇట్లు ఆలోచించి యటువంటి దానికి రాజకుమారుని యుద్యాన మన్ని విధములఁ దగియున్న దని తలఁచి రాజకుమారుని దగ్గఱకుఁ బోయి యిట్లడిగెను.

"ఆర్యపుత్రా! ఈ తోట ఆరామము కట్టుటకు మాకిప్పింప వలయును"

"ఓ శ్రేష్ఠి! కోటి బంగారు నాణెములతోఁ దోట కప్పివను ఈయను"

"సరే అయితే ఆ తోట నేను పుచ్చుకొన్నట్లే"

"ఎట్లు ఇచ్చెదను? నేనీయను" అని రాజకుమారుఁడనెను.

ధర చెప్పఁబడిన పిదప ఆ తోట యీయవలసినదే యని యమాత్యులనిరి. అప్పుడాయనాథపిండికుఁడు బండ్లమీద నొక మాఱు తెప్పించిన బంగారు నాణెములతో నేలయంతయుఁ బఱపించెను. ఇంకను గొంచెము చోటు మిగిలెను. "మరల బంగారునాణెములు తెండని తన మనుష్యులకుఁ జెప్పెను. అది విని రాజకుమారుఁడు "ఇందులో ఏదో మహత్త్వము ఉండి యుండును గనుకనే యిన్ని బంగారు నాణెములతోఁ గప్పుచున్నాఁడు" అని తలఁచి "ఇంక నీయనక్కఱలేదు. మిగిలినది నా దానముగ గ్రహింపుము'' అనెను. దానికి అనాథపిండికుఁడు అక్కడ నివాసగృహములు భోజనశాలలు మలవిసర్జన స్థానములు స్నానశాలలును సరస్సులు విహారశాలలు కట్టించి భగవానునికిచ్చి సంతోషపెట్టెను.

* * * *



## నిందాస్తుతులు – శీలము

ఒకసారి బుద్ధభగవానుఁడు అయిదువందలమంది భిక్షువులతోఁ గూడ రాజగృహమునాలందల మధ్య దారివెంబడి పోవుచుండెను. అపుడు సుప్రియుఁడను పరివ్రాజకుఁడు తన శిష్యుఁడగు బ్రహ్మదత్తునితోఁ గూడ వెళ్ళుచుండెను. సుప్రియుఁడు బుద్ధుని అతని ధర్మమును సంఘమును నిందింపఁ దొడఁగెను. బ్రహ్మదత్తుఁడు మాత్రము పొగడసాగెను. ఈ విధముగా వారిద్దఱు వాదించుచుండిరి. సాయంకాలమునకు అంబలట్టి యను పేరుగల తోటలోని రాజభవనముచేరి అందు భిక్షు సంఘముతో పాటు బుద్ధభగవానుఁడు మకాము చేసెను.

రాత్రి గడచిన పిదప ఉదయము అయిదు గంటలకు బుద్ధుఁడు నిశ్చలముగా ఆసనమునఁ గూర్చుండి యుండెను. అప్పుడు సుప్రియుఁడును బ్రహ్మదత్తుఁడును లేచి మరల పరస్పరము వాదింపసాగిరి. అపుడు భిక్షువులు చేరి వానిని వినుచుండిరి. అది విని బుద్ధభగవానుఁడు వారిని పిలిచి వారు వాదించు విషయమును గూర్చి యడిగెను. అప్పుడు భిక్షువులిట్లనిరి. "భగవానుఁడా! ఈ సుప్రియుఁడు భగవానుని ధర్మమును నిందించుచుండెను. ఈ బ్రహ్మదత్తుఁడు భగవానుని ధర్మమును ప్రశంసించుచుండెను" అని. అపుడు భిక్షువులను సంబోధించి భగవానుఁ డిట్లనెను.

"ఓ భిక్షువులారా! ఎవరైన నొకరు నన్నును ధర్మమును సంఘమును నిందించుచున్నచో మీరు వారియెడల పగపూనుట అసంతోషము పొందుట కోపగించుటయు చేయరాదు. అట్లు

చేసినచో మీకే నష్టము గలుగును. భిక్షువులారా! ఎవరైనను నన్నుఁగాని ధర్మమును సంఘమును నిందించినచో వెంటనే కోపగింతురా? ఖిన్నులయ్యెదరా! వారు అట్లు చెప్పుటలో సత్యమేమైన నున్నదా! వారాడుమాటలు సత్యములా అసత్యములా యని పరిశీలింపవలదా?

"వారు నిందించునపుడు ఇది సత్యమేనా? ఏమి యిది సత్యము గాదా? ఇది యసత్యము ఇది మాలోలేదు. ఇది మాలో ఏమాత్రము లేదు! అని పూర్తిగా పరిశీలించి వారి నిందయే నిజమగునెడల మనలను దిద్దుకొనవలెను. భిక్షువులారా! ఎవరైన ప్రశంసించినచో ఆనందింపరాదు. సంతోషింపరాదు. ఉప్పొంగరాదు. అట్లు మీరు ఆనందించినచో సంతోషించినచో ఉప్పొంగినచో అందులో మీకే నష్టము గలుగును.

"భిక్షువులారా! ఎవరైన మిమ్ము ప్రశంసించినచో ఇది సత్యమేనా ఇది సత్యము ఇది మాలోనున్నది. నిజముగానున్నది. అని పూర్తిగా పరిశీలించికొనవలయును. అంతేకాని ఇతరుల నిందాస్తుతులకు లోనుగారాదు.

"భిక్షువులారా! శీలమునుబట్టి నన్ను జనులు ప్రశంసించుచున్నారు. ఈ శీలము సామాన్యమైనది. ఈ శ్రమణగౌతముఁడు జీవులకు హింసచేయక దండమును శస్త్రమును విడిచి హింసచేయుటకు సిగ్గుపడి దయాళువై జీవుల హితమును గోరుచున్నాఁడు.

"భిక్షువులారా! ఈ శ్రమణగౌతముఁడు చౌర్యము (=ఇవ్వకుండఁ బుచ్చుకొనుట) నుండి మరలి యున్నాఁడు. అతఁడు



ఎవరైన ఇచ్చినచో దానిని మాత్రమె స్వీకరించును. పవిత్రమైన యాత్మగలిగి విహరించును. విషయభోగములను పూర్తిగా విసర్జించి యున్నాఁడు.

"భిక్షువులారా! శ్రమణగౌతముఁడు ఎల్లపుడు మిథ్యాభాషణమును మాని సత్యవాదియై సత్యవ్రతుఁడై విశ్వాసపాత్రుఁడై చెప్పినట్లు చేయువాఁడై యున్నాఁడు.

"భిక్షువులారా! శ్రమణగౌతముఁడు కొండెములు చెప్పుట కటువుగా మాటాడుట అనవసరముగా మాటాడుట ఇవన్నియు మాని, యిక్కడి మాటలు అక్కడ, అక్కడ మాటలు ఇక్కడ చెప్పక, విడిపోయినవారిని గలుపుచు, కలిసి యున్నవారిని ఇంకను గలుపుచు, ఏకతాప్రియుఁడై నిర్దోషముగా మధురముగా ప్రేమగాఁ బలుకుచు యథార్థవక్తయై ఆవశ్యకమైన సారమైన ధర్మయుక్తమైన వినయముతోఁ గూడిన మాటలు పలుకుచున్నాఁడు."

"భిక్షువులారా! శ్రమణగౌతముఁడు ఎట్టి ప్రాణికి హాని చేయక ఒకసారియె భుజించుచు అసమయమున భుజింపక విలాసనృత్యాదులను జూడక సుగంధమాలాదులను విడిచి అలంకారములచే అలంకరించుకొనక ఎత్తైన విలువగల శయ్యలఁ బరుండక, దాసజనుల నుంచక, పెంపుడు జంతువులఁ బెంచక ఇచ్చిపుచ్చుకొనుటలు క్రయవిక్రయములు మాని విహరించుచున్నాఁడు."

"భిక్షువులారా! ఇటువంటి చిన్నచిన్న విషయములలో జాగ్రత్త వహించి సామాన్యమైన యీ శీలము గలిగి యీ

శ్రమణగౌతముఁడు విహరించుచున్నాఁడు. అందువలన జనులు నన్నుఁ బ్రశంసించుచున్నారు" అని బుద్ధభగవానుఁడు పలుకఁగా విని యా భిక్షువులు శాంతచిత్తముతో భగవానునికి నమస్కరించి యటనుండి వెడలిపోయిరి.

## ఆ త్మ వి చా ర ణ

ఒకమాఱు బుద్ధభగవానుఁడు రాజగృహము నలందలకు మధ్య గల అంబలట్ఠి గ్రామమునఁగల తోటలో రాజభవనమునఁ గుర్చుండి భిక్షువుల కిట్లుపదేశించెను. భిక్షువులారా! ఎంతమందో శ్రమణులు బ్రాహ్మణులు ఆత్మ లోకము నిత్యమని చెప్పుచు నిత్యత్వవాదులు శాశ్వతవాదులునై యున్నారు. వారే కారణము వల్ల ఏ ప్రమాణముచే ఆత్మను లోకమును నిత్యమని నమ్ముచున్నారో వినుఁడు. భిక్షులారా! కొందఱు భిక్షులు సంయమము వీర్యము నిశ్చయము జాగరూకత స్థిరచిత్తముగలిగి చిత్తసమాధిని పొందుచున్నారు. సమాధిగల యా చిత్తములో అనేక విధములైన పూర్వ జన్మల స్మృతి గలుగుచున్నది. "నేను గత జన్మలలో ఈ పేరు ఈ గోత్రము, ఈ రంగు గలిగి ఇట్టి యాహారము తిని ఇటువంటి సుఖదుఃఖములను అనుభవించి ఇంత యాయువును గలిగియుంటిని. నేను అక్కడఁ జనిపోయి అక్కడ పుట్టితిని. అక్కడఁ గూడ ఆయా నామ రూపాదులతో నుంటిని. నేను అక్కడఁ జనిపోయి యిక్కడఁ బుట్టితిని." అని యీ విధముగా అతఁడు తన పూర్వ జన్మలను స్మరించును. స్మరించి పై కారణములవలన ఆత్మ నిత్యము లోకము నిత్యము పరిణామము లేనిది కూటస్థము అచలమనును. ప్రాణి కదలుచు



తిరుగుచు పుట్టుచుండును మరణించుచుండును. కాని అతని యునికి నిత్యము నేను కూడ అటువంటి చిత్తసమాధినే పొంది పూర్వ జన్మల స్మృతిని గలిగియున్నాను. కనుక ఆత్మ లోకము నిత్యము అని తోఁచుచున్నది." అనును. ఈ కారణమును బట్టి శ్రమణులు బ్రాహ్మణులు ఆత్మ లోకము నిత్యమని అంగీకరించుచున్నారు.

భిక్షువులారా! కొందఱు శ్రమణులు బ్రాహ్మణులు ఆత్మను లోకమును ఒక యంశనుబట్టి నిత్యమని ఒక యంశమును బట్టి అనిత్యమనియు నమ్ముచున్నారు. వారేకారణమును బట్టి ఏ ప్రమాణముయొక్క బలము మీఁద ఆత్మను లోకమును ఒక యంశను బట్టి అనిత్యమని యొక్క యంశనుబట్టి అనిత్యమని ఎందుకు నమ్ముచున్నారో చెప్పెదను వినుఁడు.

"భిక్షువులారా! చాల యేండ్లు గడచిన పిదపఁ ప్రళయ కాలము వచ్చును. ప్రళయమైన తరువాత బ్రహ్మలోకమందు ఉండెడి యా భాస్వరులు అక్కడ మనోమయులై ప్రీతిని భక్షించెడి వారయి ప్రభగలవారై ఆకాశమందుఁ దిరుగువారై అందమైన వస్త్రాభూషణములను ధరించువారై చాలకాలము వఱకు ఉందురు.

భిక్షువులారా! చాల యేండ్లు గడచిన పిదప ఆ లోకమునకు ప్రళయము వచ్చును. ప్రళయము వచ్చిన పిదప బ్రహ్మ లోకము పుట్టును. అప్పుడు ఏ జీవుఁడైనను తన యాయువు పుణ్యము ముగిసిన పిదప ఆ భాస్వర బ్రహ్మ లోకమునుండి పడిపోయి బ్రహ్మలోకమందుఁ బుట్టును. అతఁడు

అక్కడ మనోమయాది రూపములతో చాల కాలము వఱకు ఉండును. అక్కడ అతఁడు ఒంటరియైయుండి చాల కాలమునకు విసిగిపోవును. అతనికి భయము కలుగఁదొడగును. ఇక్కడకు ఇతర ప్రాణులు గూడ వచ్చిన బాగుండు ననుకొనును. అంత కొన్ని ప్రాణులు పై ప్రాణివలెనే యా బ్రహ్మ లోకమందుఁ బుట్టును. ఆ మొదటనే వచ్చిన ప్రాణి నేనె బ్రహ్మను అజితుఁడను సర్వద్రష్టను ఈశ్వరుఁడను కర్తను ఈ యితర ప్రాణులకుఁ దండ్రిని ఈ ప్రాణులు నావల్లఁ గలిగినవి. ఇక్కడకు ఇతర ప్రాణులు గూడ వచ్చిన బాగుండునని నేను సంకల్పించినంతనే యీ ప్రాణులు పుట్టెను" అని యనుకొనును.

తరువాతఁ బుట్టిన ప్రాణి "ఇతఁడు బ్రహ్మ ఈశ్వరుఁడు కర్త నే నితనివలనఁ బుట్టితిని. ఇతని తరువాతఁ బుట్టితిని. ఇతఁడు మనకంటె దీర్ఘాయువు గుణవంతుఁడు అధిక యశస్వి. ఇతని పిదప పుట్టిన మేమందఱము అల్పాయువులము అల్ప గుణముగల వారము అల్ప యశస్కులము" అని తలఁచును.

"భిక్షులారా! అప్పుడు ఒకానొక ప్రాణి అక్కడనుండి జాఱి యిక్కడఁ బుట్టును. ఇక్కడకు వచ్చి ఇల్లు వీడి సాధువగును. అతఁడు చిత్తసమాధిని పొందును. సమాధి పొందిన యా చిత్తముతోఁ దన మొదటి జన్మను స్మరించి "మమ్ములను నిర్మించిన బ్రహ్మ నిత్యుఁడు ధ్రువుఁడు శాశ్వతుఁడు. అపరిణామి అచలుఁడు. ఆ బ్రహ్మవలనఁ బుట్టిన మేము అనిత్యులము అధ్రువులము అశాశ్వతులము పరిణామ శీలురము మరణ శీలురము" అని తలఁచును. ఇట్లే క్రీడా ప్రదూషికులు అని కొందఱు దేవతలు గలరు. వారు ఎక్కువకాలము క్రీడలలో మునిఁగి



యుందురు. అందువలన వారి స్మృతిజ్ఞానము క్షీణించును. స్మృతి క్షీణింపఁగా ఆ శరీరము నుండి జాఱి యిక్కడఁ బుట్టుదురు. మఱియు మనః ప్రదూషికులని కొందఱు దేవతలుగలరు. వారు ఒకరి నొకరు కోపముతోఁ జూచుచు ద్వేషించుకొనుచుందురు. అట్లుండి శరీరముతోను మనస్సుతోను అలసిపోవుదురు. వారు ఆ శరీరము నుండి పడి యిక్కడఁ బుట్టుదురు. క్రీడా ప్రదూషికులుగాని దేవతలు క్రీడలలో మునిఁగి యుండరు. వారి స్మృతి క్షీణింపదు. కాన వారు నిత్యులు ధ్రువులు శాశ్వతులు. సమాధిస్థులైన క్రీడా ప్రదూషికులు "మేము క్రీడలలో మునిఁగియుండుటచే మా స్మృతి క్షీణించినది. కాన మేము అనిత్యులము మరణశీలురము" అని యనుకొందురు. మనః ప్రదూషికులు గానివారు ఇతరులను కోపముతోఁ జూడక పరస్పరము ద్వేషించుకొనక ఆ శరీరమునుండి పడిపోకయుందురు. వారు ఏ విధముగను అలసట పొందక యుందురు. కాన వారు నిత్యులు శాశ్వతులు. "మేము కోపముతో ద్వేషించుకొనుచు ఆ శరీరము నుండి జాఱి పడిపోవుచుందుము గాన మేము అనిత్యులము. అధ్రువులము. అశాశ్వతులము." అని మనః ప్రదూషికులు అనుకొందురు.

"భిక్షువులారా! కొందఱు శ్రమణులు బ్రాహ్మణులు తర్కముచేసి న్యాయముచే "ఈ కన్ను చెవి ముక్కు నాలుక శరీరము ఇవన్నియు అనిత్యములు అశాశ్వతములు. ఈ చిత్తము మనస్సు లేక విజ్ఞానము ఇవి నిత్యము ధ్రువము శాశ్వతము" అని యందురు.

పై వానిని బట్టి ఈ శ్రమణులు బ్రాహ్మణులు ఒక యం

శనుబట్టి నిత్యమని యింకొక యంశనుబట్టి యనిత్యమని యందురు.

"భిక్షువులారా! మఱికొందఱు శ్రమణులు బ్రాహ్మణులు సమాధి పొందిన చిత్తముతో 'లోకము సాంతము పరిచ్ఛిన్నము' అనియును "లోకము అనంతము అపరిచ్ఛిన్నము" అనియును తలఁచి లోకము సాంతము అనంతము అని యందురు"

భిక్షువులారా! కొందఱు శ్రమణులు బ్రాహ్మణులును ఇది మంచిదో చెడ్డదో తెలియక" ఇది మంచిదో చెడ్డదో నాకు సరిగా తెలియుటలేదు. సరిగాఁ దెలిసికొనకుండ 'ఇది మంచిది ఇది చెడ్డది' అని చెప్పినచో ఇది మంచిది ఇది చెడ్డది కానిచో నేను చెప్పినది అసత్యమగును ఆ యసత్యభాషణము నాకు ఘాతకమై ముక్తిమార్గమునకు అంతరాయమగును. తెలియక రాగ క్రోధ లోభ ద్వేష వశుఁడనై యట్లు చెప్పినచో అది రాగాదులనుబట్టి సంసారబంధకమగును. ఎవరైన ప్రశ్నలు అడిగినచో "నేను ఇదియు చెప్పలేను అదియు చెప్పలేను. ఇదియు కాదు అదియుఁ గాదు." అని స్థిరముగా ఏదియుఁ జెప్పలేకపోవును. తెలియకుండ వాఁడు చెప్పినచో "నిపుణులైన పండితులు శాస్త్రార్థము చేయువారు పరసిద్ధాంతములను ఖండించువారు వచ్చి నన్ను అడిగినచో తర్కము చేసినచో నేను చెప్పలేకపోయినపుడు అది నాకు విఘాతమగును. అది నా ముక్తి మార్గమునకు అడ్డు అగును." అని అదియు గాదు ఇదియు గాదు అని చెప్పలేక పోవుదురు.

భిక్షువులారా! ఎంతోమంది శ్రమణులు బ్రాహ్మణులును ఆత్మను లోకమును కారణము లేకయే పుట్టిన వానినిగాఁ దలఁ



తురు. వారే కారణముచే ఏ యాధారము మీఁద వారు అట్లు చెప్పుచున్నారు?

"భిక్షువులారా! అసంజ్ఞిసత్త్వులు (పేరు లేనివారు) అను దేవతలు కొందఱున్నారు. పేరు గలుగుటచే వారు ఆ శరీరము నుండి జాతి యిక్కడఁ బుట్టుచున్నారు. పుట్టి వారు సాధువులై సమాధిగల చిత్తములో సంజ్ఞ కలుగుటను స్మృతికిఁ దెచ్చుకొందురు. దానికిఁ బూర్వమున్న దానిని స్మరణకుఁ దెచ్చుకొనలేరు. అప్పుడు వారు "ఆత్మలోకము అకారణముగఁ బుట్టినవి. నేనిదివఱకు లేను. నేను లేకుండఁగనె పుట్టితిని" అని వారు తలఁతురు.

"కొందఱు తార్కికులును ఆత్మను లోకమును కారణము లేకుండఁ బుట్టినవానినిగాఁ దలఁతురు."

"భిక్షువులారా! మరణము పిదప పేరు లేకుండను పేరు లేనిది కాకుండను ఆత్మ ఉండునని రూపము లేనిది రూపము గలది అని యీ మొదలుగాఁ గొందఱు తలఁతురు.

కొందఱు ఇట్లు అందురు. "ఆత్మ యథార్థమునకు రూపము గలది నాలుగు భూతములతోఁ దయారైనది. తల్లిదండ్రుల సంయోగమువలనఁ గలిగినది. కాన శరీరము నశించిన వెంటనే లోపించును" అని.

"ఇంకొక రకమైన యాత్మ అన్ని విధముల అనంతమైనది. ఆకాశ శరీరమును దాటి విజ్ఞాన శరీరము గలది అని."

పైని చెప్పిన యన్ని విధముల సిద్ధాంతములును తథాగతునికిఁ దెలియును. తథాగతుఁడు వానిని వానికంటె అధిక

మైనవానిని ఎఱుఁగును. తెలిసికూడ 'నా కింత తెలియునని అభిమానము పొందఁడు. అభిమానము పొందనివారే నిర్వృతిని పొందుదురు."

భిక్షువులారా! ఈ ధర్మము గంభీరమైనది దుర్జ్ఞేయము శాంతము సుందరము. తర్కాతీతము. నిపుణము పండితులు తెలిసికొనఁదగినది. దానిని తథాగతులు స్వయముగాఁ దెలిసికొని సాక్షాత్కరింపఁజేసికొని యుపదేశించు చున్నారు.

"భిక్షులారా! భవతృష్ణ (=జన్మలాభము) ఉచ్ఛిన్నమైనను తథాగతుని శరీరముండును. అతనికి శరీరమున్నంత వఱకు అతనిని మనుష్యులు దేవతలు చూడఁగలరు. శరీరము పడిపోఁగానే వాని జీవన ప్రవాహము నిరుద్ధమగును. అప్పుడతనిని దేవతలు మనుష్యులును జూడలేరు."

భిక్షువులారా! ప్రళయము వచ్చిన పిదప ఆ భాస్వర బ్రహ్మలోకము నుండి పడిపోయి మనోమయాది రూపములతో నుండి పిదప "నేను బ్రహ్మను మహాబ్రహ్మను విజేతను అనభిభూతుఁడను సర్వజ్ఞుఁడను వశవర్తిని ఈశ్వరుఁడను కర్తను నిర్మాతను భూతభవిష్యత్తులందలి ప్రాణులకుఁ దండ్రిని నావల్ల వీరు పుట్టిరి" అని యా భాస్వర జన్మలందు పుట్టిన మొదటివారు అనుకొందురు. వారి తరువాతఁ బుట్టినవారు సమాధియందుఁ బూర్వజన్మను స్మరించుకొని వానికంటె నింకను బూర్వమగు జన్మను స్మరింపక మొదటివానిని "ఇతఁడె బ్రహ్మ .... ఈశ్వరుఁడు మనలను బుట్టించినవాఁడు శాశ్వతుఁడు మేము ఇతని వలనఁ బుట్టినవారము అశాశ్వతులము మరణశీలురము" అని యిట్లు తలఁచుచు ఈశ్వరవాదమును తెలుపుచున్నారు."



నేను శ్రేష్ఠమైన విషయమును ఎఱుఁగుదును. దానిని తెలిసికూడ అభిమానము లేకయుందును. అభిమానము లేక నాలో నేను ముక్తిని అనుభవించుచున్నాను. ఈ యనుభవము వలన నే నెప్పుడును దుఃఖమును పొందను.

(దీఘనికాయ 3. 1.)

బుద్ధభగవానుఁడిట్లు చెప్పఁగా ఆనందుఁడు ఇట్లనెను. "భగవానుఁడా! ఆశ్చర్యము అద్భుతము. తమ యీ యుపదేశము నేమని పిలువవలయును" అని.

"ఆనందా! దీనిని అర్థజాలమనిగాని ధర్మజాలమనిగాని బ్రహ్మజాలమనిగాని దృష్టిజాలమనిగాని లేక అలౌకిక సంగ్రామ విజయమని గాని పిలువవచ్చును." అని భగవానుఁడనెను. అపుడు భిక్షువులందఱు భగవానుని వాక్యములు అభినందించి వెడలిపోయిరి.

* * * *

## ధర్మబోధ

ఒకసారి బుద్ధభగవానుఁడు వైశాలినుండివచ్చి శ్రావస్తిలో విహరింప బయలుదేఱెను. అప్పుడు కొందఱు భిక్షువులు ముందుగనె శ్రావస్తికి వచ్చి "ఈ గదులు మా యుపాధ్యాయులకు ఇవి యాచార్యులకు ఇవి మాకు" అని యన్నియు ఆక్రమించుకొనిరి. ఆయుష్మంతుఁడగు సారిపుత్త్రునికి చోటు దొరకలేదు. అతఁడొక చెట్టుక్రిందఁ బరుండెను.

భగవానుఁడు రాత్రి తెల్లవారుజామున లేచి దగ్గెను. అప్పుడు సారిపుత్త్రుఁడును దగ్గెను.

"ఎవరక్కడ" అని భగవానుఁ డడిగెను.
"నేను సారిపుత్త్రుఁడను" అని సారిపుత్త్రుఁడనెను"
"ఏమి యిక్కడ నుంటివేమి"

అపుడు సారిపుత్త్రుఁడంతయుఁ జెప్పెను. అపుడు భగవానుఁడు "భిక్షువులారా! బుద్ధ సంఘములోని యట్టి యయోగ్యులైన భిక్షువులెవరు? ఇది యప్రసన్నులను ప్రసన్నులనుగఁ జేయుటకుఁ గాని ప్రసన్నులను ఇంకను బ్రసన్నులుగ నొనరించుటకుఁగాని కాదు. పైఁగా అప్రసన్నులను ఇంకను అప్రసన్నులఁ జేయుటకును ప్రసన్నులను అప్రసన్నులనుగఁ జేయుటకును బనికివచ్చును. భిక్షువులారా! భిక్షువులలో ఎవరికి ముందుగా ఆసనాదులను ఈయవలయును."

బ్రాహ్మణ కులము నుండి సంన్యసించినవారికి ముందు ఆసనాదులీయవలయునని కొందఱు వైశ్యాది కులముల నుండి సంన్యసించిన వారికని కొందఱు ధర్మ వ్యాఖ్యాతలకని కొందఱు వినయవంతులకని మఱి కొందఱు ఈ విధముగ ననేక విధములుగఁ జెప్పఁదొడఁగిరి. అపుడు భగవానుఁ డిట్లనెను.

"భిక్షువులారా! పూర్వము హిమాలయ పర్వతము దగ్గఱ ఒక మఱ్ఱిచెట్టును ఆశ్రయించుకొని ఒక తీతువుపిట్ట, ఒక కోఁతి ఒక యేనుఁగు మైత్రితో వసించుచుండెను. ఒకమారు వానిలో భేదముగలిగి యొకదానినొకటి గౌరవించుకొనక సాయము చేసి



కొనక కలహింపఁ దొడఁగి "మనలో నెవరము పుట్టుకలో గొప్పవారమో వారి నితరులు గౌరవింపవలయు"నని తలఁచి మనలో నెవరెవరు ముందు పుట్టితిమో చెప్పవలయు" ననుకొన్నవి.

"నా చిన్నతనములో ఈ మఱ్ఱిచెట్టు నా మోకాళ్ళకుఁ దగిలెడిది దీనిని నేను దాటుదానను" అని యేనుఁగనెను. "నా చిన్నతనములోఁ గూర్చుండి యీ మఱ్ఱి చిగుళ్ళను దినెడిదానను" అని కోఁతి యనెను. "నేను ఒక మఱ్ఱిపండు తిని యిక్కడ రెట్టవైచితిని అందుచే మఱ్ఱిచెట్టు పుట్టెను కాన నేనే పెద్దదానను" అని తీతువు అనెను. అపుడు ఆ తీతువును గౌరవించుచు మిగిలినవి అది చెప్పినట్లు నడచుకొనినవి. అట్టి జంతువులలోనే ప్రేమ యున్నపుడు మనలో ప్రేమ లేకపోవుట యెంత చెడ్డది. మనము పరస్పరము ప్రేమించుకొని గౌరవించుకొనవలయును. ధర్మవృద్ధుని అందఱు గౌరవింపవలయును. ధర్మము తెలిసికొని సంన్యాసులైనవారు ఇటులుండరాదని బోధించెను.

× × ×

## ప్ర జా ప తి గౌ త మి

ఒకప్పుడు భగవానుఁడు కపిలవస్తులో న్యగ్రోధా రామమునందు విహరించుచుండెను. అప్పుడు ప్రజాపతిగౌతమి భగవానుని దగ్గఱకువచ్చి నమస్కరించి యొక ప్రక్కగా నిలుచుండి యిట్లనియెను.

"భగవానుఁడా! స్త్రీలు గూడ బుద్ధుడు చూపిన ధర్మ మార్గము ప్రకారము ఇల్లు విడిచి దీక్ష గైకొన్నచో బాగుండదా!" అని.

"కాదు గౌతమి! స్త్రీలుగూడ దీక్షగైకొనరాదు'' అని భగవానుఁడు అనెను. గౌతమి మరల మరల నట్లే యడిగినను భగవానుఁడు కూడదనెను.

అపుడు గౌతమి భగవానుఁడు దీక్ష గైకొనుట కనుమతి యీయకపోవుటచే విచారముతో నేడ్చుచు భగవానునికి నమస్కరించి ప్రదక్షిణము చేసి వెడలిపోయెను.

మఱొకపుడు భగవానుఁడు వైశాలిలోఁ గూటాగారశాల యందు విహరించుచుండఁగా ప్రజావతి గౌతమి కేశములు కత్తిరించుకొని కాషాయబట్టలు కట్టుకొని చాలమంది శాక్య స్త్రీలతోఁ గూడ అక్కడికి వచ్చి దుమ్ముతోనిండిన మేనితో విచారముతో వెలుపలిద్వారము దగ్గఱ నిలుచుండెను.

ఆనందుఁడది చూచి "ఇట్లుంటివేమి" అని యడిగెను.

"భగవానుఁడు స్త్రీలకు బుద్ధధర్మములో దీక్ష యిచ్చుట కనుమతించుటలేదు" అని యామె చెప్పెను.

"గౌతమీ! నీవిక్కడనే యుండుము. బుద్ధ ధర్మములో స్త్రీలకు దీక్ష యివ్వ భగవానునిఁ బ్రార్థింతును" అని యానందుఁడు పలికి భగవానుని దగ్గఱకుఁబోయి నమస్కరించి యొక ప్రక్కగా నిలుచుండి యిట్లనెను.

"భగవానుఁడా! ప్రజాపతి గౌతమి దుమ్ముతో నిండిన



మేనితో విచారముతో వెలుపల నిలుచుండియున్నది. మీరు స్త్రీలకు బుద్ధధర్మములో దీక్ష యిప్పింపవలయును''

"కాదు ఆనందా! స్త్రీలకు దీక్షకై అనుమతి యీయఁబడదు''

"భగవానుఁడా! స్త్రీలు గూడ ఇళ్ళువీడి ధర్మమును దెలిసికొని యర్హత్త్వపదవిని బొందఁగలరు గదా''

''అవును పొందఁగలరు''

''అయితే పొందఁగలిగినపుడు స్త్రీలుగూడ అర్హత్త్వపదవి పొందఁ గలిగినచో భగవానుని పోషించి, పాలిచ్చి పెంచి యెక్కువ యుపకారము చేసిన తల్లి గౌతమికి దీక్ష యిచ్చెదరు గాక''

''యావజ్జీవము బుద్ధ ధర్మములను జాగ్రత్తగాఁ బరిపాలించుచో నట్లే దీక్షకై యనుమతి యివ్వఁబడును'' అనెను.

''సరే'' యని యానందుఁడు ప్రజాపతి యంగీకారమును తెలిసికొనివచ్చి భగవానునికిఁ దెలిపెను.

దీక్షకై యనుమతి నిచ్చితిని. కాని స్త్రీలు ఈ బుద్ధధర్మమున దీక్ష పుచ్చుకొనకున్నచో ఈ బ్రహ్మచర్యము చిరస్థాయిగా నుండెడిది. కాని స్త్రీలుగూడ దీక్ష పుచ్చుకొందురు గాన ఈ బ్రహ్మచర్యము స్థిరముగా నుండక త్వరలో పోవును'' అని భగవానుఁ డనెను.

పిదప నీవత్సరములోనే బింబిసారుని రాజమహిషియు సుందరియు నగు క్షేమ భగవానుని యుపదేశము విని భర్త యనుజ్ఞపొంది భిక్షురాలయ్యెను. ఆమెను జూచి చాలమంది స్త్రీలు దీక్ష గైకొనిరి.

* * * *

(బుద్ధుని 43 — 48 ఏండ్ల వయస్సులో)

# సుదిన్నుఁడు

ఒకమాఱు భగవానుఁడు వైశాలిలో ఒక సభలో ధర్మము ఉపదేశించుచుండెను. అపుడు వైశాలికి దగ్గఱగానున్న కలందక మను గ్రామమునుండి యేదో పనిమీఁద వైశాలికి వచ్చి కలంద పుత్త్రుఁడగు సుదిన్నుఁడు అనేకులు మిత్రులతోఁ గూడ భగవానుని ధర్మోపదేశమును వినెను.

అతనికిట్లు మనసులో ఆలోచన గలిగెను.

''భగవానుఁడు ఉపదేశించు ధర్మము సంపూర్ణమైనది. శంఖమువలె స్వచ్ఛమైన బ్రహ్మచర్యమును ఇంటిలో నుండి పరిపాలించుట సుఖము గాదు. కనుక జుట్టు తీసివేయించి కాషాయబట్టలు గట్టి యిల్లువీడి సంన్యసింతునా ఏమి''

ఇట్లు ఆలోచించి సభ ముగిసిన పిదప భగవానునికి నమస్కరించి జనులందఱు వెడలిపోయిన పిదప భగవానుని సమీపించి నమస్కరించి యొక ప్రక్కగా నిలుచుండి యిట్లనెను.

"భగవానుఁడా! మీ ధర్మమును దెలిసికొంటిని నేను సంన్యసింపఁ గోరుచుంటిని దీక్షయిండు."

"నీవు దీక్ష పుచ్చుకొనుటకు మీ తల్లిదండ్రులు అనుమతి యిచ్చిరా?" అని భగవానుఁడడిగెను.

"లేదు అనుమతి యీయలేదు."

"తల్లి దండ్రులు అనుమతి యిచ్చినఁగాని దీక్ష యీయ వీలులేదు"



"అయినచో అనుమతి తీసికొని వచ్చెదను"

అని చెప్పి తన కలందక గ్రామమునకుఁ బోయి తల్లిదండ్రుల యనుమతి గోరెను. అప్పుడు వారిట్లనిరి.

"నాయనా! సుదిన్నా! నీవు మాకుఁ జాల యిష్టుఁడవు చిన్నప్పటినుండి కష్ట మెఱుఁగవు. నిన్ను విడచి మేము ఉండఁజాలము. కనుక నీవిల్లు వీడుటకు అనుమతి యెట్లీయఁగలము."

పిదప ఎన్నిసార్లు సుదిన్నుఁడు ప్రార్థించినను వారు అనుమతింపలేదు. అప్పుడు సుదిన్నుఁడు కటికనేలపయిఁ బరుండి భుజించుటమాని "ఇచట నేను చావనైనఁ జావవలయును లేనిచో సంన్యాసమైన పుచ్చుకొనవలయును" అని భుజించుట మానెను.

ఇట్లు కొన్ని దినములు గడచెను. అయినను వారు అనుమతి యీయలేదు. సుదిన్నుఁడు భుజింపలేదు. అపుడు సుదిన్నుని స్నేహితుఁడు వచ్చి భుజింపఁ బ్రార్థనచేసెను. కాని లాభము లేకపోయెను. అంత స్నేహితుఁడు తల్లిదండ్రుల దరికి వచ్చి మీరనుమతి యివ్వనిచో ఇతఁడు చనిపోవును. ఇచ్చినచో బ్రతికియైన నుండును. దీక్షలో నిలఁబడలేనిచో తిరుగ నింటికి వచ్చునుగదా. అని చెప్పఁగా చివరకు వారు అనుమతి ఇచ్చిరి. సుదిన్నుఁడు భగవానుని దగ్గఱకుఁ బోయి తల్లిదండ్రుల యనుమతిని దెలిపి దీక్ష గైకొనెను.

* * *

## సంగాముఁడు బ్రాహ్మణుఁడు

ఒకప్పుడు శ్రావస్తి పట్టణములో అనాథ పిండికుని జేతవనమందు బుద్ధభగవానుఁడు విహరించుచుండెను.

ఆ సమయమున ఆయుష్మంతుఁడగు సంగాముఁడు భగవానుని సందర్శించుటకు శ్రావస్తికి వెళ్ళెను. అపు డీసంగతి తెలిసికొని సంగాముని భార్య తన పిల్లవానిని దీసికొని జేతవనమునకుఁ బోయెను. అంత సంగాముఁడొక చెట్టుక్రిందఁ గూర్చుండియుండెను. అప్పుడామె సంగాముని దగ్గఱకుఁబోయి యిట్లనెను.

"ఓ శ్రమణా! ఈ పిల్లవానితోఁ గూడిన నన్నుఁ దమరు పోషింతురు గాక."

ఆమె మాటలు వినియు సంగాముఁడు మరుమాటాడలేదు. ఈ విధముగా రెండవసారి మూఁడవసారి యామె పలికెను. అతఁడు మాటాడలేదు.

"ఇదిగో వీఁడు మీ పిల్లవాఁడు. వీనిని పోషింపుఁడు" అని పలికి యామె యపు డాపిల్లవానిని సంగాముని దగ్గఱ విడిచి పెట్టి వెడలిపోయెను.

అపుడు సంగాముఁ డాపిల్లవానివైపు చూడనైనఁ జూడ లేదు. మాటాడలేదు కూడ.

ఆమె అట్లు కొంతదూరమేగి వెనుకకుఁ దిరిగి చూచెను. సంగాముఁ డాపిల్లవానివైపు చూడనైనఁ జూచుటగాని, మాటాడుటగాని లేదని తెలిసికొనెను. ఈ శ్రమణునికి తన పిల్లవానితో నిపుడెట్టి సంబంధమును లేదు" అని తన మనసులో గ్రహించెను.



అంతట ఆమె వెనుకకుఁ దిరిగి వచ్చి తన పిల్లవానిని ఎత్తుకొని తీసికొని పోయెను.

ఇది తెలిసికొనిన బుద్ధభగవానుని నోటినుండి యీ మాటలు వెడలెను.

"భార్య యరుదేఱ సంతోష పడఁగలేదు
భార్య వెడలిపోయిన దుఃఖ పడఁగలేదు
పూర్తిగా వాంఛనుండి విముక్తి చెందె
నట్టి సంగాము బ్రాహ్మణుఁ డనెద నేను"

* * *

## బాహియుఁడు

ఒక సమయమున శ్రావస్తిలో అనాథ పిండికుని జేతవనమందు బుద్ధభగవానుఁడు విహరించుచుండెను.

అదే సమయమున బాహియుఁడను నొక సాధువు వల్కలములను ధరించి సుప్పారకమను తీర్థమున వసించుచుండెను. బుద్ధభగవానుఁడు శ్రావస్తిలో విహరించుచున్నట్లు విని అతఁడు మఱునాఁడే శ్రావస్తికిఁ బోయెను,

అతఁడు శ్రావస్తికిఁ బోయి యనాథ పిండికుని జేతవనమును సమీపించెను. అప్పు డక్కడ చాలమంది భిక్షువులు ఆఱుబయట నిటు నటు పచారు చేయుచుండుట చూచి వారిని సమీపించి "భగవానులారా! ఇప్పుడు బుద్ధభగవాను లెక్కడ వారి నిపుడు సందర్శింపవలయును" అని యడిగెను.

"ఓ బాహియా! బుద్ధభగవానులు భిక్షకై గ్రామములోనికి వెళ్ళిరి" అని వారు చెప్పిరి. అపుడు బాహియుఁడు కంగారుగా జేతవనమునుండి వెడలి శ్రావస్తిలోనికిఁ బోయెను.

అక్కడ "దర్శనీయుఁడును, శాంత స్వరూపుఁడును, సంయమియు, నిర్మలుఁడు నగు భగవానునిఁ జూచెను.

వెంటనే బుద్ధుని కాళ్ళపైఁబడి బాహియుఁ డిట్లనెను.

"ఓ భగవానుఁడా! నాకు చిరకాలము సుఖము హితము గూర్చు ధర్మ ముపదేశింపుఁడు, సుగతా! నాకు అట్టి ధర్మముపదేశింపుఁడు."

"బాహియా! ఇది తగిన సమయము గాదు. ఇపుడే నేను భిక్షకుఁ బోవుచున్నాను" అని భగవానుఁడనియె.

మరల నట్లే బాహియుఁ డడిగెను. మరల భగవానుఁ డట్లే యనెను.

"ఓ భగవానుఁడా! మీరుగాని నేనుగాని ఎంతకాలము జీవింతుమో ఏమి చెప్పఁగలము. నాకు హితమును సుఖమును గూర్చు ధర్మము నుపదేశింపుఁడు".

"బాహియా ఇది తగిన సమయము గాదు" ఇట్లు బాహియుఁడు బుద్ధుఁడును రెండవసారి మూఁడవసారి పలికిరి.

"అయితే సరే మంచిది. బాహియా! వినుము ఇది నేర్చుకొనుము కళ్ళతోఁ గేవలము పైకిఁ జూడవలయును. చెవులతో నూరక వినవలయును. చర్మముతో నూరక తాకవలయును. మనస్సుతో నూరక తెలిసికొనవలయును. బాహియా! ఇంతే నీవు నేర్చుకొనవలయును. నీవు కేవలము చూచువాఁడుగా



వినువాఁడుగా తాకువాఁడుగ, తెలిసికొనువాఁడుగ మాత్రమే యుండవలయును. ఊరక యట్లే యుండి వానియందు తగుల్కొనక పోతివేని ఆసక్తి యుంచకపోతివేని ఈ లోకమందుఁగాని పరలోకమందుఁగాని నీకు బంధ మనునది లేదు. ఇదే దుఃఖములను బోఁగొట్టునది ఇదే నిర్వాణము."

ఇట్లు ఉపదేశించి బుద్ధభగవానుఁడు భిక్షకు వెడలిపోయెను. ఆ యుపదేశము గ్రహించి బాహియుఁడు ఆస్రవముల నుండి ముక్తుఁడై ఎటకో పోవుచుండెను.

అంత దారిలో ఒక యేనుఁగు ఆ బాహియుని మీఁదఁబడి చంపి తొండముతో విసరివైచెను.

అప్పుడు బుద్ధభగవానుఁడిది విని యా బాహియుని శరీరమున కగ్నిసంస్కారము చేసి అచితా భస్మము మీఁద నొక స్థూపము కట్టించెను.

ఆ బుద్ధభగవానుని నోటినుండి యీ మాటలు వెల్వడెను.

"అచట భువి నీరు వాయువు నగ్ని నిలవ
వచట సూర్యచంద్రులు శుక్రుఁ డలరలేరు
చీకటికిఁదావు లేదందుఁ; జింతలేదు
అది యెఱింగి భిక్షు విల క్షీణాస్రవుఁ డగు"

* * * *

## మాతంగ కన్య

ఒకప్పుడు బుద్ధభగవానుఁడు శ్రావస్తిలో అనాథ పిండికుని జేతవనములో విహరించుచుండెను.

అప్పుడు ఒక దినమున ఆనందుఁడు పాత్రయు వస్త్రములు ధరించి భిక్షకై వెడలి భిక్షను దెచ్చుకొని భుజించి యొక నది దగ్గఱకుఁ బోవుచుండెను. దారిలో ప్రకృతి యను పేరు గల యొక యువతి నీరు తెచ్చుకొనుచుండఁగా ఆనందుఁ డిట్లడిగెను."

"అమ్మాయీ! కొంచెము మంచినీరు ఇచ్చెదవా?"

"అయ్యా! నేను మాలదాదమ"

"అమ్మాయీ! నేను మంచినీరు అడిగితిని. నీ కులము నడుగలేదు."

అప్పుడా మాతంగకన్య నీరు ఆనందుని కిచ్చెను. ఆ మాతంగకన్య యానందుని మాటలు ఆశ్చర్యము గొలుపఁగా నాతనినిఁజూచి మోహించి యానందుని నివాసాదులను గనుఁగొని యింటికిఁ బోయి తల్లితో నీ సంగతి యంతయుఁ జెప్పి "తాను ఆనందునిఁదక్క నింకెవరిని పెండ్లి చేసికొనను" అనెను.

తల్లి మఱునాఁడు ఆనందుని దగ్గఱకు బోయి భిక్షకు రమ్మని కోరెను. ఆనందుఁడు మౌనముతో నంగీకరించెను.

మఱునాఁడు ఆనందుఁడువచ్చి భుజించుచుండెను. అప్పుడాయువతి తల్లి యానందునితో నిట్లనియెను.

"అయ్యా తమరు మాయమ్మాయిని స్వీకరించి యనుగ్రహింపవలెను.

"అమ్మా! నేను సంన్యాసిని" అని యానందుఁడు మెల్లగా ననెను.

అపుఁడామె బ్రతిమాలి బలవంత పెట్టినను ఆనందుఁ



డంగీకరింపక వెడలిపోయెను. పిదప ఆ యువతి యానందుఁ డెక్కడకు భిక్షకుఁ బోయిన నక్కడికి వెంటాడఁ దొడఁగెను. అప్పటికిని ఆనందుఁ డంగీకరింపక యీ సంగతి యంతయు భగవానునికి విన్నవించెను.

భగవానుఁ డా యువతిని రావించి యిట్లడిగెను.

"అమ్మాయీ! నీవు ఆనందునివెంట నెందుకుఁ బడుచుంటివి. అతనివల్ల నీకుఁ గావలసినదేమి?"

"ఆనందుని కెవ్వతెయు భార్యలేదని విన్నాను. నే నెవరిని బెండ్లాడలేదు. కావన నే నతనికి భార్యను గాఁదలఁచితిని" అని యా యువతి యనెను.

"ఆనందుఁడు భిక్షువు. అతని నెత్తిపైని జుట్టులేదు. నీవో జుట్టు గలదానవు. నీవును జుట్టు తీయించుకొన్నచో ఆనందుఁడు నిన్నుఁ బ్రేమింపఁగలఁడేమో తల్లి యనుమతి పొంది రమ్ము" అని భగవానుఁడనెను.

అపుడా యువతి తల్లిదగ్గఱకుఁబోయి భగవానుని వాక్యమును దెలిపెను. అప్పుడు తల్లి యిట్లు పలికెను.

"బిడ్డా! నీవు నా ప్రియమైన కుమార్తెవు. నీవు జుట్టు తీయించుకొనరాదు. నీవు ఆ సంన్యాసినే యెందుకుఁ గోరుచుంటివి. ఇంక ఈ లోకములో నీకుఁదగిన వరులే లేరా? నీకు మంచి వరుని వెదకి తీసికొని వచ్చెదను. ఈ పట్టు మానుము."

"నేను జనిపోవనైనఁ జనిపోదును. కాని యానందునిఁ దక్క మరొకనిని బెండ్లియాడను" అని యా యువతి యనెను.

"అమ్మాయీ! నన్నెందుకు అవమానపఱచెదవు"

"అమ్మా! నేనంటే నీకుఁ బ్రేమయున్నచో నా కోరిక తీర్పుము" అని ప్రకృతి యనెను.

పిదప మార్గాంతరము లేక తల్లి యేడ్చుచు తన కుమార్తె జుట్టు తీయించుకొనుటకు అనుమతి యిచ్చెను.

ప్రకృతి వెంటనే జుట్టు తీయించుకొని బుద్ధభగవానుని దగ్గఱకు వచ్చెను. భగవానుఁ డది చూచి యిట్లనెను.

"అమ్మాయీ! నీవు ఆనందునిఁ గోరుచుంటివి గదా. వాని శరీరములోని యే భాగము నీకుఁ గావలెను"

"నేను ఆనందుని కన్నులను గోరుచున్నాను. అతని మొగమును గోరుచున్నాను. అతని శబ్దమును గోరుచున్నాను. అతని పద్ధతిని గోరుచున్నాను" అని ప్రకృతి యనెను.

"సరే, కాని యా కన్నులలో నేమున్నదో నీకుఁ దెలియునా? ఆ కన్నులలో కన్నీళ్ళు, పుసులు ఉన్నవి. ముఖములో ఉమ్మి యున్నది. ముక్కులో చీమిడి యున్నది. చెవులలో గులిమి యున్నది. అతని శరీరములో మలమూత్రము లున్నవి. స్త్రీ పురుషుల సహవాసమువల్ల సంతానము గలుగును. పుట్టుక యున్నచోట చావు తప్పకుండ నున్నది. చావున్నచోట దుఃఖము, ఏడ్పు తప్పవు. ఓసి తెలివితక్కువ పిల్లా! ఇట్టి శరీరమువల్ల నీ కేమిలాభము. ధర్మము తెలిసికొని యానందము పొందుము. తిరిగి తిరిగి పుట్టుక చావు, దుఃఖము లేని మహోత్తమగతిని బొందుము." అని భగవానుఁ డనెను.



"రంగురంగు రాజరథముల్ ప్రాలిపడును
మిసమిసని యౌవనపుమేను ముసలి దగును
పుణ్యధర్మంబు ముసలిదై ముడుతపడదు
సజ్జనులఁగూర్చి యిటుపల్కు సజ్జనంబు"
(నా ధమ్మపదము)

అంతతో నామె కన్నులు తెఱవఁబడెను. అప్పు డామె బుద్ధుని ధర్మమును శరణుపొంది దీక్ష పొంది భగవానునికి ఆనందునికిఁ బ్రేమపాత్రు రాలయ్యెను.

* * * *

## బ్రాహ్మణుఁ డెవరు?

ఒక సమయమున భగవానుఁడు శ్రావస్తిలో అనాథపిండికుని తోటయగు జేతవనములో విహరించుచుండెను.

అప్పుడు కొందఱు బ్రాహ్మణుల ప్రోత్సాహమున బ్రాహ్మణ ధర్మమును గూర్చి చర్చించుటకు భగవానుని దగ్గఱకుఁ బోయి కుశలప్రశ్న లడిగిన పిదప నొక ప్రక్కగాఁ గూర్చుండి యాశ్వలాయనుఁడు భగవానునితో నిట్లనెను.

"ఓ గౌతమా! బ్రాహ్మణులే శ్రేష్ఠులనియుఁ దక్కిన వర్ణములవారు తక్కువయని, బ్రాహ్మణులే తెల్లగనుందురని, తక్కినవారు నల్లనివారని, బ్రాహ్మణులే శుద్ధులని బ్రహ్మకన్నకొడుకులని, బ్రహ్మ ముఖమునుండి పుట్టినవారని బ్రాహ్మణులందురు. ఈ విషయమున మీ రేమందురు."

"ఆశ్వలాయనా! అందఱు స్త్రీలవలెనే బ్రాహ్మణ స్త్రీలు

గూడ ఋతుమతులై గర్భవతులై సంతానమును గనుచు పాలిచ్చుచుందురు గదా. పుట్టి పుట్టఁగనే బ్రాహ్మణులే శ్రేష్ఠు లవుదురా?"

"అవును బ్రాహ్మణు లిట్లే యందురు." అని ఆశ్వలాయనుఁడనెను.

"ఆశ్వలాయనా! మీరిది విన్నారా? ఇతర దేశములలో ధనికులు దాసులు ఉందురని, ధనికులు దాసులుగను, దాసులు ధనికులుగను గాఁగలరా?"

"ఉన్నారని వింటిని. అవును కాఁగలరు."

"అయితే ఆశ్వలాయన! బ్రాహ్మణులే శ్రేష్ఠులనుటలో బలమేమున్నది. ఎట్లు నమ్మవచ్చును."

"అయినను బ్రాహ్మణు లిట్లే యందురు."

"అయితే ఇది మీరు నమ్ముదురా? క్షత్రియుఁడు ప్రాణులను జంపుచు దురాచారియై యబద్ధములు పలుకుచు అన్యాయవర్తనుఁడై యున్నాఁడనుకొందము. అతఁడు చనిపోయిన పిదప నరకమును దుర్గతిని బొందునా? పొందఁడా? ఇట్లే బ్రాహ్మణుఁడుగాని, వైశ్య, శూద్రాదులుగాని యన్యాయ ప్రవర్తనలో నున్నచో వారును దుర్గతిని బొందుదురా? పొందరా?"

"వారు అన్యాయవర్తనులైనచో క్షత్రియులన్న మాటయేమి, బ్రాహ్మణులన్న మాటయేమి అందఱు నరకమును, దుర్గతిని పొందుదురు."

"అయితే మఱి బ్రాహ్మణులే శ్రేష్ఠులనుటలో హేతువేమి?"

"అయినను బ్రాహ్మణు లిట్లే యందురు."



"అయితే ప్రాణహింస మాని, దొంగతనము చేయక, దురాచారి కాక, యన్యాయాదులు చేయని బ్రాహ్మణుఁడొక్కఁడే చనిపోయిన పిదప సుగతిని స్వర్గలోకమును బొందునా? క్షత్రియ, వైశ్యాదులు పొందరా?"

"న్యాయవర్తనులైనచో అందఱు సుగతిని పొందుదురు."

"అయితే ఆశ్వలాయనా! బ్రాహ్మణు లొక్కరే రాగద్వేషాదులను విడిచి సత్ప్రవర్తనులై యుందురా తక్కినవారు ఉండలేరా!"

అందఱు సత్ప్రవర్తన గలవారై యుండఁగలరు"

"అయితే బ్రాహ్మణు లొకరే నదికిఁబోయి స్నానముచేసి తోముకొని ముఱికిని బోఁగొట్టుకొందురా? తక్కినవారు ముఱికి పోఁగొట్టుకొనలేరా"

"అందఱును పోఁగొట్టుకొనఁగలరు."

క్షత్రియ బ్రాహ్మణులు మాత్రమే అరణులు తెచ్చి నిప్పును బుట్టించఁగలరని యా నిప్పే తేజస్సుగలదై యుండునని, తక్కిన ఛండాలురు, నిషాదులు మొదలగువారు అరణులు తెచ్చి నిప్పును బుట్టించలేరని ఆ నిప్పులో తేజస్సు ఉండదని చెప్పగలమా?"

"చెప్పలేము ఎవరైనను అరణులు తెచ్చి నిప్పును బుట్టించఁగలరు. అందఱి నిప్పును తేజస్సు గలదిగానే ఉండును.

"ఒకనికి ఇద్దఱు కవలపిల్లలు ఉన్నారనుకొనుము. అందు ఒకఁడు వేదము చదువుకొని గురువుచే నుపనీతుఁడై యున్నాఁడనుకొనుము. రెండవవాఁడు వేదము చదువుకొననివాఁడై

గురువుచే నుపనీతుఁడుగాక యున్నాఁడనుకొనుము. వారిలో నెవరిని గౌరవించి భోజనము పెట్టుదుము''

''వేదము చదువుకొని గురువుచే నుపనీతుఁడైన వానికే''

ఒకనికి ఇద్దఱు కవల పిల్లలు ఉన్నారనుకొనుము. అందులో వేదము చదువుకొని గురువుచే నుపనీతుఁడై యుండియు దుశ్శీలుఁడై పాపాత్ముఁడయ్యెననుకొనుము. రెండవవాఁడు వేదము చదువుకొనక గురువుచే నుపనీతుఁడుగాక యుండియు సుశీలుఁడై పుణ్యాత్ముఁడై యున్నాఁడనుకొనుము. వీరిలో నెవనిని గౌరవించి భోజనము పెట్టుదుము పాపికి బెట్టినందువలన లాభమేమి''

"సుశీలుఁడైనవానికే భోజనము పెట్టుదుము. పాపికిఁ బెట్టిన లాభము లేదు."

"ఆశ్వలాయన! మొదట జాతి గొప్పదని, పిదప జాతి కంటె వేదాధ్యయనము గొప్పదని, పిదప శీలము గొప్పదని నీవే యంగీకరించితివి గదా. నేను ఆ శీలమె గొప్పదనియు జన్మమాత్రమున గొప్పఁదనము గలుగదనియు నుపదేశించుచున్నాను."

అప్పుడు ఆశ్వలాయనుఁడు మౌనమువహించి భగవానుని ధర్మమును గ్రహించి యుపాసకుఁడయ్యెను.

* * *

## పోట్ఠపాదుఁడు - సంజ్ఞ ఆత్మ - వ్యాకృతములు

ఒకసారి బుద్ధభగవానుఁడు శ్రావస్తిలో అనాథ పిండికుని జేతవనములో విహరించుచు ఉదయము భిక్షకై బయలుదేఱెను.



భిక్షాసమయమింకను కాలేదని తలఁచి యీలోపుగా ''పోట్ఠపాద పరివ్రాజకుఁడు తన పరిషత్తుతో నివసించు మల్లికారామము (కోసలరాజు భార్య వేయించిన యారామము) అగు తిందుకాచీరమునకు వెళ్ళి వచ్చెదను'' అని తలఁచి యక్కడకు వెళ్ళెను.

ఆ సమయమున పోట్ఠపాదుఁడు తన పరిషత్సభ్యులతో లౌకిక కథలను గూర్చి ప్రస్తావించుచుండెను. భగవానుని రాకచూచి తన సభ్యులతో ''నిశ్శబ్దముగా నుండుఁడు అని చెప్పి భగవానునికి స్వాగతము చెప్పి యిట్లనెను.

''భగవానుఁడా! దయచేయుఁడు. చిరకాలమునకు వచ్చితిరి. ఈ యాసన మలంకరింపుఁడు.''

అపుడు భగవానుఁడువచ్చి యాసనమునఁ గూర్చుండెను. ప్రోష్ఠపాదుఁడు క్రిందుగా ఒక యాసనము వేసికొని కూర్చుండెను. భగవానుఁడు పోట్ఠపాదునితో నిట్లనెను.

''పోట్ఠపాదా! దేనినిగూర్చి ప్రసంగించుచుంటిరి.''

"మా ప్రసంగముల కేమిలెండు, కాని కుతూహల శాలలోఁ జేరిన నానామతములవారు అనేక ప్రసంగములు గావించిరి. ఆ శ్రమణులు బ్రాహ్మణులును అభిసంజ్ఞానిరోధమును (సమాధిని) గూర్చి తమ తమ యాశయములు వెల్లడించిరి. సంజ్ఞ " నామరూపముల చేతన) తన కరణము లేకుండనె పుట్టును. కారణము లేకుండనె నిరుద్ధము అగును " అని కొందఱనిరి. "సంజ్ఞయె (నామరూపముల చేతన) పురుషునికి ఆత్మ. అది వచ్చుచుఁ బోవుచుండును. అది వచ్చినప్పుడు పురుషుఁడు

సంజ్ఞగలవాఁడగును. అది పోయినపుడు సంజ్ఞలేనివాఁడగును." అని కొందఱందురు. ఈ విధముగ అనేకులు తమ తమ యభిప్రాయములు తెలుపుచున్నారు. ఇందు విషయమయి భగవానుని యాశయమేమో తెలిసికొనఁ గోరుచున్నాను." అని ప్రోష్ఠపాదుఁడనెను.

అపుడు బుద్ధభగవానుఁడిట్లనెను.

"ప్రోష్ఠపాదా! ప్రపంచమున విద్యాచరణయుక్తులు భగవానులునైన బుద్ధులు పుట్టుచుందురు. వారు ఉపదేశములు చేయుచుందురు. వారు ఎల్లపుడు శీలసంపద గలిగి యుందురు. వారు పంచేంద్రియముల కోరికల నుండి ముక్తులై తమ్ముఁదాము పరిశీలించుకొనుచు సంతుష్టులై యుందురు. వారి మనస్సు శాంతమై యుండును. వారి శరీరము నిశ్చలమై యుండును. అంత వారి చిత్తము ఏకాగ్రమగును. ఇది వారి శిక్షణము. ఈ విధమైన శిక్షణము వలన అవసరమైనచో సంజ్ఞ యుత్పన్నమగును నిరుద్ధమగును గూడ. కాన పురుషుని సంజ్ఞలకు సరియయిన కారణము గలదు. కారణములేక గలుగు ననరాదు. అట్లు ఏకాగ్రిత పొందినవారు కామభోగముల నుండి దుష్టకార్యముల నుండి విడివడి క్రమ క్రమముగా వివేకమ చే ఇతర విషయములందు ఉపేక్షాభావమును పొందుదురు. పిదప దానిని విడిచి నానాత్వమును విడిచి అనంతాకాశరూపమైన యాయతనమును పొందుదురు. ఇదియు పోయిన పిదప విజ్ఞానరూపమైన యాయతనమును పిదప దానిని విడిచి క్రమ క్రమముగా అభిసంజ్ఞానిరోధ రూపమైన సంప్రజ్ఞాత సమాధిని పొందుచిదురు. వరకు భిక్షువులు అంతిమ స్థానమును పొందుదురు.



తరువాత 'చింతనము చేయుట చెడ్డది. చింతనము చేయక పోవుటయె మంచిది" అని వారికిఁ దోఁచును." అని.

"భగవానుఁడా! సంజ్ఞపుట్టుక ముందా లేక జ్ఞానము ముందా? లేక జ్ఞానము ముందుపుట్టి సంజ్ఞ పిదపఁ బుట్టునా?"

"ప్రోష్ఠపాదుఁడా! సంజ్ఞ ముందు పుట్టును. తరువాత జ్ఞానము పుట్టును. సంజ్ఞ వలననే జ్ఞానము గలుగును.''

"భగవానుఁడా! సంజ్ఞయె పురుషుని యాత్మయా? లేక సంజ్ఞ వేఱు ఆత్మ వేఱునా?"

"ప్రోష్ఠపాదా! నీవు దేనిని ఆత్మగా అనుకొనుచున్నావు?"

"భగవానుఁడా! నేను నాలుగు భూతములు గలిగి యన్నాదులను భుజించెడి యన్నమయకోశ రూపమైన దేహమును ఆత్మయని యనుకొనుచున్నాను."

''ప్రోష్ఠపాదా! ఆ అన్నమయ కోశమునే యాత్మ యనుకొన్నచో సంజ్ఞ వేఱు ఆత్మ వేఱు. ఆత్మ స్థూలమైనదగుట వలననే సంజ్ఞ పుట్టును. నిరుద్ధమును నగును. ఇందువలన అవి వేఱనవలయును.

"భగవానుఁడా! అయితే నేను ఇంద్రియములతోఁగూడిన మనోమయ కోశమును ఆత్మగా అనుకొనుచున్నాను."

"అయితే ప్రోష్ఠపాదా! సంజ్ఞ వేఱు ఆత్మ వేఱు. మనోమయమె యాత్మ యన్నచో పురుషునికి కొన్ని కొన్ని సంజ్ఞలు పుట్టును. కొన్ని గొన్ని నిరుద్ధమగును. ఇందువలన అవి వేఱనవలెను."

"అయితే నేను రూపము లేనిదానినె ఆత్మ యని యను కొనుచున్నాను."

"పోష్ఠపాదా! రూపము లేనిదె యాత్మ యన్నచో సంజ్ఞ వేఱు ఆత్మ వేఱు. రూపము లేనిదె యన్నచోఁ గొన్ని సంజ్ఞలు పుట్టును కొన్ని నిరుద్ధమగును. ఇందువలన అవి వేఱనవలయును."

"అయితే భగవానుఁడా! సంజ్ఞ పురుషుని యాత్మయా? లేక సంజ్ఞ వేఱా? ఆత్మ వేఱా?"

"ప్రోష్ఠపాదా! భేదదృష్టి గలవారు దీనిని దెలిసికొనుట కష్టము."

"భగవానుఁడా! భేదదృష్టి గలవారు దీనిని దెలిసికొనుట కష్టమైనచో లోకము నిత్యమా, అనిత్యమా అంతుగలదా, అంతు లేనిదా జీవుడు శరీరము ఒకటా రెండా? మరణించిన పిదప తథాగతుఁడు మరల పుట్టునా పుట్టఁడా?" అను వీనిని గూర్చి భగవానుఁడేమనును?

"పోష్ఠపాదా! లోకము సత్యమా అసత్యమా? లోకము అంతము గలదా అంతము లేనిదా?, జీవుఁడు శరీరము ఒకటా వేఱా? మరణిచింన పిదప తథాగతుఁడు తిరిగి పుట్టునా పుట్టఁడా? వీని అవ్యాకృతములు (అనిర్వ్యచ్యములు=స్పష్టముగా నిర్వచింపరానివి.) అని యంటిని."

"భగవానుఁడా! వీనిని అవ్యాకృతములని యెందుకుఁ జెప్పితిరి?"

"ప్రోష్ఠపాదా! ఇవి ప్రయోజనము గలవిగావు. ధర్మ



యుక్తమైనవి గావు. ఇవి బ్రహ్మచర్యమునకుఁ గాని, నిర్వే దమునకుఁగాని, విరాగమునకుఁగాని, నిరోధమునకుఁ (క్లేశ వినాశమునకు) గాని, శాంతికిఁగాని అభిజ్ఞకుఁగాని సంబోధికిఁ (పరమార్థ జ్ఞానమునకు) గాని నిర్వాణమునకుఁ గాని యుప యోగింపవు. అందువలన వీనిని అవ్యాకృతము లంటిని."

"భగవానుఁడా! భగవానుఁడు వేనిని వ్యాకృతములుగాఁ జెప్పిరి."

"ప్రోష్ఠపాదా! ఇవి సార్థకమైనవి. ధర్మమునకు బ్రహ్మ చర్యమునకు నిర్వేదమునకు విరాగమునకు నిరోధమునకు ఉప శమమునకు అభిజ్ఞకు సంబోధికి నిర్వాణమునకు ఉపయోగించు నవి. కావున వీనిని వ్యాకృతములని చెప్పితిని."

"భగవానుఁడా! అవును. ఇవి యట్టివే. భగవానుఁడా! తమకు ఇప్పుడేదైన పని యుండు సమయమేమో."

అప్పుడు భగవానుఁడు ఆసనమునుండి లేచి యటనుండి వెడలిపోయెను.

* * * *

## త్రివిధ శరీరములు

రెండుదినములైన పిదప చిత్తహత్థిసారిపుత్త్రుఁడును పోష్ఠపాదుఁడును భగవానుఁడున్న చోటికి వెళ్ళి భగవానుని యనుజ్ఞ పొంది కూర్చుండిరి.

అపుడు భగవానుఁడిట్లు చెప్పెను.

"ప్రోష్ఠపాదా! కొందఱు శ్రమణులు బ్రాహ్మణులు "చనిపోయిన పిదప ఆత్మ రోగములు లేనిదై కేవల సుఖరూపము గలదై యుండును." అను దృష్టిగలవారు. అప్పుడు నేను వారితో "మంచిది అట్టి కేవల సుఖరూపమై యున్న లోకమునుగాని, పోనీ యొక రోజైన అట్టి యాత్మనుగాని చూచితిరా" అని యడుగఁగా "వారు లేదు" అని యనుచున్నారు. "ఈ మార్గము అట్టి యాత్మను లోకమును సాక్షాత్కరింపఁ జేసికొనుటకు ఉపయోగపడునా?" అని యడుగఁగా 'లేదు' అని యందురు. అప్పుడు వారి మాటలను ప్రమాణముగఁ దీసికొనవచ్చునా?

"భగవానుఁడా! ప్రమాణముగఁ దీసికొనరాదు."

"ప్రోష్ఠపాదా! ఎవఁడైన ఒకఁడు ఒక సుందరిని వివాహమాడఁదలఁచుకొన్నాను అని యన్నచో ఆ సుందరి ఎట్టిదో ఏ జాతిదో తెలియునా అని యడిగినపుడు తెలియదు అన్నచో వానిని మన మేమనుకొనవలయును. వాని మాట ప్రమాణము అగునా? ఎవఁడైనను పైకెక్కుటకై మెట్లు కట్టుచున్నచో మేడ పైకి ఎక్కుటకు మెట్లు కట్టుచున్నావే ఆ మేడ ఏ వైపున నున్నది. ఏ దిక్కుగా నున్నది. ఎన్ని యంతస్థులు గలది. అని యడిగినచో "నాకు తెలియదు" అని యన్నచో వాని మాటలు ప్రమాణము లగునా?"

"భగవానుఁడా! ప్రమాణములు గావు"

"ప్రోష్ఠపాదా! ఈ విధముగనే ఆ శ్రమణులు బ్రాహ్మణులు చెప్పు "చనిపోయిన పిదప ఆత్మ రోగములేనిదై కేవల సుఖరూపమై యుండును" అను మాటలు ప్రమాణములుగావు."



"అవును భగవానుఁడా!"

"ప్రోష్ఠపాద! స్థూలశరీరము. మనోమయ శరీరము రూపరహిత శరీరము అని శరీరము మూఁడు విధములుగ నున్నది. నాలుగు భూతములతో తయారయి ఆహారమును భుజించు శరీరము స్థూల శరీరము, రూపము గలిగి సర్వాకారము గలిగి సర్వాంగములతో ఇంద్రియములతోఁ బూర్ణమైన శరీరము మనోమయ శరీరము, రూపరహితమై సంజ్ఞామయమైనది రూపరహిత శరీరము, స్థూలశరీరము వదలిపోవుటకు నేను ధర్మోపదేశము చేయుచున్నాను. ఈ మార్గము నధిష్ఠించిన వారి చిత్తమలములు నశించును. శోధక ధర్మము పరిపూర్ణ ప్రజ్ఞ యీ జన్మలోనె గలుగును. ఈ మార్గము కఠినముగాదు. అందులో ప్రీతి నిశ్చలత్వము సుఖము గలుగును. మనోమయ శరీరము వదలిపోపుటకు ధర్మోపదేశము చేయుచున్నాను. ఈ మార్గము పొందినవారి క్లేశములు నశించును. సుఖము గలుగును. రూప రహిత శరీరము పోపుటకు ధర్మోపదేశము చేయుచున్నాను. దానివల్ల సుఖము గలుగును. 'నీ యుపదేశమువలన ఈజన్మలోనే మార్గారూఢులై స్వయముగా తెలిసికొని జనులు విహరింతురా?' అని యితరులు నన్ను అడుగ వచ్చును.' అవును ఈ స్థూలాది శరీరముల పోవుటకే నేను ధర్మోపదేశము చేయుచున్నాను.' అని యందును.

'ఎవరైనను వచ్చి ఏమేడ నెక్కుటకు మెట్లు కట్టుచున్నావు, నన్నచో "అటువంటి మేడనెక్కుటకే మెట్లు కట్టుచున్నానం దును.' ఇటువంటి మాటలు జనులకుఁ బ్రమాణముగ నుండునా? ఉండవా?'

'భగవానుఁడా! ఎందుకు ఉండవు' అని ప్రోష్ఠపాదుఁడనేను.

అపుడు చిత్తహత్థి సారిపుత్రుఁడిట్లు అడిగెను.

"భగవానుఁడా! స్థూల శరీరమును పరిగ్రహించిన వానికి మనోమయ శరీరము రూపరహిత శరీశము మిథ్యలగును అపుడు స్థూలశరీరమె సత్యముగాఁదోఁచును. మనోమయ శరీరము పరిగ్రహించిన వానికి స్థూల శరీరము రూపరహిత శరీరమును మిథ్యలగును రూపరహిత శరీరము పరిగ్రహించిన వానికిస్థూల శరీరము రూపరహిత శరీరము మిథ్యలగును. రూపరహిత శరీరమె సత్యముగాఁ దోచునుగదా".

'సారిపుత్రా! ఒకశరీరమును పరిగ్రహించి నపుడు ఆ పరిగ్రహించిన వానికి పదితర శరీరము లున్నట్లు తెలియదు తాను పరిగ్రహించిన శరీరమె సత్యముగాఁ దోఁచును. 'నీవు భూతకాలములో ఉంటివి. భూతకాలములో లేనిచో నీవు ఉండవు. భవిష్యత్కాలములో ఉందువు. అపుడు ఉండకపోయినచో నీవు ఉండవు. వర్తమానములో ఉన్నావు. ఇపుడ నీవు లేనిచో నీవు ఉండవు' అని నిన్ను ఎవరైనా వడిగినచో ఏమందువు.'

నేను ఇదివఱకుంటిని అపుడు లేనిచో ఉండను. ముందు ఉందును. అపుడు ఉండనిచో ఉండను. ఇపుడు ఉన్నాను ఇపుడు లేనిచో ఉండను. అని వారికి జవాబు చెప్పుదును.'

'భూతకాలమందు శరీరమున్నచో నీకు అది సత్యము ఇతరములు మిథ్యలా? భవిష్యత్కాలమందు శరీరమున్నచో అది సత్యము ఇతరములు మిథ్యలా? వర్తమానమందు శరీర



మున్నచో అది సత్యము మిగిలినవి మిథ్యలా' అని యడిగినచో ఏమందువు.'

"అపుడు నేనిట్లు చెప్పుదును. 'భూతకాలమందు అప్పటికి అది సత్యము. భవిష్యద్వర్తమానములందు అది అసత్యము. అట్లే ఏ కాలములో ఏది యున్నదో అప్పటికి అది సత్యము మిగిలినవి అసత్యములు.' అని వారికి జవాబు చెప్పుదును."

"మంచిది స్థూలశరీర మున్నపుడు దానిని మనోమయ శరీరమనిగాని రూపరహిత శరీరమనిగాని యనము. ఇట్లే మనోమయ శరీరమున్నపుడు దానిని స్థూలశరీరమని గాని రూపరహిత శరీరమనిగాని యనము. రూపరహిత శరీరమున్నపుడు దానిని స్థూలశరీరమనిగాని మనోమయ శరీరమనిగాని అనము. ఆవునుండి పాలు, పాలనుండి పెరుగు, పెరుగు నుండి వెన్న, వెన్ననుండి నెయ్యి అగును గదా, పాలుగా నున్నపుడు అవి పాలే గాని పెరుగు వెన్న నెయ్యి గావు. దానిని పాలనియె యందుము. పెరుగుగా నున్నపుడు దానిని పెరుగని యందుము గాని మిగిలినవి అనము. అట్లే స్థూలశరీరముగా నున్నపుడు స్థూలశరీరము అని మనోమయ శరీరముగా నున్నపుడు మనోమయ శరీరమని రూపరహిత శరీరముగా నున్నపుడు రూపరహిత శరీరమని చెప్పఁబడునని తెలియవలయును. అవి లౌకిక సంజ్ఞలు ఇది లోక వ్యవహారము. తథాగతుఁడు వానిని అంటక వ్యవహరించును."

ఇట్లు చెప్పఁగా విని "ఆశ్చర్యము అద్భుతము. భగవానుఁడు మమ్ము తమ యుపాసకులనుగా పరిగ్రహింతురు గాక." అని వలికి ప్రోష్ఠపాదుఁడు సారిపుత్రుఁడు భగవానుని

వలన దీక్ష పొంది ఏకాంతవాసులై ప్రమాద రహితులై యాత్మ సంయము గలవారలయిరి. వారు ఈ జన్మలోనే బ్రహ్మచర్య ఫలితము పొందిరి. వారి జన్మ క్షీణమయ్యెను. బ్రహ్మచర్య వాసము పూర్తి యొందెను. పొందవలసినది వారు పొందిరి. వారింకఁ జేయవలసినది లేకపోయెను. వారు అర్హతులైరి.

* * *

## అ ని ర్వా చ్య ము లు

ఒకసారి బుద్ధభగవానుఁడు శ్రావస్తిలో అనాథ పిండికుని జేతవనమున విహరించుచుండెను,

అపుడు ఆయుష్మంతుఁ డగు మాలుంక్య పుత్త్రుఁడు సాయంకాలము ధ్యానమునుండి లేచి భగవానుని దగ్గఱకుఁబోయి నమస్కరించి యొక ప్రక్కగాఁ గూర్చుండి యిట్లనెను.

"భగవానుఁడా! నా మనస్సులో ఈ క్రింది విధముగా సంశయము గలుగుచున్నది. లోకము శాశ్వతమా? అశాశ్వతమా? లోకమునకు అంతు ఉన్నదా? లేదా? జీవుఁడు శరీరము ఒకటా లేక జీవుఁడు శరీరము వేఱువేఱా? చనిపోయిన పిదపఁ గూడ తథాగతుఁడు ఉండునా? ఉండఁడా? అని. ఈ విషయములో వీనిని మీరు అనిర్వాచ్యములుగ జెప్పి జవాబు చెప్పక జవాబు చెప్పుటకును ఇష్టపడక యుంటిరి. మీరు వీనిని సరిగాఁ జెప్పనిచోఁ దిరిగి గృహస్థాశ్రమము స్వీకరింపవలయు నని యనుకొనుచున్నాను. మీకుఁ దెలిసినచోఁ దెలిసినదని చెప్పుఁడు. తెలియనిచోఁ దెలియదని చెప్పుఁడు. ఇట్లు సందిగ్ధముగాఁ జెప్పకుఁడు."



"మాలుంక్య పుత్త్రా! సరేకాని. నీవిక్కడకు వచ్చి బ్రహ్మచర్య వాసము చేయఁదలఁచి నప్పుడు నీ విక్కడ ఉండుము. లోకము శాశ్వతమా? కాదా? మొదలగు విషయములను గూర్చి చెప్పెదను అని నీకుఁ జెప్పితినా?"

"భగవానుఁడా! లేదు."

"అట్లయినప్పుడు నీవు ఏమని యిప్పుడు బెదరింతువు మఱి యెవఁడైనను వచ్చి లోకము శాశ్వతమా కాదా? మొదలగు విషయములు చెప్పినఁగాని నేను బ్రహ్మచర్య మాచరింపను. ఈ లోపుగా తథాగతుఁడు చెప్పకుండనే చనిపోవునేమో అని యనునా? ఒక పురుషునికి విషము పూసిన బాణపుములికి తగిలిన దనుకొనుము. అపుడు వాని దగ్గఱకు వాని స్నేహితులు గాని, బంధువులుగాని శల్యచికిత్సకుఁడగు వైద్యునిఁ దీసికొని వచ్చి రనుకొనుము. అపుడా శల్యము చికిత్స చేయువాఁడు "ఈ వైద్యుఁడు బ్రాహ్మణుఁడా, క్షత్రియుఁడా. ఏ వర్ణమువాడు లావుగా నుండునా సన్నగా నుండునా? నల్లటివాఁడా, తెల్లనివాఁడా, వాని దేయూరు ఇవన్నియుఁ దెలిసినఁగాని శల్యమును దీయనీయను. అనియు ఆ వైద్యుఁడు ఆ కొట్టినవాని ధనుస్సును నారిని ఆ బాణమునకుఁ గట్టిన యీకలు గ్రద్దవో, కాకివో అను సంగతిని దెలిసికొన్నఁగాని శల్యము దీయను. ఆ శల్యము ఇనుపదా? లేక యే జంతువు కొమ్ముతో సైసఁ జేయఁబడినదా? ఇవన్ని తెలిసినఁగాని నేను శల్యమును దీయను అని యన్నచో వానికా విషయములు తెలియకపోవుటయేగాక చనిపోవును గూడ. అట్లే తథాగతుఁడు లోకము శాశ్వతమా? కాదా అను మొదలగు విషయములు చెప్పినఁగాని బ్రహ్మచర్యమాచరింపను అని యన్నచో వానిని దెలియకుండఁగనే వాఁడు చని

పోవును. కనుకనే నేను వానిని అనిర్వాచ్యములంటిని. లోకము శాశ్వతమైనను, శాశ్వతము గాకపోయినను బ్రహ్మచర్యము చేయవలసినదే. లోకము శాశ్వతమైతేనేగాని బ్రహ్మచర్యమాచరింప నన వీలులేదు. జన్మ యుండనే యున్నది ముసలితనమును గలదు. చావు తప్పదు. దుఃఖము ఏడ్పు ఉన్నట్లు స్పష్టము. వానిని బోఁగొట్టుకొను మార్గమును జెప్పుచున్నాను. కనుకనే లోకము శాశ్వతమా? కాదా? అను విషయములను స్పష్టముగాఁ జెప్పవలసిన పని లేని వానినిగాఁ జెప్పితిని. ఎందుకు వీనిని అవసరములుగాఁ జెప్పలేదనఁగా ఇవి బ్రహ్మచర్యమున కుపయోగింపవు. వైరాగ్యమున కుపయోగింపవు. శాంతికి మార్గములు గావు. జ్ఞానమునకును నిర్వాణమునకును బనికిరావు. కాన వీనిని అనిర్వాచ్యములంటిని. దుఃఖము లున్నవి. దుఃఖోత్పత్తి కారణము లున్నవి. దుఃఖమును దప్పించుకొన వలయును. దుఃఖమును దప్పించుకొను నుపాయములున్నవి. ఇవి బ్రహ్మచర్యమునకు, వైరాగ్యమునకు, శాంతికి, జ్ఞానమునకు నిర్వాణమునకు ఉపయోగించును. కాన వీనిని నిర్వాచ్యములుగ నిర్వచించితిని. అందుచే నిర్వచింపవలసిన వానిని నిర్వాచ్యములుగను నిర్వచింపఁబనిలేనివానిని అనిర్వాచ్యములుగను జెప్పితిని. కనుక మాలుంక్య పుత్త్రా! నిర్వాచ్యములను నిర్వాచ్యములుగను, అనిర్వాచ్యములను అనిర్వాచ్యములుగను దెలిసికొనుము."

అంత నా మాలుంక్య పుత్త్రుఁడు సంతసించి నమస్కరించి వెడలిపోయెను.

* * *



(బుద్ధుని 49–55 వయస్సులో)

## కూటదంత బ్రాహ్మణుఁడు

ఒకమాఱు భగవానుఁడు అయిదువందల భిక్షువులతోఁ గూడ మగధ దేశమునఁ దిరుగుచు ఖానుమత మను బ్రాహ్మణ గ్రామమునకు వచ్చి యట ఆమ్రయష్టికా వనమున విహరించుచుండెను.

అప్పుడు ఆ గ్రామమునకు అధికారియగు కూటదంతుఁడను బ్రాహ్మణుఁడు ఒకయజ్ఞమును జేయఁదలఁచి యేడువందల యెద్దులు, ఏడువందల దూడలు, ఏడువందల మేకలు. ఏడువందల గొఱ్ఱెలు తెప్పించి యుంచెను.

అప్పుడు అక్కడి వైశ్యులు బుద్ధభగవానుని దర్శించుటకు గుంపులుగూడి పోవుచుండిరి. అది చూచి కూటదంతుఁ డిట్లు తలంచెను. "శ్రసణుఁడను గౌతముఁడు షోడశ పరిష్కారములతోఁ గూడిన మూఁడు విధములైన యజ్ఞసంపదలను ఎఱుంగునని వింటిని. నేనుయజ్ఞములను జేయఁదలచి యుంటిని గానఁ బోయి అడుగుదును'' అని

ఇట్లు తలచిఁ యజ్ఞమునకై వచ్చిన బ్రాహ్మణులు గౌతముని దగ్గఱకుఁ బోవఁదగదని వారించినను మానక బుద్ధభగవానుఁ చున్న చోటికిఁబోయి యొకప్రక్కగాఁ గూర్చుండి భగవానునితో నిట్లనెను.

''ఓ. గౌతమా! నేను యజ్ఞమును జేయఁదలఁచి యుంటిని. శ్రవణ గౌతమునికి షోడశ పరిష్కారములతోఁ గూడ

త్రివిధ యజ్ఞసంపదలఁగూర్చి తెలియునని వింటిని. నాకది యుపదేశింతురుగాక' అది విని భగవానుఁ డిట్లు చెప్పెను.

ఓ బ్రాహ్మణుఁడా! పూర్వము ధనధాన్యములతోడను. వెఁడి బంగారములతోడను తులతూఁగు మహావిజితుఁడను రాజు గలఁడు. నాదగ్గఱ చాల ధనమున్నది. చాల రాజ్యము గలదు. నేను చాల కాలముదాఁక ప్రజలకు సుఖము గలుగునట్లు ఏదైన యజ్ఞమును జేసినచో బాగుండును" అని తలఁచి తన పురోహిత బ్రాహ్మణుని రావించి తనయాశయము తెలిపెను. అప్పుడతఁడు మహా విజితునికి మూఁడు విధములైన యుపదేశములను జేసెను. యజ్ఞము చేయఁదలఁచినవానికి 1 ఈ ధనమంతయు అయిపోవఁగలదు, 2 ఈ ధనమంతయు అయిపోవుచున్నది. 3 ఈ ధనమంతయు అయిపోయినది' అని విచారము గలుగును. కాన ఈ మూఁడు విధములైన విచారములు పొందరాదు.

మఱియు యజ్ఞమునకు వచ్చినవారిలో పది విధములైన దోషములుండవచ్చును. అవి తొలగింప వలయును. 1) వచ్చిన వారిలో ప్రాణులను హింసించువారు ఉండవచ్చును. హింసింపనివారును ఉండవచ్చును. ప్రాణిహింసకుల హింసను వారికే వదలి ప్రాణులను హింసింపని వారిని గూర్చియే మన మా యజ్ఞము చేయవలయును, వారినే సంతోష పెట్టవలయును. వారు వారి చిత్తములను ప్రసన్నముగఁ జేయుదురుగాక. (2) ఈయకుండఁ బుచ్చుకొనువారుండవచ్చును. ఈయకుండఁ బుచ్చుకొనని వారినిగూర్చి యజ్ఞము చేయ వలయును. వారిని సంతోష పెట్టవలయును వారు తమ మనస్సును ప్రసన్నము



చేయుదురుగాక. (3) మిథ్యాచారులను వదలి సదాచారులను. (4) అమృత వాదులను వదలి సత్యవాక్కులను. (5) చాడీలు చెప్పువారిని వదలి చాడీలు చెప్పని వారిని (6) పరుషముగ మాటాడువారిని వదలి మధురముగ మాటాడు వారిని (7) వాగు వారిని విడచి మితభాషులను, (8) లోభులను వదలి లోభము లేనివారిని (9) ద్రోహులను వీడి ద్రోహము చేయనివారిని (10) మిథ్యాదృష్టి గలవారిని వీడి సత్యదృష్టి గలవారిని సంతోషము పెట్టి యజ్ఞము చేయుదుముగాక." అని యీ పురోహితుఁడు చెప్పి మొదట ఆ మహాజితునిలోని చిత్తమలములను దొలఁగించెను. మఱియు ఆ పురోహితుఁడు మహావిజితుని పదునాఱు విధములుగ సముత్తేజపఱుప నిట్లు బోధగావించెను. "1 మహావిజితుఁడు యజ్ఞము చేయుచున్నాఁడు గాని పట్టణములోని గ్రామములలోని జాగీర్దారులను రాజులను బిలువలేదని నిన్ను అనువాఁడెవ్వఁడు నుండరాదు. అందఱను బిలిచెను వారందఱు సంతసింతురు గాక వారు ప్రసన్నులయి యుందురు గాక. 2 పట్టణ గ్రామములందలి యమాత్యులను సభాసదులను 3 బ్రాహ్మణులను మహాశాలులను 4 ధనికులైన వైశ్యులను పిలువలేదని గాని 5 రాజు తల్లిదండ్రుల రెండువైపుల సుజాతుఁడును, 6 దర్శనీయుఁడును 7 శీలవంతుఁడును 8 ధనికుఁడు బహు స్వర్ణరజిత ధనధాన్య కోశాదియుక్తుఁడును 9 చతురంగ సేనాయుక్తుఁడును 10 శ్రద్ధగల దాతయు 11 బహుశ్రుతుఁడును 12 పండితుఁడు మేధావి గాఁడనిగాని 13 రాజు పురోహితులు సత్కుల జాతులును వేదమంత్రధారులును 15 శీలవంతులును 16 పండితులు మేధావులు గారనిగాని యెవరును అనునట్లు మనము ప్రవర్తింపక ఏ విధమైన లోటును లేకుం

డను ఆచరింప వలెను." ఈ పదునాఱు విధములలోను రాజును బోధపఱచెను. అని చెప్పి మరల ఆ బ్రాహ్మణునితో భగవానుఁడిట్లనియె.

"ఓ బ్రాహ్మణుఁడా! ఆ యజ్ఞములో ఆవులు చంపఁబడలేదు. గొఱ్ఱెలు మేఁకలు కోళ్ళు మొదలైనవేమియు చంపఁబడలేదు. యూపస్తంభమునకై చెట్లు కొట్టఁబడలేదు. హింస కాన దర్భలు కోయలేదు. మఱియు నందు దాసదాసీ జనులు భయముచేఁగాని యేడ్చుచుఁగాని సేవలు చేయలేదు. ఇష్టమున్నవారు చేసిరి. ఇష్టము లేనివారు మానివైచిరి. ఎవనికేది చేయవలెననియున్న వాఁడా పని చేసెను. చేయనిష్టములేని పనిని చేయలేదు. నేయి, నూనె, వెన్న, పెరుగు, తేనె బెల్లములతోనే యా యజ్ఞము పూర్తియయ్యెను."

"మఱియు నప్పుడు ఓ బ్రాహ్మణా! పట్టణ గ్రామాదులందలి క్షత్రియులు రాజులు వైశ్యులు మొదలగువారు ఆ మహావిజితుని దగ్గఱకు ధనధాన్యాదులను దెచ్చి వానిని స్వీకరింపమని గోరిరి. కాని తన దగ్గఱనే కావలసినన్ని ధనధాన్యాదులున్నవని కావలసినచో వారే తీసికొనివెళ్ళ వచ్చుననియుఁ జెప్పి రాజు వారి ధనధాన్యాదులను వారియింటికి త్రిప్పి పంపివైచెను. మహావిజితుఁడు యజ్ఞము చేయుచున్నాఁడు మనమును ఇట్టిది చేయుదమని తలఁచి వారును యజ్ఞములు చేయనాలోచించిరి. వారి యజ్ఞములలోను జంతువులు చంపఁబడలేదు. నేయి నూనె మొదలగు వానితోనే యజ్ఞములు చేయఁబడెను.



ఈ విధముగా 1 జాగీర్దారులు క్షత్రియులు మొదలగువారును 2 అమాత్య సభాసదులును 3 బ్రాహ్మణులును 4 ధనికులును వైశ్యులను ఈ నాలుగు విధములైనవారును యజ్ఞములు చేసిరి. 1 సత్కులజాతుఁడు 2 దర్శనీయుఁడు 3 శీలవంతుఁడు 4 ధన ధాన్యాద్యైశ్వర్య సంపన్నుఁడు 5 చతురంగ సేనాయుక్తుఁడు 6 శ్రద్ధగలదాత 7 బహుశ్రుతుఁడు 8 పండితుఁడు మేధావియునైన మహావిజితుఁడు ఈ యెనిమిది యంగములు గలవాఁడై యజ్ఞము చేసెను. ఇంక పురోహితులు 1 సత్కులజాతులు 2 వేదాధ్యయన పరులు 3 శీలవంతులు 4 పండితులు మేధావులునైన పురోహితులును యజ్ఞములు చేసిరి. ఈ పదునాఱు పరిష్కారములు మూఁడు విధములుగా (1 జాగీర్దారులు మొదలగువారు 2 రాజు 3 పురోహితులు) జరిగెను. వీనినే మూఁడు విధములైన యజ్ఞ సంపదలు పదునాఱు పరిష్కారములు అని యందురు."

ఇట్లు చెప్పిన పిదపఁ గూటదంత బ్రాహ్మణుఁడిట్లనియె.

"ఓ గౌతమా! ఇట్టి యజ్ఞమును స్వయముగా మీరు ఎఱుఁగుదురా! ఇట్టి యజ్ఞమును చేసినను జేయించినను శరీరము విడచిన పిదప స్వర్గము గలుగునా?"

"ఓ బ్రాహ్మణుఁడా! నేనెఱుఁగుదును. నేనాసమయములో అట్టి యజ్ఞమును జేయించిన పురోహితుఁడనుగాఁగూడ నుంటిని"

"ఈ పదునాఱు పరిష్కారములతోను ఈ మూఁడు విధములైన యజ్ఞ సంపదముతోడను గూడిన యజ్ఞముకంటె తక్కువ సామగ్రి గలదై యెక్కువ ఫలమిచ్చు యజ్ఞమేదైనఁ గలదా?"

"ఉన్నది. సదాచారులైన సంన్యాసులకు నిత్యము దానములు చేయుచుండుట యెక్కువ ఫలమిచ్చు యజ్ఞము".

"ఓ గౌతమా! ఎందువలన".

"బ్రాహ్మణుఁడా! ఇట్టి యజ్ఞములకు ముక్తులు గాని ముముక్షువులు గాని రారు. ఇట్టి యజ్ఞములలో ప్రాణి హింస జరుగుచుండును. కాన ఇది మహా ఫలదాయి కాదు."

"ఇంతకంటెను మహాఫలమిచ్చు యజ్ఞమున్నదా?"

"ఉన్నది. నాలుగు దిక్కులందు సంఘమునకు విహారములను (=ధర్మశాలలను) కట్టించుట గొప్ప యజ్ఞము."

"ఇంతకంటెను అల్పసామగ్రికల గొప్ప యజ్ఞమున్నదా?"

"ఉన్నది. ప్రసన్నుఁడై యమ నియమములఁ బాలించుచు హింస చేయక, ఈయనిది పుచ్చుకొనక, స్వేచ్ఛగా మిథ్యాచారము వదలి, అబద్ధము పలుకక, మదకర వస్తువులను త్యజించుట మహాఫలమిచ్చు యజ్ఞము."

"ఇంతకంటెను అల్పసామగ్రికల యజ్ఞమున్నదా"

"ఉన్నది. బ్రాహ్మణా! శీల సంపన్నుఁడై ధ్యాన మగ్నుఁడై సమాధియందుండుట మహామహిమగల యజ్ఞము."

"ఓ గౌతమా! ఆశ్చర్యము. గౌతమా! ఆశ్చర్యము. నేను భగవానుని శరణు చొచ్చుచున్నాను. ధర్మమును సంఘమును శరణు చొచ్చుచున్నాను. నన్నుఁ దమ యుపాసకునిగ గ్రహింపుఁడు. ఇదిగో ఇప్పుడే ఏడువందల యెద్దులను, ఏడువందల మేఁకలను గొఱ్ఱెలను అన్నింటిని విడిచిపుచ్చుచున్నాను. ఇవి జీవనదానము పొంది వచ్చిక, చల్లని నీరు త్రావుఁగాక, సుఖించుఁగాక." అని ఆ కూటదంత బ్రాహ్మణుఁడు భగవానుని యుపాసకుఁ డయ్యెను.



* * * *

## సోణదండ బ్రాహ్మణుఁడు

ఒకప్పుడు బుద్ధభగవానుఁడు అయిదువందల భిక్షులతోఁ గలిసి యంగదేశమునఁ దిరుగుచుఁ జంపానగరమును (భాగల్పూరు) జేరి యక్కడ గర్గరా పుష్కరిణీ యొడ్డున విహరించుచుండెను.

ఆ సమయమున సోణదండుఁడను బ్రాహ్మణుఁడు చంపానగరమునకు అధికారి. ఆ చంపానగరము ఆ బ్రాహ్మణునికి మగధరా జగు బింబిసారునిచే దానము చేయఁబడియెను. అది బహుజనాకీర్ణమై తృణకాష్ఠోదక ధాన్యసమృద్ధమై యుండెను.

సంన్యసించి యార్హతుఁడై సమ్యక్సంబుద్ధుఁడై గౌతముఁడు చంపానగరమున గర్గరా పుష్కరిణీ యొడ్డున విహరించుచుండెనని యా నగరమందలి గృహస్థులగు బ్రాహ్మణులు విని గుంపులు గుంపులుగా గర్గరా పుష్కరిణీ వైపుగాఁ బోవసాగిరి.

అది చూచి సోణదండుఁడును శ్రమణ గౌతముని దర్శింప బయలుదేఱెను. ఏదో పనిమీఁద ఆ చంపానగరములో నివసింప వచ్చిన నానాదేశ వాసులైన యయిదువఁదల బ్రాహ్మణులును సోణదండ బ్రాహ్మణునితో బుద్ధుని దర్శింప బయలుదేఱిరి. తన్ను బుద్ధుఁ డేదైన నడిగినచోఁ దాను జెప్పలేనిచో అగౌరవ

మని తలఁచి వెనుకకుఁ బోదమన్న సగము దూరము వచ్చి భయపడి వెనుకకుఁ బోయెనని తోడివారు అనుకొందురేమో యని భయపడియు సోణదండుఁడు వెళ్ళుటకే నిశ్చయించుకొని బుద్ధ భగవానుని సమీపించెను.

సోణదండుఁడు బుద్ధ భగవానుని సమీపించి యతని యనుజ్ఞ పొంది యొకప్రక్కఁ గూర్చుండెను. ఆ బ్రాహ్మణులు గూడ ఒకఁడు నమస్కరించియు, మఱియొకరు అనుజ్ఞ పొందియు, వేఱొకరు బుద్ధునివైపు చేతులు జోడించియు, ఇంకొకరు తమతమ గోత్ర నామములు చెప్పియు ఒకవైపుగఁ గూర్చుండిరి.

అపుడు బుద్ధభగవానుఁడు ఆ సోణదండ బ్రాహ్మణునిఁ జూచి "ఓ బ్రాహ్మణుఁడా! బ్రాహ్మణులు ఏ గుణములు గల వానిని బ్రాహ్మణుఁడందురు." అని ప్రశ్నించెను.

అపుడు సోణదండుఁడు లేచి నిలుచుండియు పరిషత్తు వైపు దిరిగి యిట్లనెను.

"ఓ గౌతమా! ఈ క్రింది యయిదు గుణములు గలవానిని బ్రాహ్మణులు బ్రాహ్మణుఁ డందురు. 1 తల్లిదండ్రు లిరువురు బ్రాహ్మణులై యుండుట. 2. వేదములు చదువుట. 3 సౌందర్యము శ్వేతవర్ణము గలిగియుండుట. 4. సుశీలుఁడై యుండుట. 5. బుద్ధిమంతుఁడై యుండుట. ఈ యయిదు గుణములు గలవానిని బ్రాహ్మణులు బ్రాహ్మణులందురు."

"ఓ బ్రాహ్మణుఁడా! ఈ యయిదింటిలో ఏదేని యొకటి లేకపోయినను బ్రాహ్మణుఁ డని యనవచ్చునా"



"అనవచ్చును. ఓ గౌతమా! ఈ యయిదింటిలోను శ్వేత వర్ణము గలిగి యుండుట అనునది లేకపోయినను వానిని బ్రాహ్మణుఁ డనవచ్చును. వాని తల్లిదండ్రులు బ్రాహ్మణులైనచో, వాఁడు వేదములు చదివినచో, సుశీలుడైనచో, బుద్ధిమంతుఁడైనచో ఈ నాల్గు గుణములున్నచో వానిని బ్రాహ్మణుఁ డనవచ్చును. శ్వేతవర్ణమున్నను, లేకున్నను బాధ యేమున్నది?"

"ఓ బ్రాహ్మణుఁడా! ఈ నాల్గు గుణములలో ఇంకొక గుణమేదేని లేనిచో వానిని బ్రాహ్మణుఁ డనవచ్చునా?"

"అనవచ్చును. ఓ గౌతమా! ఈ నాల్గు గుణములలో వేదములు చదువుట యను గుణము లేకున్నను వాని తల్లిదండ్రులు బ్రాహ్మణులైనచో వాఁడు సుశీలుఁడై బుద్ధిమంతుఁడైనచో బ్రాహ్మణుఁ డనవచ్చును."

సోణదండుఁడిట్లు చెప్పఁగాఁ దక్కిన బ్రాహ్మణు లిట్లనిరి. "ఓ సోణదండా! ఏమి యిట్లు చెప్పుచున్నావేమి? జన్మనుగూడఁ ద్రోసివైచి ప్రాచీన ధర్మమును మంటఁ గలిపి శ్రమణ గౌతముని మతమును స్వీకరించుచుంటివేమి?"

అది విని బుద్ధభగవానుఁ డా బ్రాహ్మణులతో నిట్లనెను. "అయ్యా! మీరు ఈ సోణదండుని అల్పశ్రుతునిగను ప్రజ్ఞాహీనునిగను నాతో వాదము చేయలేనివానిగను దలఁచుచున్నారు. అయితే ఇతఁడే యూరకొనును. మీరే వచ్చి నాతో వాదింపుఁడు. లేక యతనినే ప్రజ్ఞావంతునిగఁ దలఁచినచో అతనినే వాదము చేయనిండు."

ఇట్లు బుద్ధభగవానుఁడు చెప్పిన పిదప సోణదండుఁ డిట్లనెను. ఓ గౌతమా! మీ రుండుఁడు. నేనే వీరికి ధర్మయుక్తముగా సమాధానము చెప్పెదను." అని చెప్పి యా సోణదండుఁడు బ్రాహ్మణులతో నిట్లనెను.

"నా యన్న కొడుకైన యీ యంగమాణవకునిఁ జూడుఁడు. ఇతఁడు మంచి యందగాఁడు. శ్వేతవర్ణము గలవాఁడు. శ్రమణ గౌతముఁడు తక్కఁ దక్కినవారు ఈతని ఛాయకు సాటిరారు. ఇతఁడు వేదములను జదివినవాఁడే. నేనే యితనికి వేదమంత్రములను జెప్పితిని. ఇతని తల్లిదండ్రు లిద్దఱు బ్రాహ్మణులే. ఇతఁడే గనుక ప్రాణి హింస చేయుచు, దొంగతనము చేయుచు, అనృతమాడుచు దుష్కృత్యములను జేయుచున్నచో ఇతని వర్ణ మేమిచేయును. ఇతఁడు సదాచారియై బుద్ధిమంతుఁ డైనచో బ్రాహ్మణుఁ డగును. కాన ఈ రెండు గుణములను బట్టి బ్రాహ్మణుఁ డగును."

"ఓ బ్రాహ్మణుఁడా! ఈ రెండు గుణములలోను ఏదేని యొక గుణము లేనిచో బ్రాహ్మణుఁడని యనఁబడునా?"

"ఓ గౌతమా! కాదు వాఁడు బ్రాహ్మణుఁడని పిలువఁబడఁడు. శీలము బుద్ధిని, బుద్ధిశీలమును ఒకదాని నొకటి శుభ్రపఱచి పవిత్రము చేయును. ఒక చేతితో రెండవ చేతిని, ఒక కాలితో నింకొక కాలిని శుభ్రపఱచునట్లు శీలబుద్ధులు రెండు ఒకదాని నొకటి శుభ్రపఱచును. కాన నా రెండును అవశ్యకములే."

"ఓ బ్రాహ్మణా! అవును రెండును ఆవశ్యకములే కాని లోకమున బుద్ధికి శీలమే ప్రభువై యున్నది. అయితే శీలమన నేమి? బుద్ధి యన నేమి?"



"భగవానుఁడే మా కా సంగతి తెలియుఁగాక."

"ఓ గౌతమా! శ్రమణ గౌతముఁడు జీవహింసను దండమును, పాపకర్మలను, చౌర్యమును (ఇవ్వకుండఁ బుచ్చుకొనుట) విడిచియున్నాఁడు. విషయభోగములను విసర్జించెను. అసత్యమును, కొండెములను, కటుభాషణమును, పిసినిగొట్టుతనమును, విలాస నృత్యాదులను దాసదాసీజనములను, క్రయవిక్రయములను మాని ఒకసారే భుజించుచు ఉన్నాఁడు, ఇదియే శీలము. ఇంక బుద్ధిని గూర్చి చెప్పెదను వినుము. ఉత్తమ సత్యమును గూర్చిన జ్ఞానమె బుద్ధి ఆశ విడివఁగాని అది లభింపదు. ఆశ విడుచుట అనఁగా ఆశలను నిరోధించి ముక్తిపొందుట అనాసక్తి. ఇదియే దుఃఖమును నశింపఁజేయు నుత్తమ సత్యము. ఆశను విడిచినపుడు జన్మలేదు. దానిని బట్టి జరామరణాదులు పోవును. ఇదియే బుద్ధి."

అపుడు శోణదండుఁడు "భగవానుఁడా! ఆశ్చర్యము ఆశ్చర్యము నన్ను మీయుపాసకుని జేయుఁడు" అనెను.

అపుడు శోణదండునికి బుద్ధభగవానుఁడు దీక్ష యిచ్చెను.

* * * *

## జీవకుఁడు

సాలవతి యను రాజగృహమందలి యొక వేశ్య యొక కుమారుని గని యా బాలుని రాత్రి సమయమునఁ దన పరిచారికచేతఁ బెంటప్రోగుపైని బాఱవేయించెను.

ఉదయము ఆ దారిని బోవుచున్న అభయ రాజకుమారుఁడు అఱచుచున్న కాకులచేఁ జుట్టుముట్టఁబడియున్న బాలుని

జూచి వానిని తన యంతఃపుర పరిచారికాల కిచ్చి పెంచమని యాజ్ఞాపించెను. ఆ కుఱ్ఱవాఁడు పాఱవేయఁబడినను జీవించి యుండుటచే జీవకుఁడనియు కుమారుఁడు పోషించెను గానఁ గౌమార భృత్యుఁడనియు పిలువఁబడెను.

ఆ జీవకుఁడు పెద్దవాఁడయిన పిదపఁ దన తల్లిదండ్రు లెవరని యభయరాజ కుమారు నడిగెను. అతఁడు ఆ కుఱ్ఱవాఁడు దొరకుట మొదలగు వృత్తాంత మంతయుఁ జెప్పెను.

ఒకనాఁ డాజీవకుఁడేదేని శిల్పమును నేర్వఁ దలఁచి యెవరికిని దెలుపకుండనే తక్షశిలకుఁ బోయి యట నేడేండ్లు వైద్యము నభ్యసించెను.

ఒక రోజున "ఈ వైద్యమున కంతులేదని యెంచి యింక గురువు వద్ద సెలవు తీసికొనఁదలఁచి "ఎప్పుడు ఈ విద్యకు అంతు దొరకును" అని గురువు నడిగెను. అపుడు గురువు ఒక గునపము నిచ్చి యీ తక్షశిల చుట్టుప్రక్కలకు ఒక యోజనము వఱకుఁబోయి మందునకుఁ బనికిరాని మొక్క యేదేని నున్నచోఁ దెమ్ము" అని చెప్పెను. అపుడు జీవకుఁడు పోయి చూచి యెందును మందునకుఁ బనికిరాని మూలికను దెలియఁ జాలక తిరిగి వచ్చి గురువుతో ఆ సంగతి చెప్పెను. అపుడు గురువు సంతోషించి "ఇంకఁజాలును ఇది నీ జీవికకు సరిపోవును నీవు వెళ్ళవచ్చును" అని సెలవిచ్చి దారి బత్తెముగాఁ గూడఁ గొంత ధనమిచ్చి పంపెను.

జీవకుఁడు అయోధ్యకు వచ్చునప్పటికి ఆ ధన మంతయు అయిపోయెను. పిదపఁ దన ఖర్చుకై వెదకుచు ఆ గ్రామములో



ఒక వైశ్యుని భార్యకు శిరోరోగమును తగ్గించి పారితోషికముగా ఆ వైశ్యుఁడు బంధువులు అందఱు నిచ్చిన పదునాఱువేల రూప్యములను దాసదాసీ జనులను గ్రహించి మరల అభయరాజ కుమారుని దగ్గఱకుఁబోయి యా ధనముతో నొక గృహము నిర్మించుకొని నివసించుండెను.

పిదప ఆ జీవకుఁడు బింబిసారునికి భగందర రోగమును మాన్పెను. రాజగృహమందలి శ్రేష్ఠికి ఏడు సంవత్సరముల నుండి తగ్గకయున్న శిరోరోగమును మాన్పెను. ఒక శ్రేష్ఠికి తలఁజీల్చి అందున్న రెండు పురుగులను పైకితీసి అతని రోగమును మాన్పెను. ప్రద్యోతుఁడను రాజునకు పాండురోగము గలదు. అతనికి మందీయఁదలచి "నేతితో మందు పుచ్చుకొనవలయు"నని చెప్పఁగా రాజు "నేయి తక్క నింక దేనితోనైన మందు పుచ్చుకొందు" ననెను. అపుడు రాజుకు తెలియకుండ నేతికి రంగువేసి మందులు గలిపియిచ్చి వెంటనే పట్టణము వదలిపోయెను. ఆ రాజు నేయి యిచ్చినందులకు జీవకునిఁ జంపఁదలఁచి సేవకులను బంపి జీవకుని గట్టితెండని యాజ్ఞ యిచ్చెను. వారును ఆ జీవకుని బట్టి తేలేకపోయిరి. పిదప ఆ ప్రద్యోతుఁడు తన రోగము తగ్గిపోఁగా తానుజేసిన తప్పునకు విచారించి మరల జీవకుని రప్పించి అమూల్యములైన ధనదుకూలాదు లిచ్చి జీవకుని బహూకరించెను.

కొంత కాలమునకు బుద్ధభగవానుని ఆరోగ్యము చెడెను. అపుడు జీవకునికిఁ దెలిసి వెళ్ళి అతి భక్తితో మందులిచ్చి భగవానునికి ఆరోగ్యము చేకూర్చెను.

భగవానునికి ఆరోగ్యము చేకూఱువఱకు బుద్ధభగవానుని దన యింటనే భిక్ష యొసంగుచు నిలిపెను.

ఒక దినము జీవకుఁడు భగవానుని జూచి యిట్లనెను.

“ఓ భగవానుఁడా! నాకొక వరమీయవలయును”

“జీవకా! తథాగతుఁడు వరమును దాటినవాఁడు”

“యుక్తమైనచో దోషము లేనిచో నయిననే వరమీయుఁడు”

“సరే చెప్పుము.”

“భగవానుఁడు భిక్షువులతో పాటు తమరును నాకు అనేకులు ధనికులు కానుకలుగా నిచ్చిన శాలువలు గ్రహింతురు గాక”

“సరే యట్లే.” అని భగవానుఁ డాశాలువలు గ్రహించి ధర్మోపదేశముచేసి యటనుండి వెడలిపోయెను.

* * *

## ధనియ కుంభకార పుత్త్రుఁడు

చాలమంది భిక్షువులు ఋషిగిరి దగ్గర గడ్డి ఆకులతోఁ జిన్ని గుడిసెలు నిర్మించుకొని వర్షాకాలము గడపుచుండిరి. వర్షాకాలము మూఁడు నెలలైనపిదప ఆ గుడిసెలు విప్పివైచి గడ్డి ఆకులు కఱ్ఱలు జనుల కప్పగించి గ్రామములవెంట వెళ్ళుచుండిరి.

ధనియ కుంభకార పుత్త్రుఁ డనువాఁడు మాత్రము గుడిసె విప్పక యుండె వర్షాకాలము శీతకాలము వేసవికాలము గడపుచు ఆ గ్రామములోనే భిక్ష మెత్తుకొనుచు నుండెను.



ఒకమాఱు అతఁడు గ్రామములోనికి భిక్షకు పోవుట చూచి గడ్డికఱ్ఱ తెచ్చుకొను స్త్రీలు ఆ గుడిసె విప్పి గడ్డి కఱ్ఱలు తీసికొని పోయిరి. భిక్షకై పోయివచ్చి గుడిసె విప్పఁబడి యుండుట చూచి కుంభకార పుత్త్రుఁడు మరల గడ్డికఱ్ఱలు తెచ్చికొని గుడిసె కట్టుకొనెను. మరల ఆ స్త్రీలు అతఁడు భిక్షకై పోవుట చూచి విప్పి పట్టుకొనిపోయిరి. అప్పుడిది పని కాదని యా కుంభకార పుత్త్రుఁడు మట్టి ముద్దలతో మంచి కలపతో ఒక్క చక్కని యిల్లు కట్టుకొని దానికి రంగులువేసి యందుండసాగెను.

ఒకసారి బుద్ధభగవానుఁడు ఆ చోటికి వచ్చి ఆ యింటిని జూచి సంగతి తెలిసికొని ఇల్లు కట్టుకొని యుండుట భిక్షకులకుఁ దగదని అట్టి అయోగ్యుఁడైన భిక్షువు గృహమును బద్దలు కొట్టించివైచెను.

బుద్ధభగవానుఁడు తన గృహమును బగులఁ గొట్టించెనని తెలిసియు ఆ కుంభకారపుత్త్రుఁడు కఱ్ఱతోనే యిల్లు గట్టఁదలఁచి రాజుగారి కలప యడవికిఁ బోయి కలప యిమ్మని కోరెను. అచ్చటి గణకుఁడు కలప లేదనెను. రాజుగారు నగరోపయోగముకై జాగ్రత్తపఱచిన కలపనిమ్మనెను. రాజుగారి యాజ్ఞలేనిదే యీయనని యాతఁడనెను. అపుడు “రాజుగారే నాకిచ్చివైచిరి” అని కుంభకార పుత్త్రుఁడు చెప్పెను. ఈతఁడు అనృత మాడఁడని యతఁడు కలప నిచ్చివైచెను. రాజుగారు పట్టణపు మరమ్మత్తుకై కలపకోసము కబురంప అది కుంభకారపుత్త్రుని కీయఁబడినది. రాజుగారు వాని కిచ్చిరఁట అని గణకుఁడు చెప్పెను. అంత రాజువచ్చి కుంభకారునితో “నేనిది నీకెప్పుడిచ్చితిని” అని అడుగ “శ్రమణులకు తృణకాష్ఠోదకములను

ఇచ్చివైచితిని. దాసిని వారు అనుభవింపవచ్చును" అని మీ పట్టాభిషేక సమయమునఁ జెప్పితిరి గదా" అని కుంభకార పుత్త్రుఁడు అనెను.

రాజు అది విని యిట్టిపని యింకెన్నఁడు చేయవలదని యాజ్ఞాపించి వానిని విడిచెను. అప్పుడు బుద్ధభగవానుఁడు ఇవ్వకుండ దేనినైనఁ బుచ్చుకొన్నచో వాఁడు శ్రమణుఁడు కాఁడు. వాఁడు పాపాత్ముఁడగును. అని చెప్పెను.

* * *

## సుదిన్నుఁడు

ఒకప్పుడు వజ్జిదేవమునఁ గఱవు వచ్చెను. అపుడు సుదిన్నుఁడు బహు ధనధాన్యములతో తులదూఁగుచున్న తన బంధువులు గల వైశాలి పట్టణమునకుఁ దన పాత్రవస్త్రములు గైకొని భిక్షువులతో పాటు పోయి యట నొక మహావనములో నుండెను. అప్పుడు సుదిన్నుని జాతీయులు అఱువది స్థాలులతో వండి తెచ్చి పెట్టిరి. అది యంతయు భిక్షువులకుఁ బెట్టి తాను పాత్ర బట్ట గైకొని తన తండ్రి యింటివైపు పోయెను.

అప్పుడు సుదిన్నుని యింటి దాసి పాసిపోయిన గుగ్గిళ్ళను బాఱఁబోయఁ జూచుచుండెను. అది చూచి "సోదరీ! అవి పాఱఁబోయునట్టివే యైనచో ఈ నా పాత్రలోఁ బోయుము" అనెను. ఆ దాసి యతని పాత్రలోఁ బోయుచు సుదిన్నుని కళ్ళు చేతులు కంఠస్వరము గుర్తుపట్టి త్వరగా లోనికి బోయి సుదిన్నుని తల్లితో ఈ సంగతి చెప్పెను.



సుదిన్నుఁడు ఒక గోడమూల కూర్చుండి యా పాసిపోయిన గుగ్గిళ్ళను దినుచుండెను. ఇంతలో సుదిన్నుని తండ్రి యా దారిని వచ్చుచు సుదిన్నుఁడు గుగ్గిళ్ళను దినుచుండుట చూచి దగ్గఱకుఁబోయి "నాయనా! ఈ గుగ్గిళ్ళు తినుచుంటివేమి, మన యింటికి వెళ్ళలేక పోయితివా?" అనియెను.

"ఓ గృహపతీ! మీ యింటికి వెళ్ళితిని ఈ పాసిపోయిన గుగ్గిళ్ళు దొఱకెను." అని సుదిన్నుఁడనెను.

"నాయనా! ఇంటికి పోదమురా!" అని చేయి పట్టుకొని యతని తండ్రి యింటికిఁ దీసికొనివెళ్ళి "నాయనా! భోజనము చేయుము" అనెను. "మంచిది గృహపతీ" ఈనాఁటి భోజనము అయినది. అనెను.

"అయితే రేపు భోజనమునకు వచ్చుటకు అంగీకరింపవలయును" అని తండ్రి చెప్పఁగా సుదిన్నుఁడు మౌనముతో నంగీకరించి వెడలిపోయెను.

మఱునాఁడు సుదిన్నుని తల్లి యింటిని అలంకరింపఁజేసి యొకవైపు మనుషుని ఎత్తు బంగారు కాసులరాశి, యొకవైపు బంగారు ప్రోగు వైచి వానిపై జాప కప్పి మధ్యగా ఆసనము వైచి సుదిన్నుని భార్యను బాగుగా అలంకరింపఁజేసెను.

సుదిన్నుఁడు వచ్చి ఆసనముపైని గూర్చుండెను. వాని తల్లిదండ్రులు ఆ ధనరాసులు చూపి "నాయనా! ఇది యంతయు నీదే. ఈమె నీ భార్య, సుఖముగా నింట నుండు" మనెను. సుదిన్నుఁ డంగీకరింపలేదు. "పోనీ నీ భార్యయందు మాకు సంతానము ప్రసాదింపుము లేనిచో ఈ ధనము ఇతరులు

గైకొందురు" అన అతఁడు "సరే యనెను." కొంతకాలమునకు బీజకుఁడను కుమారుఁడు కలిగెను. బుద్ధభగవానుని కిది తెలిసి ఇట్లు చేసినచో పాపము కలుగునవెను. తల్లి కుమారులు పెద్దవారైన పిదప దీక్ష గైకొనిరి.

* * * *

(బుద్ధుని 55–75 ఏండ్ల వయస్సులో)

## వి శా ఖ

మృగారశ్రేష్ఠి శ్రావస్తి పట్టణములోని వైశ్యుఁడు. అతఁడు తన కుమారుఁడు పూర్ణవర్ధనునికిఁ దగిన కన్యను వెదకఁగొందఱు మనుష్యులను బంపెను. వారును బోయి సాకేత నగరములోని ధనంజయశ్రేష్ఠి కూతుఁరు సుందరియై సుశీలయై యుండుట చూచి యామె తల్లిదండ్రులతో చెప్పి పెండ్లి నిశ్చయించిరి.

పూర్ణవర్ధనునికి ధనంజయుని కుమార్తె విశాఖకుఁ బెండ్లి యయ్యెను. విశాఖను అత్తయింటికిఁ బంపుచు మృగారశ్రేష్ఠి వినుచుండఁగాఁ దండ్రి యిట్లు ఉపదేశించెను.

"అమ్మాయీ! మీ మామగారియింట వసించుచున్నపుడు (1) లోపలి యగ్నిని వెలుపలికిఁ దీసికొనవెళ్ళరాదు. (2) వెలుపలి యగ్నిని లోనికిఁ దీసికొని రాఁగూడదు. (3) ఇచ్చిన వానికి ఇయ్యవలెను. (4) ఈయని వానికి ఈయరాదు. (5) ఇచ్చినవానికి ఈయనివానికిని గూడ ఈయవలెను. (6) సుఖముగాఁ గూర్చుండవలెను. (7) సుఖముగా భుజింపవలెను.



(8) సుఖముగాఁ బరుండవలయును. (9) అగ్ని పరిచర్య చేయవలెను. (10) లోపలి దేవతలకు నమస్కరింపవలయును. ఈ పది విధములుగ నుండవలయును" అని యుపదేశించి మా అమ్మాయి యేదేని తప్పుచేసినచో పెద్దలను బంచాయితీ చేసి విచారింపుఁడు" అని మృగారశ్రేష్ఠికిఁ జెప్పి లెక్కలేని ధన కనక రత్న వాహనాదులతో విశాఖను మృగారశ్రేష్ఠి యింటికిఁ బంపెను.

విశాఖ రథముపై గూర్చుండి మహావైభవముతో శ్రావస్తి ప్రవేశించెను. ఆమె యందమును ఆ యెనలేని ధన కనక వాహనాదులను జూచి పౌరులు మెచ్చుకొనిరి.

పిదప విశాఖ యింటికి వచ్చిన యేడవనాఁడు వివాహోత్సవపు వేడుకలయిన పిదప జైనదిగంబర శ్రమణులను బిలిచి కూర్చుండఁబెట్టి తన కోడలిని బిలిచి "అమ్మాయీ! యీ యర్హతులకు నమస్కరింపుము" అని చెప్పెను. ఆమెయు బుద్ధభగవానుని యుపాసకురాలు గాన అర్హత పదమును విని సంతోషముతో ఆ దిగంబరులకు నమస్కారము చేయ వచ్చి వారిని జూచి వీరేనా అర్హతులు. ఈ సిగ్గు భీతి లేనివారి దగ్గఱకేల నా మామగారు పిలిచిరి, అని తలఁచి "ఛీ, ఛీ" అని పలుకుచు వెంటనే యింటిలోనికిఁ బోయెను.

అది చూచియు సంన్యాసులు "గృహపతీ? నీ కీ పిల్లయే దొరకెనా? ఇంకెవరు లేకపోయిరా? శ్రమణ గౌతముని సేవకురాలిని ఈ యింటిలో నేలప్రవేశపెట్టితివి. దాని నీయింటినుండి వెడలఁగొట్టుము" అనిరి.

"ఈమె ధనికులపిల్ల గొప్పకులమునఁ బుట్టినది దాని నెట్లు పంపివేయుదును" అని తలఁచి "ఓ యాచార్యులారా! యీమె చిన్నపిల్ల తెలివితక్కువది. తప్పు మన్నింపుఁడు" అని వారిని బంపివైచి యింటిలోనికి వెళ్ళి బంగారు పళ్ళెములో వడ్డించిన పాయసమును భుజించుచుండెను. ఇంతలో భిక్షకై యొక భిక్షువు ఆ యింటికి వచ్చెను. "మామగారికి దన నోటితోఁ జెప్పుట యుచితముగా"దని కొంచెము తొలఁగి మామగారికి కనిపించునట్లు నిలుచుండెను. కాని యా శ్రేష్ఠిమాత్రము భిక్షువును జూచియుఁ జూడనట్లు తలవంచుకొనియే పాయసమును భుజించుచుండెను. మామగారు ఈ భిక్షువును జూచికూడ ఏ సంజ్ఞయుఁ జేయుటలేదని తలఁచి భిక్షుని దగ్గఱకుఁ బోయి "భగవానుఁడా! ముందుకుఁ బోవుఁడు మా మామగారు చల్ది భుజించు చున్నారు" అనెను.

అసలె జైనసాధువుల మాటలు వినినప్పటి నుండియు విశాఖపై అనిష్టముగా నున్న మృగారశ్రేష్ఠి "చల్ది భుజించు చున్నారు" అను మాట వినఁగనే తినుటమాని చేయి కడుగుకొని "ఈ పాయసము ఇక్కడ నుండి తీసికొని పొండు. ఈమెను గూడ ఇంటినుండి గెంటివేయుఁడు. ఈ కళ్యాణ గృహములో అశుచిభక్ష్యములను ఈమె తయారు చేయుచున్నది." అనెను. పరిచారిక లందఱు విశాఖ చెప్పుచేఁతలలోనివారు గాన వారే మియు మాటాడలేదు.

అపుడు విశాఖ "అయ్యా! నేను జేసినదానిలో తప్పున్నచో మా తండ్రిగారు చెప్పినరీతిగాఁ బంచాయితీలోఁబెట్టి విచారించి



గెంటివేయుఁ"డనెను. "మంచిది" అని మృగారశ్రేష్ఠి పంచాయితీ చేయించి వారి కామె యన్న మాటలు చెప్పెను.

"అమ్మాయీ! ఇట్లు అంటివా?" అని వారనిరి.

"నాయనలారా! నే నిట్లనలేదు. భిక్షువు భిక్షకు రాఁగా మామగారు చూచియు పాయసము భుజించుచుండిరి. అపుడు నేనుబోయి "అయ్యా! ముందుకుఁ బోవుఁడు మామగారు ఈ శరీరముతో పుణ్యము చేసికొనరు. ప్రాఁత పుణ్యమునే యిప్పుడు భుజించుచున్నారు" అని యంటిని. అని యామె యనెను.

"దీనిలో తప్పేమియు లేదే" అని వారనిరి.

అంతట మృగారశ్రేష్ఠి యిట్లనెను. "ఈమెను ఈమె తండ్రి మా యింటికిఁ బంపుచు లోపలి యగ్నిని వెలుపలికిఁ దీసికొనివెళ్ళరాదు. వెలువలి యగ్నిని లోనికిఁ దీసికొని వెళ్ళ రాదు. ఈ మొదలుగ అనుచితమైన ధర్మముల నుపదేశించెను. గృహస్థులమైన మనము లోపలి యగ్నిని వెలుపలకు వెలుపలి యగ్నిని లోనికిఁ దీసికొని రాకుండ నెట్లు? ఇట్లే యన్నియు అనుచితములైనవే చెప్పెను" అని యనెను.

"అమ్మాయీ! ఇది నిజమేనా" అని వారనిరి.

"అయ్యలారా! అవును నిజమే. కాని అగ్ని యనఁగా మామూలు నిప్పుగాదు. ఇది కేవలము నిప్పును గూర్చి చెప్పిన మాటగాదు. లోని రహస్యము వెలుపలికి, వెలుపల నౌకరులు చాకరులు చెప్పుకొను తప్పు మాటలు లోనికిఁ దీసికొనివచ్చి కలహములు గలిగింపరాదని దీని భావము. ఇచ్చెదనని బదులు

పట్టుకొని వెళ్ళి తిరిగి యిచ్చినవానికే బదులీయవలె నను నుద్దేశముతో నిచ్చినవారి కీయవలెను అని చెప్పెను. ఇట్లే బదులు పుచ్చుకొని యీయనివారి కీయరాదని యుద్దేశముతో ఈయనివారి కీయవలదని చెప్పెను. బీదవారికి ధనికులైన మిత్రులకుఁ గూడ వారిచ్చినను ఈయకున్నను ఇవ్వవలయు నను నుద్దేశముతో నిచ్చినవారికి ఈయనివారికిఁగూడ నిమ్ము అని చెప్పెను. అత్తమామలను జూచి లేవవలసినప్పుడు కూర్చుండక మిగిలిన సమయములోఁ గూర్చుండవలె నను నుద్దేశముతో సుఖముగాఁ గూర్చుండవలెను అని చెప్పెను. అత్తమామలు పెనిమిటి భోజనము చేసిన పిదప వారికి వడ్డించిన పిదప అందఱకుఁ గావలసినవి యిచ్చి పిదప తాను స్వయముగా భుజింపవలె నను నుద్దేశముతో సుఖముగా భుజింపవలెను అని చెప్పెను. ఇట్లే అందఱకు సేవలు చేసిన పిదప పరుండవలె నను నుద్దేశముతో సుఖముగాఁ బరుండమని చెప్పెను. అమ్మాయీ! అత్తమామలను అగ్ని పుంజమువలె గౌరవింపవలె నను నుద్దేశముతో అగ్ని పరిచర్య చేయుము అని చెప్పెను. పరంపరగా గృహస్థుల యిండ్లకు వచ్చు భిక్షువులకు మన యింటిలోని భోజ్య పదార్థములను పెట్టి మఱి మన యింటి దేవతలకుఁ బెట్టవలయు నను నుద్దేశముతో లోపలి దేవతలకు నమస్కరింపవలెను అని చెప్పెను. ఇందు తప్పులున్నచో నన్ను శిక్షింపుఁడు" అని విశాఖ చెప్పి "మీరు ఇంటినుండి పొమ్మన్నపుడు నేను పోవుట తగదు. ఇంక ఇట్టి యింటిలో ఉండుట నాకిష్టము లేదు గాన పోయెదను" అని చెప్పి తన పరిచారికలతో ప్రయాణమునకు సిద్ధము కండెను.

"అమ్మాయీ! నేను తెలియక అంటిని క్షమించుము" అని యా శ్రేష్ఠి యనెను. అపు డావిశాఖ శ్రేష్ఠితో "నాయనా! క్షమించుచున్నాను. కాని బుద్ధ ధర్మమందు అనురాగము గల యింటిలోఁ బుట్టితిని. మేము భిక్షులకు సేవ చేయకుండ నుండఁజాలము. ఇక్కడ నేను భిక్షు సంఘసేవ చేయుటకు వీలగుచో ఉందును" అనెను.

"అమ్మాయీ! నీ యిష్టము వచ్చినట్లు ఉండు" మని శ్రేష్ఠి యనెను.

పిదప విశాఖ బుద్ధభగవానుని భిక్షు సంఘమును భోజనమునకుఁ బిలిచెను. భగవానుఁడు భిక్షువులును వచ్చి భుజించిరి. భోజనమైన పిదప భగవానుఁడు ధర్మోపదేశము చేయఁగా విని మృగారశ్రేష్ఠియు జ్ఞానము పొంది విశాఖతో "అమ్మాయీ! నాకు జ్ఞానము గలిగించితివి. నేఁటినుండి నాకుఁ దల్లివి" అనెను.

నాఁటినుండి విశాఖ మృగారమాత యనియుఁ బిలువఁబడెను. నాఁటినుండి మృగారమాత విశాఖ భగవానునికి భిక్షువులకుఁ గావలసిన వస్త్రములు భోజన సదుపాయములు గలిగించుచు నుండెను.

ఒకనాఁడు విశాఖ తడిసిన వస్త్రములతో తడిసిన జుట్టుతో భగవానుని దగ్గఱకు వచ్చి యొక ప్రక్కఁగాఁ గూర్చుండెను. అప్పుడు భగవానుఁ డిట్లడిగెను.

"విశాఖా! ఏమి యిట్లు తడిసిన యొడలితో మధ్యాహ్నము వచ్చితివేమి."

"భగవానుఁడా! నా ప్రియమైన మనుమఁడు చనిపోయెను."

"విశాఖా! శ్రావస్తిలో ఎంతమంది మనుష్యులున్నారో అంతమంది మనుమలను నీవు కోరుదువా?"

"భగవానుఁడా! అందుఁ దప్పేమున్నది. అంతమంది మనుమలను గోరుదును"

"విశాఖా! శ్రావస్తిలో ప్రతిదినము ఎంతమంది చనిపోవుచుందురు."

"భగవానుఁడా! పదిమందో లేక అయిదాఱుగురో చనిపోవుచునే యుందురు."

"అయితే నీవు ప్రతిదినము తడిసిన జుట్టుతో వస్త్రముతో నుండఁగలవా?"

"ఉండలేను. భగవానుఁడా! నాకు పుత్త్రులు మనుమలు ఎంతమంది యున్నారో యన్ని రోజులు మాత్రమే."

కనుకనే విశాఖా! ఎవనికి వందప్రియము లుండునో వానికి వందదుఃఖము లుండును. ఎవనికి తొంబది యుండునో వానికిఁ దొంబది దుఃఖములుండును. ఎవనికి ఎన్ని ప్రియము లుండునో యన్ని దుఃఖములుండును. ఎనుబదియున్న ఎనుబది, డెబ్భైయున్న డెబ్భయి, నాలుగు ఉన్న నాలుగు ఒక ప్రియవస్తువున్నచో ఒక దుఃఖము. వానికి అసలే ప్రియవస్తువు లేనిచో అసలే దుఃఖము లేకుండును. వాఁడు దుఃఖమన్నదే లేకుండ నుండును'' అని భగవానుఁడు చెప్పి యీ నీతి వాక్యము పలికెను.



''కానఁ బ్రియంబు గోరకు, ప్రియ నాశమె దుఃఖము
ప్రియ మప్రియమున్ లేని, వానికిన్ లేవు బంధముల్.''

(నా ధమ్మపదము)

* * * *

## యుద్ధ శాంతి - ఆనందుఁడు.

ఒకమాఱు శాక్యులకు, కోలియులకు కపిలవస్తు కోలియ పట్టణముల మధ్యనున్న రోహిణీ నదీజలముల విషయమై తగాదావచ్చి యిరువురు యుద్ధములకు దిగుట తెలిసికొనివచ్చి బుద్ధభగవానుఁడు బోధించి యుద్ధమును మాన్పెను.

ఒకమాఱు బుద్ధభగవానుఁడు గంధకుటిలో ఒక యాసనము పైని గూర్చుండియుండి భిక్షువులతో నిట్లనెను.

"భిక్షువులారా! నేను వృద్ధుఁడ నగుచున్నాను. (ఇప్పటికి భగవానుని వయస్సు 56 ఏండ్లు) భిక్షువులలో నొక్కొక్కఁడు నేను జెప్పినను "ఈ మార్గమునఁ బోవుఁడు" అని నేను పలికినను వినక మఱియొక మార్గమునఁ బోవుచున్నాఁడు. ఒక్కొక్కఁడు నాపాత్రయు బట్టలు పుచ్చుకొనుమన్నను పుచ్చుకొనక భూమిపైనే పెట్టిపోవును. కాన నాకిప్పుడు నాతో నిత్యముఉండి పరిచర్యసేయు భిక్షువు కావలెను."

"భగవానుఁడా! నేను సిద్ధముగా నుంటిని. నేను తమ పరిచర్య చేయుదును" అని సారిపుత్త్రుఁ డనెను.

"సారిపుత్రా! నీవు విహరించు ప్రదేశమున నేను లేనిలోటుండదు. నీ ధర్మోపదేశములు బుద్ధుని యుపదేశముల వంటివే. కన నీవు నా పరిచారకుఁడవు కావలదు."

ఈ విధముగా మహామౌద్గల్యాయనుఁడు మొదలగువారు పరిచర్య చేయరాఁగా భగవానుఁడు వలదనెను. ఒకచోట మౌనముగా ఆనందుఁడు కూర్చుండి యుండెను. ఆనందుని భగవానుని పరిచారకుఁడుగా నుండ నందఱును ప్రోత్సహింపసాగిరి. భగవానుఁ డదిచూచి వారిని వారించి "భిక్షువులారా! అతని నెవ్వరును బలవంత పెట్టకుఁడు. అతఁడే తెలిసికొని స్వయముగా రాఁగలఁడు" అనెను.

అపుడు ఆనందుఁడులేచి "ఓ భగవానుఁడా! నాకు నాలుగు నిషేధములు నాలుగు విధులు మొత్తము ఎనిమిది వరములిచ్చినచోఁ దమ పరిచారకుఁడుగ నుందును" అనెను.

"అవి యేవి" యని భగవానుఁడనెను.

"మీకు దొరకిన యుత్తమ వస్త్రములను 2 ఉత్తమ భోజనమును 3 మీతో ఒకే గంధకుటిలో నివాస ను నాకీయరాదు. 4 ఎవరైన మిమ్ముఁ బిలిచినపుడు నన్నుఁ దీసికొని పోరాదు."

"ఈ నాలుగింటిలోఁ దప్పేమున్నది" అని భగవానుఁడనెను.

"మీకు దొరకిన యుత్తమ వస్త్రాదులను నాకిచ్చుచున్నచో వానికై మీ పరిచారకుఁడనైతి." నని జను లనుకొందురు.



"సరే మిగిలిన వేవి" అని భగవానుఁడనియె.

"1 నేను స్వీకరించిన చోటికే దమ రంగీకరింపవలెను. 2 ఇతర ప్రదేశములనుండి భగవానుని దర్శింపవచ్చిన వారికి వెంటనే మిమ్ము దర్శింపఁ గలిగియుండవలెను. 3 నేను కోరినప్పుడు తమ దగ్గఱకు రాఁగలిగి యుండవలయును. 4 నేను లేని సమయములందుఁ దమరు చేసిన ధర్మోపదేశములు తిరిగి వచ్చి నాకు వచ్చి తెలుపవలయును. ఇట్లగుచో నేను దమ సేవకుఁడనై యుందును" అని యానందుఁడనెను.

''సరే'' అని భగవానుఁడనెను. నాఁటినుండి యానందుఁడు పరిచారకుఁడయ్యెను.

* * * *

## చిం చా మా ణ వి క

బుద్ధభగవానుని కీర్తి నలుదిశల వ్యాపించెను. తైర్థికుల కీర్తి సన్నగిల్లెను. ఇది చూచి యప్పటి మతాచార్యులగు తైర్థికు లొకచోటఁ జేరి బుద్ధభగవానుని పేరు ఎట్లు చెడఁగొట్టవలయునా యని యాలోచించిరి.

ఆ సమయమున చించామాణవిక యను నొక రూపవతి యగు సంన్యాసిని శ్రావస్తిలో నివసించుచుండెను. ఆమెను బిలిచి సంగతి యంతయుఁజెప్పి శ్రమణ గౌతముని ముందఱఁ దమ పేరు ప్రతిష్ఠలు పోవుచున్నవనియు, అందఱి పేరు ప్రతిష్ఠలు నిలఁబెట్టవలసినదనియు నారు ప్రార్థించిరి. ''సరే'' యని యామె యంగీకరించెను.

శ్రావస్తిలోని జనులు జేతవనమందు బుద్ధభగవానుని యుపదేశములు వినుటకుఁ బ్రతిదినము వచ్చుచుఁ బోవుచుండిరి. ధర్మోపదేశము విని జేతవనమునుండి శ్రావస్తికి జనులందఱు పోవువేళ సరిగా ఆ చించామాణవిక కాషాయబట్టలు కట్టుకొని గంధమాలలు చేతఁబట్టుకొని జేతవనమువైపు పోవఁదొడఁగినది. "ఇప్పు డెక్కడికిఁ బోవుచున్నావు" అని యామె నెవరైన నడిగినచో 'నా జోలి మీకెందుకు' అనుచుండెడిది. ఉదయము బుద్ధభగవానుని దర్శింప జేతవనమునకుఁ బోవువారికి ఎదురై జేతపనములో రాత్రి నివసించి వచ్చుచున్నట్లు కనిపించి శ్రావస్తికిఁ బోవుచుండెడిది. ఎవరైన నడిగినచో "మావంటి సంన్యాసినుల జోలి మీకెందుకు" అనుచుండెడిది. నెలలు జరగినవి. "నేను శ్రమణ గౌతమునితో గంధకుటిలో రాత్రి గడపుచుంటిని" అని రహస్యమను పేరుతో కొందఱకుఁ జెప్పెడిది.

ఈ విథముగా నాలుగైదు నెలలు గడచెను. గుడ్డలు కడుపునకుఁ గట్టుకొని గర్భవతివలె నటింపసాగినది. జనులలో సంశయ మంకురింపసాగెను.

ఒకనాఁడు బుద్ధభగవానుఁడు ధర్మోపదేశము చేయుచుండఁగా చించామాణవిక ఆ పరిషత్తులో నలువైపులఁ దిరుగుచు "ఓ భగవానుఁడా! ఈ యుపదేశముల కేమి గాని నా ప్రసవ సమయమునకుఁ దగిన యేర్పాటు చేయ"మని బిగ్గరగా అఱచెను. జనులలోఁ గోలాహలము బయలుదేఱెను.

ఇంతలోఁ బెనుగాలి వీచినది. ఆ కంగారులో ఆమె కట్టుకొన్న బట్టలు జాఱిపడెను. అది చూచి జనులు ఆమెను నిం



దించి తరిమివైవ సాగిరి. అపుడు భగవానుఁడు వారించి 'యామె పొరపాటును క్షమింపుఁ' డని చెప్పెను.

* * *

## రోగి శుశ్రూష

ఒక సమయమున ఒక భిక్షువునకుఁ గడుపునొప్పి వచ్చినది. అపుడతఁడు తన మరుగుదొడ్డిలోఁ బడియుండెను. అపుడు బుద్ధభగవానుఁడు ఆనందునితోపాటు తిరుగుచు ఆ భిక్షుకుని గదికి వచ్చి చూచెను. అది చూచి భగవానుఁ డిట్లడిగెను. "ఇట్లుంటి వేమి" "భగవానుఁడా నాకుఁ గడుపునొప్పి రోగము గలిగినది'' ''అయితే నీ కెవరు పరిచారకులు లేరా?'' ''లేరు'' ఎందుకు ఈ భిక్షువులు నీకు సేవ చేయుటలేదు. ''ఇంతవఱకు నేనే భిక్షువునకు సేవ చేసినవాఁడనుగాను'' అనెను.

అపుడు భగవానుఁడు ''ఆనందా! నీరు తెమ్ము'' అనెను. అపుడు భగవానుఁడు నీరు పోయఁగా ఆనందుఁడు కడిగెను. పిదప వారిద్దఱు ఆ భిక్షువును మంచముపై బరుండఁబెట్టి యుపచారములు చేసిరి.

ఆనాఁడు భగవానుఁడు భిక్షువులందఱను బిలిచి యిట్లు బోధించెను. ''భిక్షువులారా! మీకు సేవచేయుట కిక్కడ తల్లిగాని, తండ్రిగాని లేరు గదా. మీలో మీరు ఒకరి కొకరు సేవ చేయకున్నచో నింకెవరు చేయఁగలరు. ఎవఁడు రోగి సేవ చేయునో వాఁడు నాకు సేవ చేసినవాఁ డగును. ఎవరికి ఉపాధ్యాయుఁడుగాని, శిష్యుఁడుగాని, మరొకరుగాని యున్నచో

వారి కతఁడు సేవ చేయవలయును. ఎవరును లేనిచో సంఘ సేవ చేయవలయును. అట్లు చేయనిచో దుష్కృత్యము కలుగును'' అని బోధించెను.

* * *

## పూర్వారామ నిర్మాణము

ఒకమాఱు జనులు ధర్మోపదేశము వినుటకు భగవానుని దగ్గఱకుఁ బోవుచుండిరి. అపుడు విశాఖ కూడ అలంకరించుకొని జనులతోపాటు పోయి యక్కడ తన యలంకారములు విప్పి దాసి కిచ్చి భగవానుని దర్శించి యింటికిఁ బోవునపుడు తీసికొందును ఉంచుము'' అనెను.

ధర్మోపదేశ మయిన పిదప అందఱు ఇంటికి బయలుదేరిరి. విశాఖ భగవానునికి నమస్కరించి యింటికి బయలుదేఱి యలంకారము లిమ్మని దాసితో పలికెను. దాసి యాభూషణములను విహారములో మఱచిపోయెను.

ధర్మోపదేశము విని పోవువారు ఏదైన మఱచిపోయినచో వానిని ఆనందుఁడు దాచుచుండువాఁడు. అట్లే ఆనందుఁడు వానిని భగవానునికిఁ జెప్పి దాచెను.

దాసి భూషణములకై విహారములోనికి వచ్చి వెదకుచుండెను. ఆనందుఁడు వానిని ముట్టుకొని దాచినచో అవి వానివే యగును గాన అవి తేవలదనియు విశాఖ చెప్పెను. ఆనందుఁడది చూచి భూషణము లిచ్చెను.

ఆనందుఁడు ముట్టుకొని దాచుటవలన వానిని గ్రహింప నొల్లక యవి యక్కడ నుంచుట మంచిది గాదని వానిని



తెప్పించి విశాఖ వానికి మూల్యము తొమ్మిది కోట్ల రూపాయలగునని అవి చేయించుటకు నూరు నేలు అగుననియు తెలిసికొని యా ధనమంతయు బండ్లమీఁద వేయించి భగవానుని దగ్గఱకు వచ్చి భగవానునితోఁ జెప్పి యీ ధనముతో భిక్షువులు పరిగ్రహింప యోగ్యమగు వస్తువులు తెప్పింపుఁడు అనెను. అపుడు భగవానుఁడు భిక్షువులకు నివాసస్థానములతో ఆరామము కట్టింపుమనెను. "సరే'' అని యీమె పూర్వారామమును నిర్మింపఁ జేసెను.

* * *

## కాలామ క్షత్రియులు

ఒకమాఱు బుద్ధభగవానుఁడు కోసలదేశమునఁ దిరుగుచు భిక్షువులతోఁగూడఁ గేశపుత్రియ మనుగ్రామమునకు వచ్చి యట బస చేసెను.

అదివిని కాలామ క్షత్రియులు భగవానుని దర్శింపవచ్చి నమస్కరించి యొక ప్రక్కగాఁ గూర్చుండి యిట్లనిరి.

“భగవానుఁడా! అనేకులు శ్రమణ బ్రాహ్మణులు వచ్చుచుఁ బోవుచుందురు. ఎవరికివారు తమతమ మతములనే ప్రచారము చేయుచుఁ దమ మతములనే ప్రశంసించుచు నితర మతములను నిరసించుచుందురు. ఈ శ్రవణులలో ఎవరు నిజము చెప్పుచున్నారో, యెవరు అపత్యము చెప్పుచున్నారో యని సంశయము కలుగుచుండును. ఇదియెట్లు తెలియఁగలము.”

"ఓ కాలాములారా! మీసంశయము వాస్తవమైనదే. తగిన చోటనే మీకు సంశయము గలిగినది. మత పరంపరచేఁగాని, పుస్తకములను బట్టిగాని, తర్కమునుబట్టిగాని, వీరు నాగురువులు చెప్పిరి అను దానినిబట్టిగాని, యేధర్మమును నమ్మక స్వీయముగా విచారించి తెలిసికొని "ఈ ధర్మములో దోషములున్నవి. ఈ ధర్మము ప్రాజ్ఞసమ్మతముగాదు. ఇది హితకరముగాదు" అని తెలిసికొన్నపుడు దానిని విడిచిపెట్టవలెను. మనుష్యుల మనస్సులోఁ బుట్టిన లోభము హితకరమా? అహితకరమా?"

"భగవానుఁడా ! లోభము అహితకరమేగదా"

"మనుష్యులు లోభములోఁబడి ప్రాణులను జంపుదురు. దొంగతనము చేయుదురు. పరస్త్రీ గమనము చేయుదురు. అనృత మాడుదురు. ఇతరులను అట్లు చేయఁ బ్రోత్సాహ పఱతురు. ఇది చాలాకాలము వఱకు దుఃఖమే నా?"

"అవును దుఃఖకరమే"

"అయితే మనుష్యులలో బయలుదేఱు ద్వేషము మోహము హితము కొఱకా? అహితము కొఱకా?"

"అహితము కొఱకే"

"ఇట్టి ద్వేషాదులతోఁ గూడిన ధర్మములు ఎట్టివి?'

"ద్వేషాదులతోఁ గూడినవి అహితములు, దోషయుక్తములు."

"అయితే మనుష్యులలోఁ బుట్టిన యలోభము, అవైరము శాంతి, సత్యము హితకరములా? అహితకరములా?"

"హితకరములే భగవానుఁడా?"



"ఇట్టి ధర్మములన్నియు దోషశూన్యములేగదా. ప్రాజ్ఞ సమ్మతములేగదా"

"అవును భగవానుఁడా?"

ఓ కాలాములారా! ఇందువలననే ఆర్యశ్రావకులు లోభమును ద్వేశమును, మోహమును వీడి స్మృతితో మైత్రితోఁ గరుణతో సంతోషముతో ఉపేక్షతో సకలదిక్కులను పవిత్రముచేయుచు అందఱకోసము. అన్ని లోకములకోసము, నిర్వైరులయి శాంతితో విహరింతురు. ఈ విధముగా నిర్వైరుఁడయి నిర్మల హృదయముతో సంచరించువానికి నాలుగు విధములుగ హాయి శాంతి కలుగును. (1) పరలోక మనున దున్నచో పాపపుణ్యముల ఫల మున్నచో నిశ్చయముగా నేను శరీరము విడిచిన పిదప స్వర్గలోకమునఁ బుట్టుదును. (2) పరలోకము లేదా పాపపుణ్యముల ఫలము లేదా అదియు లేనిచో ఈజన్మలోనే ఇప్పుడే వైరరములేక సుఖముగా నుందును. (3) పనులు చేయునపుడు ఎవరైన నాకుఁ జెడ్డయుపాయమును జేసి నప్పటికిని నేనెవరికిఁ జెడ్డ చేయఁగోరను. నేను ండ్డ చేయునపుడు నాకు దుఃఖమెట్లు గలుగును. (4) చేయుచున్న పాపమును ఈ క్షణము చేయకున్నచో నేను ఇదివఱకు పాపమునుండి చేయఁబోపు పాపము నుండి ముక్తుఁడనగుదును." అని అతఁడీ విధముగ శాంతి పొంది హాయిగ నుండును. వానికి ఈజన్మమునందే శాంతి లభించును. కనుక ఆర్యశ్రావకుఁడు రాగము. దోషము, ద్వేషము దొంగతనము మొదలగు వానినుండి ముక్తుఁడగుచున్నాడు.

"అవును భగవానుఁడా! ఇది యిట్లే. అవును ఇదియే శాంతిని హాయిని గూర్చు ధర్మము. ఆశ్చర్యము! భగవానుఁడా! అద్భుతము. నేఁటినుండి భగవానుఁడు మమ్ము శరణాగతులయిన యుపాసకులుగా గ్రహింపఁ గోరుచున్నాము" అని వారు అనిరి.

× × × ×

## ఆ ల వ కుఁ డు

ఒకపరి బుద్ధభగవానుఁడు ఆలవిగ్రామము దగ్గఱ గోవులు చరించు శింశుపావనమున ఆకులు పఱచిన పక్క మీఁదఁ గూర్చుండియుండెను.

అపుఁడు ఆలవకుఁడను నొకఁడు భగవానుని దగ్గఱకు వచ్చి నమస్కరించి యొక ప్రక్కగాఁ గూర్చుండి యిట్లనెను.

"భగవానుఁడా! తమరు ఇక్కడ సుఖముగ నిద్రించితిరా?"

"ఆ నిద్రించితిని. సుఖముగ నిద్రించితిని. లోకములో సుఖముగా నిద్రించువారిలో నేనొకఁడను."

"భగవానుఁడా ఇవి మంచుపడు చల్లని శీతకాలపురోజులు. గోవులు నడిచిన యీ చోటు గోతులు గోతులుగ నుండి మఁడ్లవలె గుచ్చుకొనుచున్నది. ఆకులతోఁ బఱచిన పక్క పలుచగానున్నది. చెట్ల యాకులు తక్కువ. కాని గడ్డలో చల్లఁగనుండును. నలుప్రక్కలనుండి వీచుగాలి శరీరమున గఱచుచున్నది. అయినను సుఖముగ నిద్రించితినని తమరు చెప్పుచుంటిరే."



"అయితే నిన్నొక సంగతి యడుగుచుంటిని. నీకు ఎట్లు సరిగా దోఁచిన నట్లు చెప్పుము. ఒక ధనికుఁడైన గృహపతి బాగుగ సున్నము చేసిన సౌధములో గాలి వేయకుండ తలుపు మూసివైచి నాలుగు అంగుళముల దళసరిగా ఉన్నితోఁ దయారుచేసిన మెత్తని శయ్యపై శాలువలు గప్పుకొని రెండు వైపుల దిండ్లు వేసికొని నలుగురు భార్యలు సేవ చేయుచుండఁగా సుఖముగ నిద్రించునని చెప్పుదువా? చెప్పలేవా? ఇది నీకెట్లు తోఁచుచున్నది."

"వాఁడు సుఖముగ నిద్రించును. వాఁడు సుఖనిద్రచెందువారిలో ఒకఁడని చెప్పగలను."

"అయితే నాయనా! అతఁడు రాగద్వేషములతో గూడినవాఁడై కోరికలవలన వానికి శారీరిక మానసిక వ్యథలు గలిగినచో వాఁడు రాగద్వేషాదులవలన మండుచు దుఃఖ మొందకుండ నుండునా."

"ఆవును. వాఁడు దుఃఖమొందకుండ నుండలేఁడు."

"ఆ ధనికుఁడెట్టి రాగద్వేషాదులచే మండి దుఃఖపడుచు నిద్రించునో యట్టి రాగద్వేషాగ్నులు బుద్ధునికి శాంతించినవి. వాని వేళ్ళు నఱికివేయఁబడినవి. అవి యింక ముందు బయలుదేఱలేవు. కనుకనే నేను సుఖముగ నిద్రించితిని. ఏమి ఆ ధనికుఁడు సుఖముగ నిద్రింపఁగలఁడా?"

"లేఁడు. నిద్రింపలేఁడు."

"కనుకనే నేనే సుఖముగ నిద్రించితి నంటిని. రాగద్వేషాదులచే ముక్తుఁడగు బ్రాహ్మణుఁడు కోరికలలోఁ దగుల్కొనక భయము లేక హాయిగా మనశ్శాంతి పొంది సుఖముగ నుండును.

× × ×

## రాష్ట్రపాలుఁడు

ఒకప్పుడు బుద్ధభగవానుఁడు భిక్షు సంఘముతో పాటు కురుదేశమునఁ దిరుగుచు థుల్లకోట్ఠిత మనుగ్రామమును జేరెను.

అక్కడ భగవానుఁడు చేయు నుపదేశము విని యగ్రకులికుని పుత్త్రుఁడగు రాష్ట్రపాలుఁడు ఇంటిలో బ్రహ్మచర్య పాలనము కష్టమని తలఁచి తనకు దీక్ష యిమ్మని భగవానునిఁ గోరెను.

భగవానుఁడు రాష్ట్రపాలునితోఁ దల్లి దండ్రుల యనుమతి పొంది రమ్మనియెను. రాష్ట్రపాలుఁడు తల్లి దండ్రులను అనుమతి యిమ్మని యడుగ వారు సమ్మతింపరైరి. అందుకతఁడు కటికనేలపయిఁ బరుండి మరణమునకో దీక్షకో సమ్మతింపుఁడని తిండిమాని పడియుండెను. కొలఁది దినములైన పిదప వాని స్నేహితుల మాటవలనఁ దమ యేకపుత్త్రుఁడు బ్రతికియున్న నంతె చాలుననియు నెప్పుడైన నొకసారి వచ్చి తమ్ముఁ జూచి పొమ్మని చెప్పి తల్లితండ్రులు సమ్మతించిరి.

రాష్ట్రపాలుఁడు తల్లిదండ్రుల సమ్మతి తెలిపి భగవానుని దగ్గఱ దీక్ష పొందెను.



కొంతకాల మైనపిదప రాష్ట్రపాలుఁడు తమ దల్లిదండ్రుల యింటికి భిక్షకుఁబోయెను.

నాఁడు తండ్రి రాష్ట్రపాలునిఁ జూచి యితఁడు ఎవఁడో భిక్షు వనుకొని యిట్టి భిక్షువులవలననె తన కొడుకు భిక్షువులతోఁ గలిసిపోయెనని నిందించెను. రాష్ట్రపాలుఁడది విని వెనుకకు ఉరిగెను. ఇంతలో వారి దాసి పాసిపోయిన గుగ్గిళ్ళను బాఱఁ బోయ వచ్చెను. అవి పాఱఁబోయక తన పాత్రలోఁ బోయుమని రాష్ట్రపాలుఁడనెను ఆమె అదులోఁ బోయనని తినుచుండెను. రాష్ట్రపాలుని స్వరము గుర్తుపట్టి దాసి ఇంటిలోనికిఁ బోయి వాని తల్లిదండ్రులతోఁ జెప్పెను. వారువచ్చి భోజనమునకు రమ్మని ప్రార్థించిరి. నేఁడు భోజనమైనది రేపు వచ్చెదనని చెప్పివెడలిపోయెను.

మఱునాఁడు రాష్ట్రపాలుఁడు రాగా ఆతల్లిదండ్రులు రాసులగాఁబోసిన ధనమును అప్సరలవంటి భార్యలను జూపి వీరిని పరిగ్రహింపుమని కోరిన దానికతఁ డంగీకరింపలేదు.

అప్పుడు ఆతని భార్యలువచ్చి "ఆర్యపుత్ర! వేరికై నీవిట్టి కఠోరబ్రహ్మచర్యము చేయుచుంటివో యా యప్సరస్త్రీ లెటువంటివారు" అని యడిగిరి.

"సోదరీమణులార! మేము అప్సరస్త్రీలకై బ్రహ్మచర్యము గడపుటలేదు" అని వారితో రాష్ట్రపాలుఁడు పలుకఁగా ఆస్త్రీలు మూర్ఛపడిరి. పిదప అక్కడ వారికి ధర్మోపదేశముచేసి యట భుజించి యటనుండి కౌరవరాజుయొక్క తోటలోనికిఁబోయి యొక చెట్టుక్రిందఁ గూర్చుండెను.

రాష్ట్రపాలుఁడు చెట్టుక్రిందఁ గూర్చుండి యుండుటచూచి తోటమాలి రాజునకు విన్నవింపఁగా నదివఱకే రాష్ట్రపాలుని సంగతి విన్నరాజు అతనిని జూచుటకు స్వయముగాఁ దోటలోనికి వచ్చి రాష్ట్రపాలునికి ఒక విలువైన యాసనము వేయించి కూర్చుండు మనఁగా నతఁడిట్లనెను.

'రాజా ! నీ వాయాసనమునఁ గూర్చుండుము. నే నిట ఈ యాసనముమీఁదనే కూర్చుందును" అనెను. 'సరే' యని రాజు కూర్చుండి రాష్ట్రపాలునితో నిట్లనెను.

"రాష్ట్రపాలా ! లోకములో జనులు ముసలితనమువల్ల రోగమువల్ల, భోగభాగ్యములు లేకపోవుటవలన, ప్రియబంధువులు పోవుటవలన తమకోరికలు తీరక ఈ విధముగా జుట్టు తీయించుకొని కావిబట్టలు గట్టుకొని సన్యాసు లగుచుందురు. నీవో యువకుఁడవు జుట్టయినఁ దెల్లఁబడలేదు. మంచి యారోగ్యముతో సుందరుఁడవై యుంటివి. భోగభాగ్యములకా నీకు లోటులేదు. ఈ గ్రామములో అగ్రకులమందుఁ బుట్టిన మీ భోగభాగ్యముల కంతులేదు. ప్రియబంధువులకా తక్కువలేదు, ఇట్టి నీవు ఏమి తెలిసికొని, ఏవిచూచి, ఏవివిని యిల్లు, భోగములు వదలి సన్యాసివైతివి"

"మహారాజా ! ఈ లోకము నశించి పోవునది రోజురోజు ఈ శరీరము క్షీణించిపోవును. లోకమున రక్షణలేదు, శాంతి లేదు. ఈ లోకము మనదిగాదు. సర్వమును విడిచిపోవలసినదే. ఈ లోకమంతయు ఆశకు దాసురాలయి యున్నది అని బుద్ధభగవానుని ధర్మోపదేశములు విని తెలిసికొని నేను ఇట్లు



భోగములు వీడి సన్యాసినైతిని. రాజా! నీ విది వఱకు నడి వయస్సులో నుంటివి. ఇప్పుడో ఎనుబదేండ్ల ముదుసలివి నాఁటి బలము శక్తి ఈ నాఁడేమైనది. నేఁడో రేపో నీ కేదైన రోగము గాని కష్టముగాని వచ్చినచో నీ బంధువు లెవరైనను దానిని బంచుకొందురా ? నీ కెవరైన రక్షణ ఈయఁగలరా ! మృత్యువు మీఁదఁ బడినపుడు ఈ రాజ్యభోగములను లోకమును విడిచి వెళ్ళవలసినదేగదా నీ వింకను రాజ్యమును భావించు చుంటివిగదా. ఇథ గజ వాజిసేనలకు ధనాధి భాగములకు లోటులేదుగదా. రంకను ఎక్కడనైనను రాజ్యములు సులభముగా వచ్చినచో వానిని ఆక్రమించి సిద్ధముగా నున్నావుగదా. ఈ యాశల కంతుగలదా. కోర్కెలకు తృప్తిగలదా. ఇట్టివి తెలిసికొని చూచి నిరతము శాంతి. సుఖములతోఁ గూడి యుండుటకై నేను సంన్యాసినైతిని"

"రాష్ట్రపాలా ! ఆశ్చర్యము. అద్భుతము. నీవు చెప్పినది సత్యము'' అని చెప్పి రాజును రాష్ట్రపాలుఁడును యటనుండి వెడలిపోయిరి.

* * *

## కృ శా గౌ త మి

కృశాగౌతమి యొక బీద యింటిపిల్ల. ఆమె బీదరాలగుటచే ఆమెభర్త యింటివారు అనాదరముగాఁ జూడఁదొడఁగిరి. కొంతకాలమునకు ఆమె కొక కుమారుఁడు పుట్టెను. అప్పటినుండి యామెకు గౌరవము హెచ్చినది.

కని పాపము చిన్నప్పుడే యా పిల్లవాఁడు చనిపోయెను. దానితో నామెకుఁ బిచ్చిపట్టి యా పిల్లవానిని ఒడలిలో నుంచుకొని ప్రతివానితోను "ఈ పిల్లవానికి మందిమ్ము" అని చెప్పి యేడ్వసాగినది. అది చూచి లోకులు "వెళ్ళు భగవానుఁడు నీ కుమారుని బ్రతికించును" అనిరి. అపుడామె యేడ్చుచు బుద్ధ భగవానుని దగ్గఱకుఁ బరువెత్తికొనిపోయి "భగవానుఁడా! నా కుమారునికి మందిచ్చి బ్రతికింపుము" అని ప్రార్థించెను.

"అమ్మాయీ! ఇదివఱకెన్నఁడు ఎవరును జనిపోవని వారి యింటికిఁబోయి చిన్ని గరిటెఁడు ఆవాలు తెమ్ము" అని యనెను.

ఆ కృశాగౌతమి పఱుగు పఱుగునఁ బ్రతియింటికిఁ బోయి యడుగసాగినది. ఎవరికివారే "మా యింట తండ్రిపోయెనని మా యింట తల్లిపోయెనని చెల్లెలు పోయెనని యీ విధముగా నందఱు తమతమ కష్టములు చెప్పసాగిరి.

చివరకు ఆమె ఆయాసముతో భగవానుని దగ్గఱకు వచ్చెను.

"ఏ మమ్మాయీ! ఆవాలు తెచ్చితివా" అని భగవానుఁడడిగెను.

"భగవానుఁడా! నా కా యావాలతోఁ బనిలేదు. ఈ లోకమే యిట్టిదని మీ యనుగ్రహముచేఁ దెలిసికొంటిని. భగవానుఁడు నాకు దీక్ష యొసంగుఁగాక. నేను బుద్ధుని ధర్మమును సంఘమును శరణు చొచ్చుచున్నాను" అని యామె నమస్కరించెను. అపుడు భగవానుఁడు ఆమెకు దీక్ష యిచ్చెను.

* * *



# బ్రాహ్మణ ధర్మము

ఒకప్పుడు బుద్ధభగవానుఁడు శ్రావస్తి పట్టణమున విహరించు చుండెను.

అపుడు కోసల దేశీయులును మహావైభవ సంపన్నులునగు కొందఱు బ్రాహ్మణులు వచ్చి భగవానుని యంగీకారము పొంది యొక ప్రక్కగాఁ గూర్చుండి యిట్లనిరి.

"ఓ గౌతమా! నేఁడు బ్రాహ్మణులు ప్రాచీనమగు బ్రాహ్మణ ధర్మమునందు శ్రద్ధగలిగి యెంచుకుండుటలేదు."

"బ్రాహ్మణులారా! అవును. నేఁడు బ్రాహ్మణులు బ్రాహ్మణధర్మమునందు శ్రద్ధగా నుండుట లేదు."

"అయితే తమకు శ్రమలేనిచో మా కాప్రాచీనమైన బ్రాహ్మణ ధర్మమునుగూర్చి చెప్పెదురుగాక."

"ఓ బ్రాహ్మణులారా! శ్రద్ధగా వినుఁడు. ప్రాచీన ఋషులు ఇంద్రియ నిగ్రహముగలవారై తపస్వులై యుండువారు. వారు ఇంద్రియ భోగములను విడిచి జ్ఞానముకై యధ్యయనము చేయుచుండెడివారు! వారికి పశువులుగాని బంగారముగాని, ధాన్యాదులుగాని లేవు. వారికి స్వాధ్యాయమె ధనము, బ్రహ్మనిధినే పాలించెడివారు. వారికి జనులు కావలసినవి సిద్ధపఱచి యిచ్చెడివారు. వారిని సంపదగలవారు నమస్కరించి గౌరవించెడివారు. అజేయమైన ధర్మమె వారికి రక్షణగా నుండెడిది. వారెక్కడికిఁ బోవుటకును అడ్డులేదు. వారు నలుబది యెనిమిది వత్సరములవఱకు బ్రహ్మచర్యము పాలించువారు, వారు విద్యను పవిత్రాచరణమును అన్వేషించుచుండిరి.

ఇతర స్త్రీల ముఖము చూచువారుగారు. ఋతుకాలమందె భార్యాసంగమము చేయువారు. వారికి బ్రహ్మచర్యము, శీలము, దయ, అహింస, క్షమ, అవశ్యాచరణీయములు, అందు బ్రహ్మవేత్తలగువారు శీల సంపన్నులై బియ్యము వస్త్రములు నేయి నూనె అడిగి తెచ్చుకొని ధర్మయుక్తముగా యజ్ఞములు చేయుచుండువారు. వారా యజ్ఞములలో గోవులను జంపువారు కారు. గోవులు మనకు పరమ మిత్రులు. అవి మనకు ఆహారమును బలమును సుఖమును గలిగించుచున్నవని తలఁచి వానిని జంపెడివారు కాదు. వాటిని బూజించెడివారు. ఇట్లు జరుగుచున్నంతవఱకుఁ బ్రజలందఱు సుఖముగా నుండిరి.

పిదప రాజుల భోగభాగ్యములను జూచి బ్రాహ్మణులును ఆ భాగ్యములను గోరిరి. రాజులచే యజ్ఞములను జేయించి ధనమును దానముగ గ్రహించుట మొదలుపెట్టిరి. ఎప్పుడైతే బ్రాహ్మణులు ధనమును సంపాదించుట మొదలు పెట్టిరో యప్పుడు వారిలో ఆశ పెరిగెను. దానితో బ్రాహ్మణులు భోగభాగ్యములకై ధన ధాన్యములను గోవులను సంపాదింప మొదలిడిరి. పిదప బ్రాహ్మణులచేఁ బ్రోత్సాహ పెట్టఁబడి రాజులు వందల కొలఁది గోవులను యజ్ఞములందుఁ జంపఁదొడఁగిరి.

ఏమియు హానిచేయని మేకలవంటి గోవులు కుండల కొలఁది పాలను వర్షించు గోవులు చంపఁబడుచుండెడివి. అపుడు దేవతలు పితరులు ఇంద్రుఁడు అసురులు అందఱు "అధర్మము అధర్మము" అని మొఱపెట్ట నారంభించిరి.

మొదట ఇచ్ఛ, ఆఁకలి, ముసలితనము అను మూఁడు రోగములు మాత్రమె యుండెడివి. పశు హింసవలన అవి



యిపుడు ఇంకను చాలవఱకుఁ బెఱిగినవి. పురోహితులు నిర్దోషమైన వానిని జంపుచు మిక్కిలి ధర్మమును ధ్వంసము గావించుచు వచ్చిరి. అప్పటినుండి జనులు పురోహితులను నిందింపఁదొడఁగిరి. ఈ విధముగా ధర్మము క్షీణింపఁగా శూద్రులు వైశ్యులు పోరాడఁదొడఁగిరి. క్షత్రియులు ఛిన్నాభిన్నములయిరి. భార్యలు భర్తలను అవమానింపఁదొడఁగిరి. క్షత్రియులు బ్రహ్మ బంధువులు జాతివాదమును నశింపఁజేసి స్వేచ్ఛాచారులయిరి. ఈ విధముగా సర్వము పాడయిపోయెను."

ఈ విధముగా భగవానుఁడు చెప్పఁగా విని "గౌతమా! ఆశ్చర్యము. అద్భుతము. మేము మిమ్ము శరణు చొచ్చుచున్నాము. మేము ధర్మమును సంఘమును శరణు చొచ్చుచున్నాము. నేఁటి నుండి మమ్ము మీ యుపాసకులుగా గ్రహింపుఁడు." అనిరి.

* * *

## అంగుళిమాలుఁడు

ఒకసారి బుద్ధభగవానుఁడు శ్రావస్తి పట్టణములోఁ దిరిగి భిక్ష గ్రహించి భుజించి యంగుళిమాలుఁడను దొంగ సంచరించు మార్గమువైపుగాఁ బోవుచుండెను. అపుడక్కడి గొల్లవారు కర్షకులు భగవానునితో నిట్లనిరి.

"ఓ భగవానుఁడా! ఈ దారివెంటఁ బోకుము. ఇక్కడ అంగుళి మాలుఁడను దొంగ యున్నాఁడు. అతఁడు మనుష్యులను జంపి వారి వ్రేళ్ళను మాలగా వైచుకొని తిరుగుచుండును

గ్రామములన్నిటిని అతఁడు నిర్జనముగఁ జేసివేసెను. ఇటు పోవువారు జట్లు జట్లుగాఁ బోవుదురు. అయినను వారి నతఁడు చంపివేయుచుండును.''

ఇట్లు వారు చెప్పి వారించినను భగవానుఁడట్లే పోవ సాగెను. కొంతదూర మేగునప్పటికి అంగుళిమాలుఁ డెదు రయ్యెను. అంగుళిమాలుఁడు బుద్ధభగవానుని జూచి ''ఎంత మందియైనను గలిసి యిటు వచ్చుటకు జంకుదురే యిటు వంటప్పుడితఁ డొక్కఁడు ఇటు నిర్భయముగా వచ్చుచున్నాఁడే యని యాశ్చర్యపడి యిట్లనెను.

''ఓ సంన్యాసీ! ఏమి యింత నిర్భయముగా వచ్చు చుంటివేమి? నేనెవరనో యెఱుఁగవా ఏమి''

''ఏమి నాయనా! నినె్నఱుఁగకపోవుట యేమి, నీ వెంతటి దుఃఖితుఁడవో నీ మెడలోని మనుజుల వేళ్ళ మాలయే చెప్పు చున్నది.''

"నేను దుఃఖితుఁడనా ఎట్లు? ఎంతమందిని చంపితినో నీకుఁ దెలియునా? నిన్నిదిగో ఇప్పుడే చంపి నా మాలలో నీ వ్రేలిని గూడఁ జేర్చుకొందును"

"అవును. నిజమే, కనుకనే నీవు దుఃఖితుఁడవంటిని. నీ దుఃఖమున కంతులేదు. అందుచేతనే శాంతిలేక యిట్లు తిరుగు చున్నావు. నాకో భయమన్నది లేదు. నాకీ లోకములో ఏమియు నక్కఱలేదు. లోకమంతయు నశించిపోవునదే గదా. నీవు నేనును నేఁడో రేపో నశించిపోదుము. నీవిపుడు నన్నుఁ జంపినచో శాంతితోఁ జనిపోవుదును. నీకో నన్నుఁ జంపినను



శాంతి లేదు. అందుచే నీవంటి దుఃఖితుఁడీ లోకములో లేఁడు. నీకుఁ జంపవలెనని యున్నచో నన్నుఁ జంపివేయుము. కాని శాంతిమార్గము తెలిసికొన్నఁగాని నీకు శాంతి సుఖములు లేవు. అట్టి శాంతి సుఖములు పొందలేక పోవుచుంటివి గదా యని నిన్నుఁ జూచిన నాకు జాలి కలుగుచున్నది.

నిర్భయముగా బుద్ధుఁడు శాంతితోఁ జెప్పిన మాటలు అంగుళిమాలుని నిశ్చేష్టునిఁ జేసినవి. మృత్యువును సంతోష ముతో నెదుర్కొని నిలుచున్న భగవానుని యెదుట నతని క్రౌర్యము నీరయిపోయెను. చావునకు వెఱచి పాఱిపోవు జను లను జంపుటలో వెఱువని యంగుళిమాలుఁడు చావునకు వెఱువక యలౌకిక శాంతితో నిలుచుండి తన్నుఁ జూచి జాలిపడు భగ వానునిఁ జూచి యపుడు వెంటనే కత్తిపాఱవైచి భగవానుని కాళ్ళపైని బడి "భగవానుఁడా! నాకు శాంతిని సుఖమును గూర్చు మార్గము ఉపదేశింపుము" అనెను. అపుడు బుద్ధభగ వానుఁడు అంగుళిమాలునికి రాగద్వేషాది దోషములను గూర్చి యవియే మనుజుని శాంతి హరించు శత్రువులని యుపదేశించి అతనికి నిర్వాణ మార్గము నుపదేశించెను.

నాఁటినుండి హింసకుఁడయిన యంగుళిమాలుఁడు అహింసకుఁడయ్యెను.

ఒకనాఁ డతఁడు ధ్యానమున నుండి యేకాంతమున నిట్లు తలపోసెను.

"ఎవ్వఁడు తన పాపంబుల్, సత్కర్మన్ శుద్ధిచేయునో
వాఁడు మబ్బువీడు చంద్రుఁ, డట్లు వెల్గించు లోకముల్"

"జలము నడపించు రైతు బోదెల నమర్చి
శరము సరిచేయుఁ గమ్మరి సాగఁగొట్టి
దారువుల వంచు వడ్రంగి తఱుగఁజెక్కి
నెమ్మనసు లోఁ గొనును జ్ఞాని నిగ్రహించి."

(నా ధమ్మపదము)

ఆ యంగుళిమాలుని క్రూరకార్యములకై శిక్షింపఁదలఁచి సేనతోఁ బోవుచుఁ బ్రసేనజిత్తు రాజు భగవానుని దర్శింపవచ్చి యట నంగుళిమాలుని దీక్ష వార్త విని యాశ్చర్యపడి యింటికిఁ బోయెను.

ఒకనాఁడు అంగుళిమాలుఁడు భిక్షకుఁ బోఁగా బాలురు బెడ్డలు విసరిగొట్టిరి. రక్తము కాఱుచున్నను శాంతితో అంగుళిమాలుఁడు భగవానుని దగ్గఱకు వచ్చెను. "నీ పాపములకు ప్రాయశ్చిత్త మిక్కడే లభించినది." అని చెప్పి భగవానుఁడు అంగుళిమాలుని ప్రసన్న చిత్తమునకు సంతసించెను.

* * *

## ద్రోణుఁడు

ఒకమాఱు బుద్ధభగవానుఁడు శ్రావస్తిలో జేతవనమున విహరించుచుండెను.

అప్పుడు ద్రోణుఁడను బ్రాహ్మణుఁడు వచ్చి భగవానుని కుశలప్రశ్నలడిగి యొకప్రక్కగాఁ గూర్చుండి "ఓ గౌతమా! మీరు పెద్దలైన బ్రాహ్మణులను నమస్కరింపరని ఎదురుగా



వెళ్ళరనియు, ఆసన మిచ్చి పిలువరనియు వింటిని. ఇది నిజమేనా? గౌతమా! మీరు బ్రాహ్మణులకు అభివాదనము చేయరా? అయితే ఇది మంచిది కాదు" అని యనెను.

"అయితే ద్రోణా! నీవును బ్రాహ్మణుఁడ వనుకొనుచున్నావా?" అని భగవానుఁడనియెను.

"ఓ గౌతమా! మా తల్లి దండ్రులు బ్రాహ్మణులు. వారు జాతినుండి పతితులుగాలేదు. కాన నేనును బ్రాహ్మణుఁడనే"

"ద్రోణా! మీ పూర్వ ఋషులు, మంత్రకర్తలును మంత్రప్రవక్తలును అయిదు విధములగు బ్రాహ్మణులను జెప్పియున్నారు. 1 బ్రహ్మసముఁడు, 2 దేవసముఁడు 3 మర్యాదుఁడు 4 సంభిన్న మర్యాదుఁడు 5 బ్రాహ్మణ చండాలుఁడు. అని. వారిలో నీవే బ్రాహ్మణుఁడవు"

"ఓ గౌతమా! ఈ యయిదుగురు బ్రాహ్మణుల సంగతి నాకుఁ దెలియదు. మేము బ్రాహ్మణులమని మాత్రమె యెఱుఁగుదుము. ఆ యయిదు విధములగు బ్రాహ్మణు లెటువంటివారో చెప్పుము.

ద్రోణా! వినుము. తన తల్లితండ్రులు సుజాతులై యుండి జాతివాదమున అనిందితులై నలుబది యెనిమిదేండ్లవఱకు చదువుచు బ్రహ్మచారులై మంత్రములు చదివి గురువునకు ధర్మము చేతనే సంపాదించిన ధనము దక్షిణగా ఇచ్చి కృషివల్లనుగాని వర్తకము వల్లనుగాని గోరక్షణ వలననుగాని ఇతర శిల్పాదుల వలననుగాని దక్షిణకై ధనము సంపాదింపకుండ భిక్షాచర్య వలననే దక్షిణ ధనమును గురువునకు సంపాదించి ఇచ్చి జుట్టు

తీసివేయించికొని కావి బట్టలు గట్టుకొని యిల్లువీడి మైత్రీ కరుణాదులతో గూడి దిక్కులను బవిత్రము చేయుచు అలోభులై తిరుగుచు శరీరమును వీడిన పిదప బ్రహ్మలోకమును బొందు బ్రాహ్మణులను బ్రహ్మసములందురు.

బ్రహ్మసములవలెనే యాచరించి ధర్మమగురీతిని గురుదక్షిణ యిచ్చి ధర్మయుక్తముగా భార్యను గ్రహించి క్రియ విక్రయముల ద్వారా గాక జలసహితముగా నీయఁబడిన బ్రాహ్మణిని మాత్రమె గ్రహించి యితర స్త్రీలతోఁ గలియక ఋతుమతి కాని స్త్రీని గర్భవతిని పిల్లలకుఁ బాలిచ్చు స్త్రీని ముట్టక సంతానమునకు మాత్రమె భార్యను గలిసి సంతానమును గని జుట్టు తీయించుకొని సంన్యాసియై ధ్యానమగ్నుఁడై చనిపోయిన పిదప స్వర్గమునఁబుట్టు బ్రాహ్మణులు దేవసములు.

పైవారివలెనే యన్నియు నాచరించి సంతానమును గని పుత్రులందలి ప్రేమచే ఇంటియందే యుండి ప్రాచీన బ్రాహ్మణుల మర్యాద నతిక్రమింపక యుండు బ్రాహ్మణులు మర్యాదు లనఁబడుదురు.

పైవారివలెనే అన్నియు నాచరించి గురుదక్షిణ యిచ్చి ధర్మమునఁ గాని యధర్మమునఁ గాని క్రియ విక్రయముల వలనఁగాని భార్యను గ్రహించి క్షత్రియ స్త్రీని ఋతుమతిగాని స్త్రీని గూడ కామము కొఱకై గలియుచుఁ బ్రాచీన బ్రాహ్మణ మర్యాదల నతిక్రమించు బ్రాహ్మణులను సంభిన్న మర్యాదు లందురు.

పైవారివలెనే నలుబది యెనిమిదేండ్లు బ్రహ్మచారియై యుండియు ధర్మమువలనఁగాని యధర్మమువలనఁగాని కృషి



వాణిజ్యాదుల వలనఁగాని గురుదక్షిణ యిచ్చి ధర్మముగాఁగాని యధర్మముగాఁగాని భార్యను గ్రహించి బ్రాహ్మణి స్త్రీని గాని యితర స్త్రీని గాని ఋతుమతి గానిదానిని గాని కామముకొఱకై గలియుచు అన్ని పనులవలనఁ దన జీవికను, సంపాదించుకొనుచు ఎవరైన "నీవు బ్రాహ్మణుఁడవని చెప్పుకొనుచుఁ గూడ నన్ని పనులవలన జీవిక సంపాదించుచుంటివే" అని యడిగినచో నిప్పు శుద్ధమును అశుద్ధమును భస్మముచేసి దాని నంటనట్లు నేనేపనివల్ల జీవించినను నాకేమియు అంటవని చెప్పుచు అన్ని పనులద్వారా జీవిక సంపాదించుకొనువారు బ్రాహ్మణచండాలురు – ఈ విధముగాఁ బూర్వ ఋషులు చెప్పిరి. నీవిందులో ఏ బ్రాహ్మణుఁడవో చెప్పుము."

"ఓ గౌతమా! వీరిలో మేము బ్రాహ్మణ ఛండాలురము గూడఁ గానేరము. భగవానుఁడా! నేను మిమ్ము శరణు చొచ్చుచున్నాను. నన్ను ఉపాసకునిగా గ్రహింపుఁడు." అనెను.

* * *

## జాతి అడుగకు – ఆచరణ అడుగుము

ఒకసారి బుద్ధభగవానుఁడు కోసలదేశమున సుందరికానరుతీరము దగ్గఱ విహరించుచుండెను. అక్కడ సుందరిక భారద్వాజుఁ డను నొక బ్రాహ్మణుఁడు హోమము చేయుచుండెను. ఆ సుందరికుఁడు శిరస్సు ముండనము చేయించుకొన్న భగవానునిఁ జూచి యిట్లు అడిగెను.

"తమరు ఏ జాతి వారలు?"

"జాతి అడగకుము. ఆచరణము అడుగుము. కఱ్ఱనుండి అగ్ని పుట్టును. నీచకులమువాఁడైనను ధైర్యము, జ్ఞానము, శీలము గలిగి పాపాత్ముఁడు గానిచో అతఁడు మునియే యగును. జితేంద్రియుఁడై వేదపారగుఁడై బ్రహ్మచర్యదీక్ష పూర్తి గావించినచో అతఁడు యజ్ఞమునందు ఉపనీతుఁడైన వాఁడే యగును. అతఁడు దక్షిణాగ్నియందు హోమము చేసినవాఁడే"

"నిశ్చయముగా ఇది నాకు సమ్మతమే ఇట్టి మీరు బ్రాహ్మణులే!"

బ్రాహ్మణా! కఱ్ఱనుగాల్చి అది శుద్ధియైనదని యనుకొనకుము. ఇది కేవలము బాహ్యవిషయము. పండితులు దీనిని శుద్ధియనరు. బ్రాహ్మణా! నేను కఱ్ఱను కాల్చుట మాని లోలోపలనే జ్యోతిని వెలిఁగించుచున్నాను. నిత్యము నిప్పును గలిగి, నిత్యము ఏకాంత చిత్తుఁడనై బ్రహ్మచర్యము పాలించుచున్నాను. ఈ యభిమానము ఒక గడ్డిమోపు. కోపము పొగ, అసత్యవాక్కు భస్మము, నాలుక స్రువము, హృదయము జ్యోతికి స్థానము. మనస్సును నిగ్రహించినచో పురుషునికి జ్యోతి కలుగును. బ్రాహ్మణా! ధర్మమనెడి సరస్సులో శీలమనెడి రేవులో డిగి వేదపారగులు స్నానముచేసి శరీరము తడవకుండనె దాటిపోవుదురు. శ్రేష్ఠమైన సత్యము ధర్మము సంయముమీఁద బ్రహ్మచర్యముమీఁద ఆధారపడి యున్నవి."

ఇట్లు చెప్పఁగా విని "ఆశ్చర్యము అద్భుతము." అని పలికి భగవానుని దగ్గఱ దీక్షపొంది భారద్వాజుఁడు అర్హతుఁడయ్యెను.

* * *



# మల్లిక

ఒకమాఱు బుద్ధభగవానుఁడు శ్రావస్తి పట్టణమున జేతవనమున విహరించుచుండెను.

అప్పుడొక వైశ్యుని యేకైక పుత్రుఁడు మరణించెను. నాఁటినుండి యా వైశ్యుఁడు మతిచెడి యేపనియుఁ జేయలేకుండెను. అన్నము తినఁడు. నా పుత్త్రుఁడెక్కడ! అని యేడ్చుచు అతఁడు బుద్ధభగవానుని దగ్గఱకుఁబోయి నమస్కరించి యొక ప్రక్కగాఁ గూర్చుండి యుండెను.

"ఓ వైశ్యుఁడా! ఇట్లుంటివేమి. నీ శరీరములో ఆరోగ్యముగా లేదా" అని భగవానుఁడడిగెను.

"భగవానుఁడా! నా శరీరములో ఆరోగ్యముగనే యున్నది. కాని నా యేకైక పుత్రుఁడు మరణించెను. నాఁటినుండి యేమియుఁ జేయలేను అన్నము రుచింపదు."

"ఓ వైశ్యుఁడా! ఇది నిజమే ప్రియవస్తువులవలనె దుఃఖము, ఏడ్పు, మతిచెడుట గలుగును. ప్రియవస్తువులె యీ యన్నిటికిఁ గారణము."

"భగవానుఁడా! ఏ మంటిరి. ప్రియ వస్తువుల వలన సుఖమేగాని దుఃఖమెట్లు గలుగును." అని చెప్పుచు భగవానునికి నమస్కరింపకయె నిందించుచు నా వైశ్యుఁడట నుండి వెడలిపోయెను.

అక్కడనే దగ్గఱ జూదమాడుచున్న మనుష్యులును ఆ సంగతి విని భగవానుని నిందించి యా వైశ్యునినే సమర్థించిరి.

"ఇది యేమి ప్రియ వస్తువులవల్ల సుఖము ఆనందము కలుగును గాని దుఃఖ మెట్లు గలుగును భగవానుఁడిట్లు చెప్పె నేమి" అను సంగతి క్రమముగా ఊరంతట వ్యాపించెను. చివరకు రాజుగారి చెవిలోఁ గూడఁ బడెను.

మల్లికాదేవి భగవానుని యుపాసకురాలు. ఈ సంగతి తెలుపుటకై వెంటనే వెళ్ళి ప్రసేనజిత్తు మహారాజు మల్లికతో నిట్లనిెను.

"మల్లికా! చూడు మీ శ్రమణ గౌతముఁడు ప్రియ వస్తువులవల్ల దుఃఖము కష్టము కలుగు ననుచున్నాఁడఁట ఇది యెట్లు సందర్భించును."

"మహారాజా! భగవానుఁడట్లు చెప్పినచో నది నిజమే యగును." అని మల్లిక యనెను.

"అవును శ్రమణ గౌతముఁడు చెప్పినదెల్ల నీకు సత్యమే యగును. ప్రతివాఁడు తమ తమ గురువులు చెప్పిన దానిని అవు ననక కాదందురా యేమి? ఇట్లే నీవును. చాలు చాలు చాల బాగున్నది." అనుచు రా జట నుండి వెడలిపోయెను.

మల్లికకు ఈ మాటలు చాల విచారము కలిగించెను. అప్పుడు వెంటనే మల్లిక నాలీజంఘుఁడను బ్రాహ్మణుని బిలిచి భగవానుని దగ్గఱకు వెళ్ళి ఎట్లు ప్రియ వస్తువులవల్ల దుఃఖము గలుగునో నమస్కార పూర్వకముగా నడిగి తెలిసికొని రావల సినదని పంపెను.

అపుడు నాలీజంఘుఁడు భగవానుని దగ్గఱకుఁ బోయి నమస్కరించి మల్లికాదేవి నమస్కార పూర్వకముగ అడిగిన దానిని విన్నవించెను. భగవానుఁడు నాళీజంఘునితో నిట్లనెను.



"అవును ఇది యిట్లే బ్రాహ్మణుఁడా! వినుము."

"మునుపు శ్రావస్తిలో ఒకతె తల్లి చనిపోయినది. అపుడామె పిచ్చిదయి తన ప్రియమైన తల్లిని గూర్చి యేడ్చుచు మా అమ్మను జూచితివా మా అమ్మను జూచితివా? యని బాట బాట ఇల్లు ఇల్లు తిరిగి తిరిగి వాపోయినది. ఇట్లే యొకని భార్య పోయినది. అతఁడు నట్లే తిరిగెను. ఈ శ్రావస్తిలోనే ఒకతె తన పుట్టింటికిఁ బోయినది. అపుడామె సోదరులు ఆమెను ధనాశచే నింకొకనికిచ్చి పెండ్లిచేయఁ దలఁచిరి. అది యామె కిష్టములేక తన భర్తతోఁ జెప్పెను. అప్పుడాతఁడు "మన మిద్దఱము ఇప్పుడు చచ్చిపోయి తిరిగి కలిసి పుట్టుదము" అని తలఁచి యామెను జంపి తన్నుఁ జంపికొనియెను. ప్రియ వస్తువులను బట్టి దుఃఖము కలుగు" ననెను.

అంత నాలీజంఘుఁడు భగవానుని దగ్గఱ సెలవు తీసికొని మల్లికతో నీ సంగతి తెలిపెను.

అపుడు మల్లిక తన భర్తయగు ప్రసేనజిత్తు మహారాజును బిలిచి యిట్లనెను.

"మహారాజా! నీకు వజ్రిణి కుమారి యిష్టురాలు గదా. దానికేదైన జబ్బు చేసినచో నీకెట్లుండును."

"ఎట్లుండునని యడుగుచుంటివా? నాకు అమిత దుఃఖము కలుగును."

"సరే నీకు వాసభ క్షత్రియ, నేను విదూడభ సేనాపతి నీదేశ ప్రజలు అందఱు ప్రియమైన వారేగదా. వీరికేదైనఁ గష్టము వచ్చినచో నీకెట్లుండును."

"నాకింకఁ జెప్పవలసిన దేమున్నది. నా ప్రాణములు పోయినట్లే. ఆ దుఃఖమున కఁతున్నదా."

"కనుకనే మహారాజా! ప్రియ వస్తువులవల్ల దుఃఖము కలుగునని భగవానుఁడు చెప్పెను." అని మల్లిక యనెను.

"మల్లికా! నిజము ఆశ్చర్యము. ఎంత యద్భుతము. నీవు చెప్పినది నిజము. భగవానుఁడెట్టి సత్యద్రష్ట" అని చెప్పి ప్రసేనజిత్తు మహారాజు భగవానుని యుపాసకుఁడయ్యెను.

"ప్రియంబుచే వ్యథల్గల్గుఁ; బ్రియంబుచే భయంబగున్
ప్రియంబె లేనివానికి, శోకమేది భయంబెది."

(నా ధమ్మపదము)

* * *

## మఖాదేవుఁడు

ఒకప్పుడు బుద్ధభగవానుఁడు మిథిలా పట్టణమున మఖాదేవుని మామిడితోటలో విహరించుచుండెను.

అప్పుడు భగవానునికి నవ్వు వచ్చెను అట్లు భగవానుఁడెందుకు నవ్వెనో యానందునికిఁ దెలిసికొనఁ గోరిక గలిగి "భగవానుఁడా! తమకు నవ్వు వచ్చుటకుఁ గారణమేమి" యని యడిగెను.

"ఆనందా! వినుము చెప్పెదను. పూర్వము ఈ మిథిలలోనే మఖాదేవుఁడను పేరుగల ధర్మాత్ముఁడైన రాజు ఉండెను. ఆ రాజు బ్రాహ్మణుల యెడల, గృహపతుల యెడ, గ్రామాదులందు ధర్మముగా నుండువాఁడు. అమావాస్య, పూర్ణిమ,



అష్టమి తిథులందు అతఁడు ఉపవాసముండెడివాఁడు. అతఁడొకనాఁడు తన జుట్టు నెరయుట చూచి తన పెద్ద కుమారుని జూచి యిట్లనెను. నాయనా! నాకు దేవదూతలు ప్రత్యక్షమగుచున్నారు. నా జుట్టు నెఱసినది. నేను మనుష్యభోగము లనుభవించితిని. దివ్య భోగములను అన్వేషింపవలసి యున్నది. రమ్ము. ఈ రాజ్యమును దీసికొని ధర్మముగాఁ బాలింపుము. నేను జుట్టు తీయించివేసికొని కాషాయబట్టలు కట్టుకొని యిల్లు వీడి సంన్యాసి నగుదును. ఇట్లే నీవును జుట్టు నెఱసిన పిదపఁ జేయవలయును. నేను జేసినట్లుగా ఈ కళ్యాణ మార్గమును ముగింపఁజేయు చివరివాఁడవుగ నుండకుందువు గాక. ఏ పురుషుఁడు జీవించియుండఁగా నీ కళ్యాణ మార్గము ముగియునో యతఁడే దానికిఁ జివరివాఁడగును అని చెప్పి మఖాదేవుఁడు జుట్టు తీయించుకొని మంగలికి ఒక గ్రామము ఈనాముగా నిచ్చి సంన్యాసియై యతఁడు చనిపోయిన పిదప బ్రహ్మలోకమును బొందెను. ఇట్లే వాని పుత్త్ర పౌత్త్రులు వరుసగా సంన్యాసులై యుత్తమగతి పొందిరి. వారిలో నిమి రాజు చివరి ధర్మాత్ముఁడైన రాజయ్యెను. నిమికూడ సంన్యాసియై యుత్తమ గతి పొందెను. కాని కొడుకు కలారజనకుఁడనువాఁడు మాత్రము సంన్యాసి కాలేదు. వానితో ఈ కల్యాణ మార్గము ముగిసెను. ఇట్లే నిర్వాణ మార్గమును దెలిపిన తోను, నీతోను ఈ మార్గము ముగియకుండ నుండును గాక. అని తలపోయఁగా నవ్వు వచ్చినది. నీవే యీ మార్గమునకుఁ జివరివాఁడవు కాకుందువుగాక."

అపుడు ఆనందుఁడు సంతోషించి యా మాటలను అభినందించెను.

* * *

## దేవదత్తుఁడు

ఒక సమయమున రాజగృహమునఁ గలందనివాపుని వేణువనమున రాజు గొప్ప పరిషత్తుతోఁ గూడియుండఁగ బుద్ధ భగవానుడు ధర్మోపదేశము చేయుచుండెను.

అప్పుడు అదివఱకె భిక్షు సంఘములోఁ గలిసిన దేవదత్తుఁడు తన యాసనమునుండి లేచి భగవానుఁడున్నవైపుగా దోసిలి పట్టుకొని యిట్లనెను.

"భగవానుఁడా! తమరు పెద్దలైనారు. వయస్సు పండినది. ఇంక నెక్కడనైన నిశ్చింతగా విహరింతురుగాక. నాకీ భిక్షు సంఘమును అప్పగింపుఁడు. నేను వీరిని పరిగ్రహింతును."

"చాలు, దేవదత్తా! నీవు భిక్షసంఘమును పరిగ్రహించుట నాకు ఇష్టముగాదు" అని భగవానుఁడు చెప్పినను దేవదత్తుఁడు మాటిమాటికి మూఁడుసార్లు అడుగసాగెను. భగవానుఁడు మూఁడుసార్లును నిషేధించెను. అయినను మరల అదే పనిగ దేవదత్తుఁడు అడుగఁగా భగవానుఁడు విసిగి "దేవదత్తా! సారిపుత్ర మౌద్గల్యాయనులకుఁ గూడ భిక్షు సంఘమును అప్పగింపనివాఁడను నీవంటి యల్పుని కప్పగింతునా?" అనెను.

అంత సభలోఁ దన్ను అల్పుఁడని యనుట దేవదత్తునికిఁ జాల కష్టము గలిగించెను. అసలే మొదట నుండి గౌతముఁడన్నఁ గిట్టని దేవదత్తుఁ డిపుడు గూడ భగవానునిపై బగ సాధింపనెంచి యటనుండి వెడలిపోయెను.



అదివఱకే తన వలలో వేసికొన్న మూఢుఁడు దుష్టుఁడునైన యజాత శత్రువు దగ్గఱకుఁబోయి 'కుమారా! ఇదివఱకు మనుష్యులు దీర్ఘాయువులై యుండెడివారు. ఇప్పుడు వారు అల్పాయుష్కులు. నీవు చిన్నవాఁడవుగ నుండఁగానే మరణింపవచ్చును. కాన నీవు నీ తండ్రి బింబిసారునిఁ జంపి రాజవగుము. నేను ఈ శ్రమణ గౌతమునిఁ జంపి బుద్ధుఁడ నగుదును". అనెను.

వెంటనే యజాత శత్రువు మొలలోఁ గత్తి పెట్టుకొని మధ్యాహ్నమె యంతఃపురమును బ్రవేశించెను. అది తెలిసికొని బింబిసారుఁడు కుమారునిఁ బిలిచి యిట్లనెను.

"అబ్బాయీ! నన్నుఁ జంపుదువఁట యెందుకు"

"రాజా! నాకు రాజ్యము కావలయును"

"అయితే ఇదిగో రాజ్యము తీసికొనుము"

అని బింబిసారుఁడు అజాత శత్రువునకు రాజ్యమిచ్చివేసెను.

నాఁటినుండి యజాత శత్రువు దేవదత్తుని యిష్టప్రకారము నడువఁ దొడఁగెను. ఒకనాఁడు దేవదత్తుఁడు అజాత శత్రువుతోఁ జెప్పి కొందఱు మనుష్యులను భగవానునిఁ జంపుటకుఁ బంపెను.

ఆ మనుష్యులు బుద్ధభగవానునిఁ జంపుటకు వెళ్ళియు, బుద్ధభగవానుని శాంతమూర్తిని జూచి చంపలేకపోయిరి.

ఇది చూచి దేవదత్తుఁ డొకనాఁడు తానే భగవానునిఁ జంపుటకుఁ బూనుకొనెను.

ఒకనాఁడు భగవానుఁడు గృధ్రకూట పర్వతము యొక్క నీడయందుఁ దిరుగుచుండెను. అపుడు దేవదత్తుఁడు చాటున

నుండి యొక ఱాయి భగవానునిపై విసరెను. కాని యది. దైవవశమున భగవానునికిఁ దగులక ఒక పెద్దఱాతికిఁ దగి ఆ దెబ్బకు ఆ ఱాతినుండి యొక ఱాతిముక్క యూడి చెదరి బుద్ధభగవానుని కాలివ్రేలికిఁ దగిలి గాయపఱచెను.

ఈ విధముగాఁ దన ప్రయత్నము లన్నియు విఫలమగుటచే నింక భిక్షు సంఘములో కలఁతలుపెట్టి సంఘమును చీల్పసాగెను.

కొంతకాలమునకు దేవదత్తుఁడు భిక్షుసంఘములోని కొలది మందిని విడఁదీసి గయా శీర్షమువైపు వెడలిపోయెను.

ఇది తెలిసికొని దేవదత్తుని నుద్దేశించి బుద్ధభగవానుఁ డిట్లనెను.

"సత్యమున్ దమమున్ లేక, రాగాదులఁ ద్యజింపక
కాషాయబట్ట కట్టుచో, దాని కాతఁ డనర్హుఁడా"
"పాపి యటఁ దపించుఁ జనియుఁ దాపమొందు
నిహపరంబుల మిగులఁ దపించుచుండు
అతఁడు పాపంబు చేసితి నని తపించు
దుర్గతినిబొంది యాతఁ డెంతో తపించు"
"చెట్టుపైఁ బ్రాకి చెట్టునే, తీవియ చంపునట్టులన్
తనలోఁ బుట్టి పాపంబు, తన్నే చంపు ద్విషుల్ వలెన్"
"దుష్టమౌ మేలుగూర్పని, పనుల్ చేయుట చుల్కన
మంచివౌ మేలు గూర్చెడు, పనుల్ చేయుట కష్టము"
(నా ధమ్మపదము)

* * *



(బుద్ధుని 75 – 80 ఏండ్ల వయస్సులో)

## అ జా త శ త్రు వు

బింబిసారుని భార్య గర్భవతిగా నుండఁగా నామెకు భర్త రక్తము త్రాగవలెనని కోరిక పుట్టినది. రాజు వైద్యుని రప్పించి బంగరు కత్తితోఁ దన చేయి చీల్పించి యా రక్తమును బంగరు గిన్నెలోఁ బోయించి నీటిలోఁ గలిపి భార్యచేఁ ద్రాగించెను.

జ్యోతిష్కులు ఇది విని "ఈమెకుఁ బుట్టిన కుమారుఁడు తండ్రిని జంపు"నని చెప్పిరి. అది విని రాజు భార్య తన గర్భమును జెడఁగొట్టుకొనుటకై కడుపు బాదుకొనెను. కాని గర్భము చెడలేదు. కుమారుఁడు పుట్టిన పిదప దాదులు "కుమారునిఁ దల్లి చంపునేమో" యని దూరముగఁ దీసికొనిపోయి పెంచిరి. కుమారుఁడు కొంచెము పెద్దవాఁడయిన పిదప ఆమెకుఁ జూపిరి. అంతట ఆమెకుఁ బుత్త్రప్రేమ యుదయించినది. ఆమె కుమారునిఁ జంపలేక పోయెను. రాజు క్రమముగా వానిని యువరాజుగాఁ జేసెను. దేవదత్తుని మాటచే నతఁడు తండ్రిని జంపఁబోఁగాఁ దండ్రి వానికి రాజ్య మిచ్చివేసెను. ఒకనాఁడు దేవదత్తుఁడు అజాత శత్రునితో "నీ తండ్రి నీవు చేసిన యపరాధమునకు ఏదో దినమున శిక్షించి తానే రాజగును కాన మెల్లగాఁ దండ్రిని జంపివేయు" మనెను. కాని ఒకసారిగఁ జంపఁజాలక యజాతశత్రువు తండ్రిని జైలులో బంధించి దేవదత్తుని సలహాచే ఆహారము నీయ మానివేసెను. తన తల్లికి మాత్రము బ్రతిమాలఁగా తండ్రిని జూచుట కనుజ్ఞ యిచ్చెను. ఆమె బంగరు పాత్రలో ఆహారము పెట్టుకొని యా

పాత్ర బట్టలో దాచుకొని పట్టుకొనివెళ్ళి భర్తకుఁ బెట్టెడిది. అది తెలిసి రాజు పరీక్ష చేయించి యట్లు తీసికొని వెళ్ళకుండ నిరోధించెను ఆమె కాళ్ళజోడులో పెట్టుకొని కొంతకాలము ఆహారము తీసికొని వెళ్ళెడిది. అదియును నిరోధించఁగ గంధోదకముచే స్నానముచేసి మధుర రసములను ఒంటికిఁ బూసికొని బట్ట కప్పుకొని వెళ్ళఁగా రాజు ఆమె శరీరమును నాకి జీవయాత్ర గడపునాఁడు. చివరకతఁడు అదియుఁ దెలిసికొని యామెను వెళ్ళుటను నిరోధించెను అప్పుడామె జైలు గుమ్మము దగ్గఱ నిలుచుండి "స్వామీ! మీరు చిన్నప్పుడు వీనిని జంపనిచ్చితిరి గాదు. మీ శత్రువును మీరే పెంచితిరి. ఇదే మీ చివరి దర్శనము. ఇంకమీఁద మిమ్ముఁ జూచు భాగ్యముకూడ లేదు. నా తప్పు లేమైన నున్నచో క్షమింపుఁడు" అని పలుకుచుఁ దల్లి యేడ్చుచు నటనుండి వచ్చివేసెను.

పిదప రాజునకు ఆహారము లభింపలేదు. రాజు భగవానుని వలన జ్ఞానము పొందినవాఁడు గాన శాంతితో నిరాహారుఁడై యుండెను. అజాత శత్రువు తండ్రిని అట్లు గూడ నుండనీయక మంగలిని బంపి కాళ్ళు చీల్పించి యుప్పు నూనె వ్రాయించి యంటింపఁజేసి శరీరము టపటప ప్రేలుచుండఁ జంప నాజ్ఞ యిచ్చెను.

ఆనాఁడే యజాత శత్రువునకుఁ గుమారుఁడు కలిగెనని వార్త చెప్పిరి. అప్పుడు కుమారుని మీఁద అతనికి ప్రేమ యంకురించి శరీరమంత వ్యాపించి యెముకలకుఁ గూడఁ బట్టెను. అంతతో తనమీఁద గూడఁ దన తండ్రికి ఇంత ప్రేమ పుట్టియుండుమ గదా అని వానికిఁదోఁచి కంగారువడుచు "నా



తండ్రిని వదలివేయుఁడు నా తండ్రిని జంపకుఁడు" అని కేకలు వేసెను. ఇంతలోఁ దండ్రి చనిపోయినట్లు వార్త తెలిపిరి. అప్పుడు అజాత శత్రువు ఏడ్చుచుఁ దన తల్లి దగ్గఱకుఁ బోయి "అమ్మా! నా తండ్రికి నామీఁదఁ బ్రేమ యుండెనా" అని యడిగెను అప్పుడామె "ఓరీ నీవు మూర్ఖుఁడవు నీవే మెఱుఁగుదువు. నేనేమి చెప్పఁగలను. చిన్నప్పుడు నీ వ్రేలిమీఁదఁ గుఱుపు వేసినది. అప్పుడు ఆ బాధకు నీ వేడ్చుచుండఁగా నీ తండ్రి యున్న న్యాయస్థానమునకు నిన్నుఁ దీసికొని వెళ్ళిరి. నీ తండ్రి నీ వ్రేలిని తన నోటిలోఁ బెట్టుకొనెను. ఆ కుఱుపు నోటిలోనే చితికెను. అప్పుడు నీయందలి ప్రేమచే ఆ చీముతోఁ గలిసిన నెత్తురును ఉమ్మివేయక మ్రింగివైచెను. ఇట్టిది నీ తండ్రి ప్రేమ." అని యామె యేడ్చుచుఁ జెప్పెను.

అప్పుడు * అజాతశత్రువు ఏడ్చి యేడ్చి పశ్చాత్తప్తుఁడై తండ్రికిఁ గ్రియలు చేసి యప్పటి నుండి సదాచారుఁడై యుండెను.

× × × ×

* ఈ యజాత శత్రువు వంశమున అయిదు తరముల వఱకు బితృవధ జరుగుచు వచ్చెను. అజాతశత్రువు తన తండ్రి యగు బింబిసారుని జంపెను. ఉదయనుఁడు తన తండ్రియైన యజాత శత్రువును, మహాముండుఁడు తండ్రియైన యుదయుని, అసిరుద్ధుఁడు తండ్రియైన మహాముండుని, నాగదాసుఁడు తండ్రియైన యనిరుద్ధునిఁ జంపిరి. పిదవ వారు వంశచ్ఛేదక రాజులని తలఁచి యా దేశ ప్రజలు నాగదాసునిఁ జంపివైచిరి.

పిదప దేవదత్తుఁడీ సంగతి విని చివరకుఁ బశ్చాత్తప్తుఁడై భగవానుని క్షమాపణ వేడుతలంపుతో వచ్చుచు దారిలోఁ జనిపోయెను.

* * *

## శ్రామణ్య ఫలము

పశ్చాత్తాప పడిన యా యజాత శత్రువు ఒకనాఁడు భగవానుని దగ్గఱకుఁ బోవఁదలఁచి ప్రయాణమయి జీవకునిచే నేర్పఱచఁబడిన యామ్రవనము వైపుగాఁ బోయెను. అపుడు అక్కడ బుద్ధభగవానుఁడు పండ్రెండు వందల యేఁబదిమంది భిక్షువులతో విహరించుచుండెను. అక్కడ భిక్షువులు దగ్గిన చప్పుడుగాని శ్వాసశబ్దముగాని లేక నిశ్శబ్దముగా స్వచ్ఛమగు సరస్సువలె నుండుటచూచి యాశ్చర్యపడి "నా కుమారుఁడిట్లే పరమశాంతితో నుండుఁగాక" యని యజాతశత్రువు అనుకొనెను.

అతఁడు భగవానుని దగ్గఱకుఁ బోయి నమస్కరించి యొక ప్రక్కగాఁ గూర్చుండి "తమ యనుమతి యైనచోఁ గొంచెము అడుగఁదలఁచితిని" అనెను.

"సరే" యని భగవానుఁడనెను.

"భగవానుఁడా! భిన్న భిన్న శిల్పములు విద్యలు కళలు నేర్చుకొన్నవారు ఈ జన్మమందే ప్రత్యక్షమైన యనేక ఫలములను బొందుచున్నారు గదా. అట్లే శ్రమణులగుటవలన వీరికి ఏదైనఁ బ్రత్యక్ష ఫలము గలుగునా! దయచేసి చెప్పుఁడు. దీనిని గూర్చి పూర్ణకాశ్యపుని నడుగఁగా "పుణ్య



పాప కార్యములు లేవు. మంచిపనిచేసినను జెడ్డపని చేసినను వానివలన నేమియుఁ గలుగదు" అని యక్రియావాదము చెప్పెను. మక్ఖలి గోపాలుఁడు" ప్రాణుల క్లేశములకు హేతు ప్రత్యయములు లేవు. హేతు ప్రత్యయములు లేకుండనె ప్రాణులు శుద్ధి పొందును. ఏ జీవులును తమ వశములో నుండవు. లోకదేవ కల్పములను దెలిసికొని దుఃఖాంతము చేసికొనవలెనని దైవవాదముగూర్చి చెప్పెను. కేశకంబలుఁడు "దానాదుల వలన ఫలము లేదు. పరలోకాదులు లేవు. ప్రాణి చనిపోయి పంచభూతములలోఁ గలిసిపోవును. ఆస్తికవాదము వట్టిది. చనిపోయిన పిదప ఏమియు లేదు." అని యుచ్ఛేదవాదమ్మును జడవాదమును జెప్పెను. ప్రక్రుధకాత్యాయనుఁడు "పృథివి నీరు తేజస్సు గాలి సుఖము దుఃఖము జీవనముః అను కాయములేడును అచలములు. చంపువాఁడును చచ్చువాఁడును లేఁడు" అని యకృతావాదమును జెప్పెను. నిర్గ్రంథనాథపుత్త్రుఁడు జలాదులను వారించి జలస్థలాదులందలి ప్రాణులను జంపకున్నచో పాపరహితుఁడగును. 1 జలపాప వారణము 2 స్థలపాపవారణము 3 సకలపాపరహితము 4 సకలపాపవారణము అను చతుర్యామ సంవరమును గూర్చి చెప్పెను. సంజయవేలట్ఠి పుత్త్రుఁడు "పరలోకములు ఉన్నవి లేవు ఉండి లేవు లేక పోవుటలేదు." అని యీ విధముగా అనిశ్చితతావాదము నుపన్యసించెను. ఒక్కరును శ్రామణ్య ఫలమును గూర్చి చెప్పలేదు. కాన భగవానుఁడు చెప్పును గాక."

"మహారాజా! అయితే సరే వినుము. ఈ నీ సేవకులను జూడుము. వీరు నీకంటె ముందులేచి యనేక శ్రమలుపడి నీకు

సుఖము గలిగించుచున్నారు గదా! వారు ఈ పని విడిచి యిల్లు వీడి సంన్యాసులైనచో వీరిచే నీవు పని చేయించుకొందువా?"

"భగవానుఁడా! ఎట్లు చేయించుకొందును. వారికి నమస్కరించి భిక్షాన్నములచే గౌరవింతును."

"మహారాజా! చూచితివా? ఇది యొక ప్రత్యక్ష ఫలము మఱియు వీరు దుష్టవృత్తులనుండి మరలి యే ప్రాణిని జంపక క్రయవిక్రయములు వస్తుసంపాదన తద్రక్షణము మొదలగు వానిలోఁ బడక యదృచ్ఛా లాభముచే సంతుష్టులై విలాస నృత్య గీతాది మోహములలోఁ బడక ఋణ విముక్తులు సుఖించునట్లు బాధలనుండి విముక్తులై నియతాహారులై యారోగ్యము పొంది శీల సంపన్నులై యింద్రియ నిగ్రహము గలిగి స్మృతి సంతోషములను బొంది చిత్తసమాధిని ప్రజ్ఞను బుద్ధులను దివ్య శ్రోత్రమును పరచిత్త జ్ఞానమును పూర్వజన్మ స్మృతిని దివ్యచక్షువును సకల దుఃఖ క్షయమును క్రమముగాఁ బొంది నిర్మల జలాశయమువలె శాంతులై ముక్తులయి నిత్య నిర్వాణానందమును పొందుదురు. ఇంతకంటె నింకఁ బ్రత్యక్ష ఫలమేమి కావలయును."

"భగవానుఁడా! ఆశ్చర్యము అద్భుతము. నన్నుఁ దమ యుపాసకునిగ స్వీకరింపుఁడు. నేను మూర్ఖుఁడనై యైశ్వర్యమును గోరి ధర్మాత్ముఁడైన తండ్రిని జంపిన క్రూరుఁడను ఈ మహాపాపము పోవునట్లు ఇంక ముందు పాపము చేయకుండునట్లు నన్ను అనుగ్రహింపుఁడు."

"మహారాజా! చేసిన పాపము నంగీకరించి పశ్చాత్తాప



పడుచుంటివి గదా. ఇఁకముందు ఎట్టి ప్రాణిని హింసింపక యార్య ధర్మపరుఁడవై యుండుము." అని భగవానుఁడు పలికెను.

అపుడు అజాత శత్రువు భగవానునికి నమస్కరించి సెలవుగైకొని వెడలిపోయెను.

* * *

## సారిపుత్త్ర మౌద్గల్యాయనుల నిర్వాణము.

ఒక సమయమున బుద్ధభగవానుఁడు శ్రావస్తి పట్టణమున అనాథ పిండికుని జేతవనములో విహరించుచుండెను.

అప్పుడు ఆనందుఁడు వచ్చి "భగవానుఁడా! యాయుష్మంతుఁడగు సారిపుత్త్రుఁడు నిర్వాణము పొందెనఁట. ఇవిగో వాని పాత్రయు బట్టలును, ఈ మాటలు వినఁగా నా శరీరములోని శక్తియంతయుఁ బోయెను. నాకు దిక్కులు శూన్యముగాఁ దోఁచినవి. ఏ మాటయుఁ దోఁచుటలేదు" అని చెప్పెను.

"ఆనందా! అయితే సారిపుత్త్రుఁడు శీలమును దీసికొనిపోయి నిర్వాణమును బొందెనా? సమాధినిగాని, ప్రజ్ఞనుగాని విముక్తినిగాని తీసికొనిపోయి నిర్వాణమును బొందెనా?"

"భగవానుఁడా! సారిపుత్త్రుడు దేనిని దీసికొనిపోయి నిర్వాణమును బొందలేదు. కాని సారిపుత్త్రుఁడు మాకు ఉపదేష్ట, జ్ఞాతాజ్ఞాత విషయములను దెలుపుచు సముత్తేజము గలిగించుచు సబ్రహ్మచారులను అనుగ్రహింపఁ జేసెను. ఇది సారి

పుత్త్రుని ధర్మముగా నున్నది. దానిని మేము తలంచుకొను
చున్నాము."

"ఏమి ఆనందా! నే నిదివఱకే చెప్పలేదా? అన్ని ప్రియ
వస్తువుల నుండి మనము విడఁబాటు పొందవలసినదే గదా.
పుట్టిన వస్తువెల్లను నాశనము పొంది తీఱవలసినదే. నాశనము
కాకుండ నుండవలయును అనునది సంభవింపదు గదా. భిక్షు
సంఘ మంతయు నున్నను అందఱిలోను సారమైన సారిపుత్త్రుఁ
డిప్పుడు నిర్వాణము పొందెను. అతఁ డిప్పు డెక్కడ మరల
దొరకును. కనుక మీ యంతట మీరే మీ మార్గములను జూపు
దీపములు గండు. ఇతరులమీఁద ఆధారపడరాదు. ధర్మమునే
శరణు చొచ్చుఁడు" అనెను.

ఇంతలో మౌద్గల్యాయనుఁడును నిర్వాణము పొందెనన్న
వార్తయును భగవానుని చెవులఁబడెను. అపుడు భగవానుఁడు
భిక్షుసంఘమును జూచి యిట్లనెను.

"భిక్షువులారా! నా కీ పరిషత్తు అంతయు శూన్యముగఁ
దోఁచుచున్నది. సారి పుత్త్రుఁడును మౌద్గల్యాయనుఁడును
ఉన్నప్పుడు ఈ పరిషత్తు నిండుగా నుండెడిది. ఏ దిక్కున
వీరిద్దఱు సంచారము చేయుచుండెడివారో యా దిక్కున ఎట్టి
లోటును లేక ఎవరి యవసరమును లేకుండ నుండెడిది. ఇట్టి
యుత్తమమైన జంట ఎక్కడ దొరకును. నాకు ఈ సారిపుత్త్ర
మౌద్గల్యాయనులవంటి జంటయే వన పూర్వపు భగవానుల
కుండి యుండును. ఇఁకముందు నుండఁగలదు. భిక్షువులారా!
ఆశ్చర్యము. తథాగతుని శాసనములను ఉపదేశములను



సరిగఁ బాలించి నాలుగువైపుల అన్ని పరిషత్తులకుఁ బ్రియులై
ధర్మప్రచారము చేయు నిట్టి జంటలను గూర్చి యాశ్చర్యము
గలుగుచున్నది. ఇట్టి వీరు నిర్వాణము పొందినను తథాగతు
నికి దుఃఖము గలుగుట లేదు. ఈ స్థితి యెట్లు లభించును.
సర్వము నశించిపోవునదే మహావృక్షము నిలచియున్నను
దాని సారమైన పెద్ద కొమ్మలు విఱిగిపోయినట్లు ఇంత భిక్షు
సంఘ మున్నను అందు సారభూతమైన సారిపుత్త్ర మౌద్గ
ల్యాయనులు నిర్వాణ మొందిరి. మీ యంతట మీరే దీప
ములు గండు. ఇతరులమీద ఆధారపడకుఁడు. ధర్మమును
శరణు చొచ్చుఁడు. నేను పోయినప్పుడును మీ రిట్లే యుండ
వలయును."

* * *

## భగవానుని మహాపరి నిర్వాణము

బుద్ధభగవానుఁడు క్రమముగా రాజగృహము, అంబ
లట్టిక (పాట్నా జిల్లా) పాటలి గ్రామము, కోటి గ్రామము,
నాటిక (శత్తిపర్గణా ముజప్ఫర పురజిల్లా) వైశాలి, వేలువ
గ్రామము, భండ గ్రామము, ఆమ్ర గ్రామము, జంబు
గ్రామము చేరి సంచారము చేయుచుఁ గుశీనరము వైపుగ
నున్న భోగనగరము చేరి యట ఆనంద చైత్యమున విహ
రించి యటనుండి భిక్షు సంఘముతో పాటు పావా గ్రామము
చేరి యట కంసాలియగు చుందుని యామ్రవనమున విహ
రించుచుండెను.

అపుడు కంసాలి యగు చుందుఁడు వచ్చి భిక్షు సంఘముతో పాటు భగవానుని మఱునాఁడు భిక్షకు దయచేయ వలసినదిగాఁ గోరెను. అప్పుడు భగవానుఁడు మౌనముతో నంగీకరించెను. చుందుఁడు బహు రుచ్యములగు పదార్థములు స్వయముగా * వడ్డించి భగవానుని భిక్షుసంఘమును సంతృప్తిపఱచెను. భోజనమైన పిదపఁ జుందునికి ధార్మిక వార్తలచే బోధచేసి యటనుండి లేచి వెడలిపోయెను.

ఆ చుందుని యింట భుజించినది మొదలుకొని భగవానునికి రక్తము పడు కఠోరవ్యాధి బయలుదేరెను. అది మరణవేదన కలిగింపఁ దొడఁగినది. భగవానుఁడు స్మృతి జ్ఞానశక్తిచేత దాని కష్టముఁ బొందలేదు.

పిదప నక్కడ నుండి కుశీనర పట్టణమునకు బయలుదేఱెను. మార్గ మధ్యమున భగవానుఁడు మార్గము నుండి తొలఁగి యొక చెట్టు క్రిందకుఁ బోయి "ఆనందా! అలసిపోయితిని వస్త్రము పఱువుము కూర్చుందును" అనెను.

---

* వడ్డన పదార్థములలో శూకర మార్దవము గూడ వడ్డింపఁబడెనని బౌద్ధ గ్రంథములలోఁ గలదు. శూకర మార్దవమనఁగా ఏడాది వయస్సు గల పందిమాంసమని కొందఱును, పంచగోరసములతోఁ జేయఁబడిన పరమాన్నమని కొందఱును, రసాయనములలో వర్ణింపఁబడిన (బుద్ధభగవానునికి దీర్ఘాయువు నిచ్చు) శూకర మార్దవమను నొక రసాయనమని కొందఱును, శూకర కందము యొక్క పాకమని కొందఱును వ్యాఖ్యానము చేసిరి.



అపుడు ఆనందుఁడు పఱచిన యాసనముపై భగవానుఁడు కూర్చుండి "ఆనందా! నేఁడు రాత్రి రెండుజాముల తర్వాత కుశీనగరములో ఉపవత్తసశాల వనమునందు శాల వృక్షముల మధ్య తథాగతుఁడు నిర్వాణము పొందును. ఆనందా! రమ్ము కకుత్థ్స నదివైపు పోదము" అనెను.

పిదప వారు కకుత్థ్స నదిలో దిగి స్నానము చేసి పైకిలేచి యా నది యొడ్డున నున్న మామిడి తోటలోనికిఁ బోయిరి. అక్కడఁ బఱచిన యాసనము పయి పరుండి యానందునిఁ బిలిచి యిట్లనెను. "ఆనందా! ఎవరైన చుందునిఁ జూచి "చుందుని యింట భుజించి భగవానుఁడు నిర్వాణమును పొందెను" అని నిందింతురేమో; అట్లు నిందింపకుండ జాగ్రత్త వహింపుము. ఇట్టి చింత చుందునికిఁ గూడ గలుగకుండఁ జేయుము. మఱియు నీవు చుందునితో "చుందా! నీవు మహాభాగ్యశాలివి; బుద్ధభగవానుఁడు నిర్వాణము పొందు సమయమున మీ యింట చివర భోజనము చేసెను. నీవెంత యదృష్టవంతుఁడవు. 'ఈ మాటలు భగవానుఁడు స్వయముగాఁ జెప్పుచుండఁగా వింటినని చెప్పి యతని నోదార్పుము". అని చెప్పి యక్కడనుండి హిరణ్యవతీనది యావలి గట్టున నున్న కుశీనర యుపవత్తన మనుమల్లురశాల వనమునకు భిక్షు సంఘముతోఁ గూడ వెళ్ళి యట ఉత్తరదిక్కుగా తలయుండునట్లు మంచము వేయించి భగవానుఁడు అక్కడ అలసటచేఁ బరుండెను.

భగవానుఁడు నిర్వాణము పొందు సమయము సమీపించుచున్నదని తలఁచి యానందుఁడు విహారము లోనికిఁ

బోయి యేడ్వసాగెను. అప్పుడది తెలిసి యానందుని రప్పించి "ఆనందా! విచారింపకు. ఏడ్వవలదు. నేనిదివఱకుఁ జెప్ప లేదా? అన్ని ప్రియవస్తువులనుండి మనము విడఁబాటు పొంద వలసినదే గదా. నాశనము పొందని దేదియు లేదు. నీవు చిర కాలము నుండి సర్వవిధముల తథాగతునికి సేవ చేసితివి. నీవు ప్రధాన నిర్వాణ సాధనలో ముక్తుఁడ వగుము".

భగవానుఁడు నిర్వాణము పొందు సమయ మాపన్న మగుచున్నదని తెలిసి సుభద్రుఁడను సంన్యాసి భగవానునిఁ జూడవచ్చెను. అపుడు ఆనందుఁడు సుభద్రునితో "ఆయు ష్మంతుఁడా! వలదు. తథాగతునికి ఇప్పుడు శ్రమ కలిగింప వలదు. భగవానుఁడిప్పు డలసిపోయి యున్నాఁడు" అనెను.

అది తెలిసి భగవానుఁడు "ఆనందా! సుభద్రుని వారింప కుము. రానిమ్ము. తథాగతుని దర్శింపనిమ్ము. అతఁడేదేని అడిగినచో జ్ఞానము తెలిసికొనవలయు ననుకోరికతో నడుగును. కాని శ్రమ కలిగింపవలెనని యడుగఁడు. అతఁ డడిగినచో వానికి నేను దెలిపిన దానిని అతఁడు వెంటనే తెలిసికొనును". అనెను.

అప్పుడు సుభద్రుని ఆనందుఁడు ప్రవేశ పెట్టెను. అప్పుడు భగవానుఁడు సుభద్రునికి ధర్మ ముపదేశించెను. సుభద్రుఁడు భగవానుని దగ్గఱ దీక్ష గైకొనెను. సుభద్రుఁడే దీక్ష పుచ్చుకొనినవారిలోఁ జివరివాఁడు.



"భిక్షువులారా! ఇదే మీకుఁ జెప్పుచున్నాను. సర్వమును నశించిపోయెడిదే. ప్రమాద పడకుండ జీవిత లక్ష్యమును సంపాదింపుఁడు." అని భగవానుఁడు తుదిసందేశమును జెప్పి, ధ్యానమగ్నుఁ డయ్యెను. ధ్యానముద్రనుండి భగవానుఁడు మేల్కొని యంతట మహాపరి నిర్వాణమును బొందెను.

## అస్థికలపై స్థూప నిర్మాణము

పిదప ఆ బుద్ధభగవానుని అస్థికలను ద్రోణ బ్రాహ్మ ణుఁడు ఎనిమిది భాగములుగఁజేసి 1వ భాగము అజాత శత్రుని కిచ్చెను. అజాత శత్రువు రాజగృహములో ఆ యస్థికలపై స్థూపమును గట్టించెను. 2వ భాగమును వైశాలి యందలి లిచ్ఛవిరాజులకు 3వ భాగమును కపిలవస్తువు నందలి శాక్య రాజులకు 4వ భాగమును అల్లకప్పలోని బులియులకు 5వ భాగమును రామగ్రామమందలి కోలియులకు 6వ భాగమును వేఠద్వీపములోని బ్రాహ్మణులకు 7వ భాగమును పావాలోని మల్లురకు 8వ భాగమును కుసీనరలోని మల్లురకును బంచి యిచ్చెను. ద్రోణ బ్రాహ్మణుఁడు తాను ఆ యస్థికలుంచిన కుంభమును గైకొనెను. చివర పిప్పలీవనములోని మౌర్యులు అంతయు ముగిసిన పిదప వచ్చి యక్కడ నుండి బొగ్గులను దీసికొని వెళ్ళిరి. ఈ విధముగా అందఱును దీసికొని వెళ్ళి తమ తమ గ్రామములలో వాటిపై స్థూలములను నిర్మించిరి.

* * *

# ప్రథమ సంగీతి

బుద్ధభగవానుని నిర్వాణము తరువాత ఆయుష్మంతుఁడగు మహాకాశ్యపుఁడు భిక్షువు లందఱను సమావేశపఱచి యిట్లనెను.

"ఆయుష్మంతులారా! భగవానుఁ డుపదేశించిన ధర్మమును మనము గానము చేయుదము. అధర్మము ప్రకటమగుచున్నది. అధర్మవాదులు బలవంతు లగుచున్నారు."

ఇట్లు పలికి మహాకాశ్యపుఁడు అయిదు వందల మంది భిక్షువులను ఎన్నుకొనెను. ఈ అయిదువందలమంది భగవానుఁడుపదేశించిన ధర్మము గానము చేయుటకును మిగిలినవారు దానిని విని యది సరియైనదో కాదో నిశ్చయించుటకును ఏర్పాటు చేసిరి. ధర్మమును గానము చేయుటకు భిక్షువులు రాజగృహముచేరి యందు గానము చేసిరి.

ఈ వినయసంగీతిలో అయిదు వందలమంది భిక్షువులు గానము చేసిరి. కనుక దీనికి పంచశతిక అని పేరు గలిగెను.

సూత్ర పిటకము (పెట్టె) లో అయిదు నికాయములు గలవు. 1 దీర్ఘ నికాయము 2 మధ్యమ నికాయము 3 సంయుక్త నికాయము 4 అంగుత్తర నికాయము 5 ఖుద్దక నికాయము.

బుద్ధభగవానుని నుండి గ్రహింపఁబడిన సూత్రములు ఎనుబది రెండువేలు. ఇతర భిక్షువులనుండి గ్రహింపఁబడినవి రెండువేలు. మొత్తము ఎనుబది నాలుగువేలు సూత్రములు.

* * *



# రెండవ సంగీతి.

నూరేండ్ల పిదప భిక్షువులలోఁ గొందఱు భగవానుని ధర్మములను భిన్న భిన్నముగాఁ జెప్పుచుండుటచే ఆయుష్మంతుఁడగు రేవతుఁడు నలుగురు ప్రాచీన భిక్షువులను 1 సర్వకామి 2 సాఢుఁడు 3 ఖుజ్జశోభితుఁడు 4 వార్షభ గ్రామికుఁడు అను వారిని, 1 రేవతుఁడు 2 సంభూత సాణవాసి 3 యశకాకండ పుత్త్రుఁడు 4 సుమనుఁడు అను పాలేయక భిక్షువులను నలుగురిని ఎన్నుకొని వారిద్వారా నిర్ణయింపఁ బూనికొని సారేయ (సోరో, ఏటాజిల్లా) గ్రామములో ధర్మ గానము చేయించెను. ఈ రెండవ సంగీతిలో ఏడువందల భిక్షువులు పాల్గొనిరి. కనుక దీనిని సప్తశతిక యనిరి.

* * *

# మూఁడవ సంగీతి.

మఱి నూట పదునెనిమిది యేండ్ల పిదప సిగ్గవస్థవిరుఁడు చండవజ్జిస్థవిరుఁడు అను నిద్దఱు యువకులు అయిదు నికాయములుగా నున్న త్రిపిటకములను (1 సూత్ర పిటకము 2 వినయ పిటకము 3 అభిధర్మ పిటకము) చదివి భిక్షువులై యుండిరి. మోగ్గలి యను బ్రాహ్మణుని పుత్త్రుఁడగు తిష్యుఁడు ఇరువదవయేట భిక్షువై వారి దగ్గఱ త్రిపిటకముల నభ్యసించి చాలమందికి వానిని జెప్పి చదివింపఁ జేసెను.

ఆ సమయమున అశోకుఁడు రాజ్యము చేయుచుండెను.

అతఁడు అనేక యుద్ధములుచేసి సంతప్తుడై న్యగ్రోధ కుమారుఁడను భిక్షువు దగ్గఱ బుద్ధధర్మమును దెలిసికొని హింసను వదలి ధర్మప్రవర్తకుఁ డయ్యెను. అతఁడు "అశోకారామము" అను నారామమును నిర్మింపఁ జేసి యది భిక్షువుల కర్పించెను. అశోకుఁ డొకనాఁడు మోగ్గలి పుత్త్రుఁడగు తిష్యుని నిట్లడిగెను.

"భగవానుఁడా! నేను బుద్ధ ధర్మమునకు వారసుఁడ నగుదునా? కానా"

"మహారాజా! ఇంత మాత్రముచే ధర్మమునకు వారసుఁడవు కావు. భిక్షువులకుఁ గావలసిన పదార్థము లేవి యిచ్చినను జివరకు రాజ్యమిచ్చినను కావు."

"అయితే ధర్మమునకు వారసుఁడ నెట్లు కాఁగలను"

"మహారాజా! తాను ధనికుఁడైనను బీదయైనను సరే తాను కన్న పుత్త్రుని భిక్షునిగాఁ జేసినవాఁడే వారసుఁడు కాఁగలఁడు"

అపుడు అశోకుఁడు తన కుమారుఁడగు మహేంద్ర కుమారుని ఇరువదేండ్ల వానిని అతని సమ్మతిపై భిక్షువుగఁ జేసెను. ఆ సమయమున రాజపుత్త్రియగు సంఘమిత్రయు భిక్షురాలయ్యెను. అప్పుడామె వయస్సు పదునెనిమిది ఏండ్లు. ఆమె భర్తయైన యగ్నిబ్రహ్మయును అదివఱకే భిక్షువైన యశోకుని యన్న యగు తిష్యకుమారునితోపాటు భిక్షువయ్యెను.

మహేంద్ర కుమారుఁడు మోగ్గలి పుత్త్రుఁడగు తిష్యస్థవిరుని దగ్గఱ బుద్ధధర్మమును దెలిసికొని వేయిమంది భిక్షువులతో



ప్రధానమైనవాఁడయ్యెను. పిదప మోగ్గలి తిష్యుఁడు త్రిపిటకములలో నిష్ణాతులైన యొక వేయిమంది భిక్షువులను జేర్చి మహాకాశ్యపునివలెనే యశునివలెనే ధర్మగానము చేసెను. ఈ విధముగా మూఁడవ సంగీతి జరిగెను. ఈ సంగీతి తొమ్మిది మాసములలో సమాప్తి చెందెను.

* * *

## ఆచార్య పరంపర - ప్రచారము

1 బుద్ధభగవానుఁడు 2 ఉపాలి 3 దాసకుఁడు 4 సోణకుఁడు 5 సిగ్గవుఁడు 6 మోగ్గలిపుత్తుఁడు తిష్యుఁడు. మూఁడవ సంగీతి వఱకు ఈ పరంపరచే జంబూద్వీపమున బుద్ధధర్మము వ్యాపించెను. మూఁడవ సంగీతి పిదప మహేంద్రుఁడు మొదలైనవారు దీనిని లంకాద్వీపమున వ్యాపింపఁజేసిరి. మహేంద్రుని నుండి యరిష్టస్థవిరుఁడు మొదలగు వారు ధర్మమును దెలిసికొనిరి. 7 మహేంద్రుఁడు 8 తిష్యదత్తుఁడు 9 కాలసుమనుఁడు 10 దీర్ఘస్థవిరుఁడు 11 దీర్ఘసుమనుఁడు 12 కాలసుమనుఁడు 13 నాగస్థవిఁడు 14 బుద్ధరక్షితుఁడు 15 తిష్యస్థవిరుఁడు 16 దేవస్థవిరుఁడు 17 సుమనుఁడు 18 చూలనాగుఁడు 19 ధర్మపాలితుఁడు 20 రోహణుఁడు 21 ఖేముఁడు 22 ఉపతిష్యుఁడు 23 పుష్యదేవుఁడు 24 సుమనుఁడు 25 పుష్యుఁడు 26 మహాసీవుఁడు 27 ఉపాలి 28 మహానాగుఁడు 29 అభయుఁడు 30 తిష్యుఁడు 31 పుష్పుఁడు 32 చూల అభయుడు 33 తిష్యస్థవిరుడు 34 చూలదేవుఁడు 35 శివస్థవిరుఁడు. ఈ ప్రాజ్ఞులు లంకాద్వీతములో బుద్ధధర్మమును ప్రవేశింపఁజేసిరి.

పిదప మోగ్గలి పుత్రస్థవిరుఁడు ఈ ధర్మమును బ్రకాశింపఁజేయుటకు భిక్షువులను ఆయా చోట్లకు బంపెను. మధ్యాంతికస్థవిరుని కాశ్మీర గాంధారములకుఁ బంపెను. పెషావరు చుట్టుపట్ల ప్రదేశము గాంధారము, మహాదేవస్థవిరుని వింధ్యాచల ప్రాంతమయిన యిండోరు రాజ్యమునకుఁ బంపెను. రక్షితస్థవిరుని బొంబాయి ప్రాంతమునకు, యోనకధర్మ రక్షితుని నర్మదనుండి ముహానానుండి బొంబాయివఱకుఁగల పశ్చిమ పర్వత ప్రాంతమునకును, మహాధర్మరక్షితస్థవిరుని మహారాష్ట్రమునకు మహారక్షితస్థవిరుని బాహ్లీక (బలఖ్) సిరియా మిశ్ర యూనానీ మొదలైన యవన దేశములకు మధ్యమస్థవిరుని హిమాచల ప్రదేశమునకును సోణకుని ఉత్తరస్థవిరుని బర్మా దేశమునకుఁ బంపెను. ఇట్టియుఁడు ఉత్తియుఁడు సంబలుఁడు భద్రపాలుఁడు మొదలగు వారితో భగవానుని నిర్వాణమునకు బిదప 236 ఏండ్లకు మహేంద్రుని లంకాద్వీపమునకుఁ బంపెను.

అశోక మహారాజు చెల్లెలయిన యమలాదేవి యయిదు వందల కన్యలతోడను, అయిదు వందల యంతఃపుర స్త్రీల తోడను సంఘమిత్ర దగ్గఱ దీక్షపొంది ప్రచారము గావించిరి.

## త్రిపిటక రచన - సంగ్రహవర్ణన.

పూర్వము మహామతులగు భిక్షువులు పరంపరగా కంఠస్థము చేయుచు వచ్చిన బుద్ధుఁ డుపదేశించిన పాలీభాషలోని *త్రిపిటకములను బుద్ధభగవానుఁడు పరినిర్వాణముహొందిన

*మహాబోధి సొసైటీ, సారనాథు, బెనారసు వ్రాసిన లభింపఁ గలవు.



రెండువందల సంవత్సరములకుఁ బిదప భిక్షువులందఱు ఒక చోటఁజేరి గ్రంథస్థము చేసిరి.

పిటక మనఁగా పెట్టెయని యర్థము. ఆ గ్రంథములు మూఁడు రాసులుగా అనఁగా మూఁడు పెట్టెలుగా నుండెను. బౌద్ధ (సూక్త) సూత్రముల పెట్టెయని భావము.

1. సుత్త [సూక్త, సూత్ర పిటకము 2 వినయ [భిక్షు నియమములు] పిటకము. 3 అభిధమ్మ [ధర్మ] పిటకము అని యవిమూఁడు.

1. సుత్త పిటకములో అయిదు నికాయములు [సూక్త సమూహములు) గలవు.

1. దీఘనికాయము 34 సూక్తములు బుద్ధుని యుపదేశములు కొన్ని కథలును గలవు.

2. మజ్ఝిమనికాయము - 152 సూక్తములు బుద్ధుని యుపదేశములు కొన్ని కథలును గలవు,

3. సంయుక్తనికాయము 56 సూక్తములు బుద్ధుని యుపదేశములు కొన్ని కథలును గలవు,

4. అంగుత్తరనికాయము _ 11 నిపాతములు బుద్ధుని యుపదేశములు కొన్ని కథలును గలవు.

5 ఖుద్దకనికాయము - ఇందు 15 గ్రంథము గలవు.

ఖుద్దకనికాయములో :- 1 ఖుద్దకపాఠము (శరణత్రయము దశశిక్షలు నీతివాక్యములు మొదలగునవి కలవు ) 2 ధమ్మపదము ( 424 గాథలు- బుద్ధోపదేశ రూపపద్యములు యమ

కాది వర్గములు ). 3 ఉదానము ( బుద్ధుని యుల్లాస వాక్యములు కథలును ) 4 ఇతివృత్తక [అశోకునికి పూర్వపు తరువాతి యితివృత్తములు 124 ) 5 సుత్తనిపాత 6 విమానవత్థు [ప్రేతముల కథలు] 8 థేరగాథలు [స్థవిరభిక్షుల గాథలు] 9 థేరీ గాథలు [ భిక్షురాండ్ర గాథలు ] 10 జాతకకథలు [బుద్ధుని పూర్వజన్మ కథలు 550 నిద్దేశము 12 పటి సంవదా మగ్గము 23 అపదానము 24 బుద్ధవంశము 25 చరియా పిటకము అను నని గలవు.

వినయ పిటకములో (భిక్షుసంఘము ఆచరింపవలసిన నియమములు)

1. పారాజిక 2. పాచిత్తియ [ ప్రాయశ్చిత్తములు ] 3. మహావగ్గము 4. చుల్లవర్గము ( క్షుద్రకవర్గము ) 5 పరిహారము అను భాగములు గలవు.

అభిధమ్మ పిటకములో

1. ధమ్మసంగనీ 2 విభంగ 3 ధాతుకథలు 4 పుగ్గల పణ్ణతి 5 కథావత్థు 6 యమకము పట్ఠానము అనునవి గలవు.

పై గ్రంథములన్నియు ఆయా సందర్భములలో అనేకులకుఁ జెప్పఁబడినవి. సంభాషణ రూపములోఁ గలవు.

బుద్ధుని యనుయాయులదు బౌద్ధుల మతము ముఖ్యముగా 1 సంఘాతవాదము 2 సంతానవాదము అని రెండు వాదములుగా నున్నది.



సంఘాతవాదము

త్రాడు చక్రములు ఇరుసు మొదలగువాని సంఘాతమే రథము అని చెప్పునట్లు ఇంద్రియములు మనస్సు మొదలగు వాని సంఘాతమే జీవుఁడు. ఆత్మరూపుఁడుగాదు అని యీ వాదము తెలుపును, దీనినే నైరాత్మ్య వాదమందురు.

సంతానవాదము :- ప్రతీత్యసముత్పాదము

విచ్ఛిన్నపువాదము :-

ఆత్మ జగత్తు అనిత్యములు ఇవి క్షణముగూడ నుండక ప్రతిక్షణము నశించుచుండును. రూపాది స్కంధములు ప్రతిక్షణము మార్పు చెందుచున్నట్లే జీవుఁడును జగత్తును మారుచుండును, జలప్రవాహమువలె దీపశిఖవలె అని వరుస వరుసగా సంతాన [ప్రవాహ] రూపమై యుండును ఏజలములో మనము స్నానము చేయుదుమో ఆ జలములోనే నిత్యము స్నానము చేయుదుమా? ప్రాంతజలముపోయి క్రొత్తజలము వచ్చును. కాని బల సంతానము అట్లే యుండును. అట్లే దీపశిఖయును, ప్రతిక్షణము దీపశిఖాతరంగములు బయలుదేఱి యస్తమించుచుండుచు. మఱియు ఇంకొక దీపశిఖ బయలుదేఱుట కవి కారణ మగుచుండును. ఇది ప్రవాహ రూపముగ నుండును. కాన దీనిని సంతానవాద మందురు పాలు పెరుగుగా మారును పెరుగు వెన్న యగును వెన్న నెయ్యి యగును. ఒకవస్తువు యొక్కయస్తిత్వ ప్రవాహములో ఒక యవస్థ పుట్టును పుట్టిలయ మొందును. ఇట్లు ఒక ప్రవాహము ఎప్పుడును నడచుచునే యుండును. ఈ ప్రవాహముయొక్క యవస్థలలో మధ్య

ఒక్క క్షణమైనను వ్యవధి యుండదు. ఉన్నచో ఒకటిలయమై యింకొకటి పుట్టుట సంభవింపదు. ఇట్టే జన్మాంతరములను గ్రహించుటలో ఇదే ప్రవాహము జరగుచుండును. ఆయా వస్తువుల యవస్థల పరంపరయె వస్త్వైక్యముగఁ దోఁపింపఁజేయుచున్నది. కాని వస్త్వైక్యము లభింపదు. అని యీవాదములోని సంగతి. ప్రతీత్య = ప్రతి క్షణము నశించి (మొదటి దీపము నశించి) వెంటనే సముత్పాదము దానినుండి ఇంకొక దీపము పుట్టుట. మొదట జీవుడు నశించి వెంటనే దానినుఁడి ఇంకొక జీవుఁడుగా పుట్టుట అని భావము. ఇంచుమించు ఇది ఆత్మాస్తిక వాదమునకు దగ్గరగా నుండును.

ఇందులో ఒకటి సత్తను రెండవది అసత్తను నమ్ముచున్నది. బుద్ధుఁడు సత్త యసత్త మధ్యమార్గము నవలంబించి పరిణామమును సత్యముగా సిద్ధాంతము చేసెను. పై వాదములు ఆధారముగా అనేక వాదములు బయలు దేఱెను.

* * *

## బౌద్ధుల కొన్ని ముఖ్యమతములు.

1 మహాసాంఘికులు:

లోకోత్తరుఁడైన బుద్ధుని సిద్ధాంతముల నంగీకరింతురు. సంస్కరణ వాదులు. వీరి దృష్టిలో బుద్ధుఁడు సర్వశక్తిమంతుఁడు. సంసారిక సేసనలు లేనివాఁడు ప్రకృతి నియమములనుగూడ మార్చఁగలవాఁడు అవతారము భిక్షు జీవితమునకు అర్హత పదవియె ముఖ్యముగాదు. బోధి సత్త్వుఁడగుటయె లక్ష్యము. అని నమ్ముదురు.



2 సర్వాస్తివాదులు

భౌతిక జగత్తును చిత్తగత పదార్థమును బాహ్యాభ్యంతర సత్యమందురు. వీరి దృష్టిలో బుద్ధుఁడు దైవశక్తిగల మానవుఁడు అవిద్యాదులు నశించినచో జననాదులు నశించునందురు. సంఘభద్రుఁడు మొదంగువారు దీని ప్రవర్తకులు.

3 సామ్మితీయులు:

పంచస్కంధములను పుద్గల [జీవుఁడు] పదార్థమును అంగీకరింతురు. జీవన మృత్యువులకుఁ బునర్జన్మకు మధ్య నింకొక శరీరమున్నదందురు.

4 వైపుల్యవాదులు:

గృహస్థ జీవితము గడపవచ్చునందురు. ఇందులోనే తాంత్రికమైన వజ్రయాన బీజములు ంలవు. మహాయానమును ఇందుండియె బయలు దేఱినది. వీరు స్థపెరుల వాదమును హీనయానము (నిర్వాణ ప్రాప్తికి నికృష్టమార్గము) అనియు తమ దానిని మహాయాన మనియు అనిరి.

## యానములు

1 హీనయానము.

పూర్వము బుద్ధుఁడు బోధించిన దానిలో మార్పు నంగీకరింపని స్థవిరులది హీనయానము. శుష్క జ్ఞానమె ఇందు ముఖ్యము. ఇది లంక బర్మా సయాం జావా మొదలగు చోట్లఁ గలదు.

2. వజ్రయానము.

దీని ననుసరించువారు మంత్ర తంత్రముల నంగీకరింతురు మద్యము మంత్రము హఠయోగము మొదలగు తాంత్రిక సాధనలను వజ్రయానులు ఆచరింతురు. ఇది యవినాశి అచ్ఛేద్యము అభేద్యము అని చెప్పి శూన్యవాదమె అన్నిటికి వజ్రము అందురు, కాన నిది వజ్రయానము అనఁబడెను

3. మహాయానము:

ఇందులో ప్రవృత్తి మార్గము భక్తిమార్గము ముఖ్యము మహాయానులు భక్తికి ప్రాధాన్యమిచ్చి జీవుల యాధ్యాత్మికోన్నతికి నైసర్గిక వికాసమునకుఁ దోడ్పడిరి. వీరు సర్వము శూన్యము అందురు వీరిని మాధ్యమికు లనియు అందురు. సంసారము అనిత్యము నిర్వాణము అనిత్యము అందురు. నాగార్జునుఁడు ఆర్యదేవుఁడు మొదలగు వారు దీనికి ప్రవర్తకులు. ఇది టిబెట్టు చీనా కొరియా మంగోలియా జపానులందుఁ గలదు.

## దార్శనికులు

1 వైభాషికులు:

వీరు బుద్ధోపదేశములను విశేషించి భాషించిరి [భాష్యములు వ్రాసిరి] గాన వైభాషికులయిరి. సర్వాస్తి వాదులు. బాహ్యవస్తువులు ప్రత్యక్షరూపముగా సత్యము. సంసారము సత్యము. నిర్వాణము సత్యము అందురు.



2. సౌత్రాంతికులు:

బుద్ధ సూత్రముల నంగీకరించువారు [సూత్రములు అంతములు ప్రమాణము అయినవారు] బాహ్యార్థములు అనుమాన ప్రమాణ సిద్ధములందురు. బాహ్యార్థవాదులు. సంసారము సత్యము నిర్వాణము అసత్యము అందురు. ఆర్యస్థవిరులు, మహాసాంఘికులు దీని ప్రవర్తకులు.

3. యోగాచారులు:

బుద్ధ పారమితలు పొందుటకు యోగము నాచరింపవలెననువారు. బాహ్య భౌతిక జగత్తును మిథ్యయని చిత్తవిజ్ఞానమె సత్యమని యందురు. వీరు విజ్ఞాన వాదులు. అసంగుఁడు వసుబంధువు దిఙ్నాగుఁడు ధర్మకీర్తి మొదలగువారు దీని ప్రవర్తకులు.

4. మాధ్యమికులు:

మధ్యమార్గము నవలంబించువారు. వీరిది మహాయానము. సంసారము అసత్యము నిర్వాణము అసత్యము అందురు. నాగార్జునుఁడు మొదలగువారు దీని ప్రవర్తకులు.

* * *

## బౌద్ధక్షేత్రములు

1 లుంబినివనము.

ఇది బుద్ధుఁడు పుట్టిన చోటు. రుమ్మిందై యని నేఁటి పేరు. ఇది నేపాలు సరిహద్దులో యు. పి. లో బాలియా జిల్లా

లోని కాంగ్రా బజారు అను పెద్ద గ్రామమునకు ఏడు మైళ్లు. **Oudh and Tirhat** రైల్వేలైనులో నౌఘర్ **(Nowgarh)** స్టేషనుకు 20 మైళ్ళు.

చూడవలసినవి :- 1 అశోక స్తంభము 2 స్థూపములు 3 నూతన మందిరములోని జాతి శిల్పములు. మొ.

2. బు ద్ధ గ య.

ఇది బుద్ధుఁడు జ్ఞానమును పొందిన చోటు. గయ స్టేషనుకు ఏడు మైళ్ళు.

చూడవలసినవి:- 1 మహాబోధి మందిరము 2 మహాబోధి వృక్షము (రావిచెట్టు) 3 వజ్రాసనము. 4 అనిమిషలోచన స్థూపము 5 విహారము చుట్టుగలరాయి 6 స్థూపములు 7 మహంతుల మందిరము. మొ.

3. సా ర నా థు.

ఇది బుద్ధుఁడు మొదట ఉపదేశము చేసినచోటు. కాశీకి ఆఱు మైళ్ళు.

చూడవలసినవి:- 1 స్థూపములు 2 పురాతత్త్వ ప్రదర్శనశాల, 3 మూల గంధకుటీ విహారము, 4 బర్మా జైన మందిరములు మొ.

4. కు శీ న గ ర ము.

ఇది బుద్ధుఁడు మహాపరినిర్వాణము పొందినచోటు గోరఖ్పూరు జిల్లాలో (యు. పి) కాశియా **(Kasia)** కు 1 1/2 మైళ్ళు నేఁడు మత కున్వార్ **(Matha Kunwar)** అందురు.



చూడవలసినవి :-

1 బుద్ధమందిరము, 2 మహాపరి నిర్వాణ స్థూపము, 3 అంగార చైత్యము, 4 మథాబాబామూర్తి మందిరము మొ.

5. రా జ గృ హ ము.

ఇది బింబిసారుని పట్టణము. (E. I. R.) భక్తియార్పూరునకు 36 మైళ్ళు **E. Ry.** లో నున్నది. ఇది ప్రాచీనమైన జరాసంధుని పట్టణము కూడ.

చూడవలసినవి :-

1 గిజ్ఝకూటము (బుద్ధుని నివాసపర్వతము) 2 మణియార్ మఠము 3 తపోదావంది (వేడినీటి ధారలు) 4 సత్తపాటిగుహ బౌద్ధసభలు జరగిన చోటు 5 బింబిసారుని జైలు 6 అయిదు కొండలు వానిమీఁది జైన మందిరములు.

6. నా లం ద.

ఇది ప్రాచీన విశ్వవిద్యాలయము. రాజగృహమునకు 4 మైళ్ళు.

చూడవలసినవి :- 1 స్థూపములపంక్తి 2 విశ్వవిద్యాలయ భవనములు, విద్యార్థులుండు గదులు 3 పురాతత్త్వ ప్రదర్శనశాల మొ.

7. శ్రా వ స్తి.

ఇక్కడ జేతవనములో బుద్ధుఁడు 24 వర్షాకాలములు గడపెను. యు. పి. లో గోండా జిల్లాలో బలారాంపూరు పట్టనమునకు 7 మైళ్ళు O. T. Ry లో నున్నది.

చూడవలసినవి :– 1 పట్టణ శిథిలములు 2 జేతవన విహారము 3 ఆనందబోధి 4 పూర్వారామము 5 రాజకారామము 6 బర్మా చైనా వారి మందిరములు.

8. కపిలవస్తుపట్టణము.

ఇది శుద్ధోదను పట్టనము. నేఁటి పేరు పదారియా (Padaria) హిమాలయముల పాదముల దగ్గఱ నున్నది. శహరత్నంజ (Saharatnanga) స్టేషను నుండి వెళ్ళవచ్చును.

9. సాంచీ.

ఇందు ఎత్తైన కొండమీఁద స్తూపములున్నవి. ఢిల్లీకి పోవు దారిలో నున్నది. ఇది చిన్న స్టేషను.

చూడవలసినవి :– 1 స్తూపములు 2 అశోక స్తంభము 3 ప్రదర్శనశాల భవన శిథిలములు మొ.

10. తక్షశిల.

ఇది విశ్వవిద్యాలయము. సరిహద్దు రాష్ట్రములోనిది. రావల్పిండికి 20 మైళ్ళు. N. W. Ry. లో నున్నది.

చూడవలసినవి :– i స్థూపములు 2 విహారములు జాండియాల్ 4 సిర్కాప్ 5 సిర్కుష్=ప్రాంతపట్టనము 6 ప్రదర్శనశాల మొ.

11. కౌశాంబి.

ఇది అలహాబాదుకు 38 మైళ్ళు.

చూడఁదగినవి :– 1 పట్టణ శిథిలములు 2 అశోక స్థంభము మొ.



12. ఎల్లోరా.

ఇది బౌద్ధులు ఏకాంతముగ నివసించిన చోటు. ఔరంగాబాదుకు 15 మైళ్ళు. దౌలతాబాదుకు 7 మైళ్ళు.

చూడవలసినవి :– 1 ఒకే రాతిలో దొలిచిన బౌద్ధగుహలు 12 గలవు. సౌందర్యము చూడఁదగినది.

13. అజంతా గుహలు.

జల్గాన్ స్టేషనునుండి బస్సులో వెళ్ళవలెను. ఫరీద్పూరుకు 27 మైళ్ళు G. I. P. రైలు లైనులో పాచోరా Pachora స్టేషనుకు 13 మైళ్ళు. ఒకే ఱాతిలోఁ జెక్కఁబడిన 29 గుహలు గలవు. గోడలమీఁదను పై కప్పుల మీఁదను సుందర చిత్రములు గలవు.

14. కార్లి గుహలు.

పూనా బొంబాయిలకు మధ్యఁగలవు. మాలవ్లీ స్టేషనుకు 3 మైళ్ళు. ఇందు చైత్యగుహలున్నవి.

15. బరాబార్ కాన్హేరీ గుహలు.

ఇవి గయకు 16 మైళ్ళు, బోరివిలీ స్టేషనుకు 5 మైళ్ళు.

16. నాసిక గుహలు.

ఇవి బొంబాయికి 5 మైళ్ళు. 'త్రిరస్మి' అందురు.

17. అమరావతి.

గుంటూరునుండి బస్సుమీఁద వెళ్ళవలయును. ధరణికోటకు 1 మైలు. ఇందు ప్రదర్శనశాల మాత్రమె గలదు. కృష్ణానదీతీరము.

18 నాగార్జునకొండ

గుంటూరు మాచర్ల లైనులోఁ గలదు. మాచర్లకు 16 మైళ్ళు.

చూడఁదగినవి :- 1 విశ్వవిద్యాలయ శిథిలములు, 2 విజయపురి, 3 పురాతత్త్వ ప్రదర్శనశాల, 4 నాగార్జునకొండ. ఇక్కడకు 4 మైళ్ళలో నాగార్జున ప్రాజెక్టు కట్టఁబడుచున్నది.

భట్టిప్రోలు, గుడివాడ, జగ్గయ్యపేట, గుంటుపల్లి, ఘంటసాల, శాలిహుండాం మొదలగు ప్రదేశములును బౌద్ధ క్షేత్రములే. ఇప్పుడు అంతగాఁ జూడవలసినవి యిక్కడ లేవు.

బాదుషా గుహలు, జున్నర్‌గుహలు, మహాకాల్‌గుహలు, ఉదయగిరి గుహలు అనునవి గూడ ఆంధ్రేతర ప్రాంతములలోఁ గలవు. అవి యంత ప్రసిద్ధమైనవి గావు.

* * *

## బౌద్ధ సాంకేతిక పదములు.

1. ఆర్య సత్యములు :

1 దుఃఖములు, 2 దుఃఖ హేతువులు, 3 దుఃఖ నిరోధము, 4 దుఃఖ నిరోధమార్గము.

దుఃఖములు :

జన్మ జరా వ్యాధి మరణములు, ప్రియవియోగము, అప్రియ సంయోగము, కోరినది దొరకకపోవుట, ఉపాదాన స్కంధములు.



ఉపాదాన స్కంధములు :

1 రూపము, 2 వేదన, 3 సంజ్ఞ, 4 సంస్కారము, 5 విజ్ఞానము రూపము=భూమి, నీరు, గాలి, నిప్పు ఈ నాలుగు రూపోపాదాన స్కంధములు వేదన=విషయ సంబంధమునఁ గలుగు సుఖదుఃఖాద్యనుభూతి.

సంజ్ఞ=వేదన కలిగిన పిదప మొదటగా "వీఁడు దేవదత్తుఁడు" అని సంస్కారముద్వారా గురుతించునది సంజ్ఞ.

సంస్కారము=రూపవేదనా సంజ్ఞలవలన మెదడుపైని పడిన యొక భావము యొక్క సాయము వలన "ఆ దేవదత్తుఁడె యితఁడు" అని గుర్తించుటకుఁ గారణమైనది.

విజ్ఞానము=చేతన, మనస్సు.

దుఃఖ హేతువులు=

తృష్ణ, భోగతృష్ణ, భవతృష్ణ, విభవతృష్ణ.

దుఃఖనిరోధము :

దుఃఖవినాశము తృష్ణానాశము వలన జన్మాదులు గలుగక పోవుట.

దుఃఖ నిరోధ మార్గము : ఆర్యాష్టాంగిక మార్గము.

1 సమ్యగ్దృష్టి 2 సమ్యక్సంకల్పము 3 సమ్యగ్వచనము 4 సమ్యక్కర్మ 5 సమ్యగ్జీవిక 6 సమ్యక్ప్రయత్నము 7 సమ్యస్స్మృతి 8 సమ్యక్సమాధి.

2. త్రిరత్నములు : 1 శీలము, 2 సమాధి, 3 ప్రజ్ఞ.

పంచశీలములు : 1 అహింస, 2 అస్తేయము, 3 సత్యము, 4 బ్రహ్మచర్యము, 5 మదకరవస్తు నిషేధము.

సమాధి : 1 పూర్వజన్మ స్మృతి, 2 జీవోత్పత్తి, 3 వినాశ జ్ఞానము.

ప్రజ్ఞ : 1 శ్రుతమయి, 2 చింతామయి.

ప్రజ్ఞ వలన జ్ఞానదర్శనము, మనోమయ శరీరధార నిర్మాణము, బుద్ధులు దివ్యశ్రోత్రము పరచిత్త జ్ఞానము, పూర్వజన్మస్మృతి, దివ్యచక్షువు గలుగును.

3. త్రిశరణములు : 1 బుద్ధుని, 2 ధర్మమును, 3 సంఘమును శరణు చొచ్చుట.

4. అనుశయము, ఆస్రవము—చిత్తమలములు.

5. ధాతు—పదార్థములు, తత్త్వములు.

6. ఉపసంపద : కేశఖండనము, కాషాయవస్త్రధారణ, భిక్షు నమస్కారము, త్రిశరణదీక్ష. ఇవి చేయించుట. 20 ఏండ్ల వయస్సుకంటెఁ దక్కువ వాని కీయరాదు.

7. ప్రవ్రజ్య : సంన్యాసదీక్ష. ఇది తల్లిదండ్రుల యనుమతి మీఁదనే యివ్వవలెను.

8. బౌద్ధభిక్షులు :

1 స్రోత ఆపన్నుఁడు—నిర్వాణము వైపు పోవుచుఁ బతనముగాక ఏడు జన్మలలో నిర్వాణము పొందువాఁడు.

2 సకృదాగామి—ఒక జన్మ పిదప నిర్వాణము పొందువాఁడు.

3 అనాగామి—ఇంక జన్మపొందక చనిపోయిన పిదప ఆ కనిష్ఠ బ్రహ్మలోకమునఁ బుట్టి పుణ్యపాపములనుభవించి నిర్వాణము పొందువాఁడు.



అగ్రశ్రావకుఁడు—బుద్ధుని యగ్రగామియగు శిష్యుఁడు.

అర్హతుఁడు—ఈ శరీరముతో ఈ జన్మలోనే నిర్వాణము పొందువాఁడు.

సామణేరుఁడు—ప్రవ్రజ్య దీక్షను పొందినవాఁడు.

శ్రమణుఁడు, భిక్షువు = ఉపసంపదా దీక్షను పొందిన వాఁడు.

స్థవిరుఁడు—భిక్షులైన పిదప 10 ఏండ్లకు స్థవిరుఁడనఁబడును.

మహాస్థవిరుఁడు = భిక్షులైన పిదప 20 ఏండ్లకు మహా స్థవిరుఁడనఁబడును.

9. చైత్యము—సమాధి స్థానము.

10. విహారము—భిక్షువుల నివాస స్థానము.

11. స్థూపము—భిక్షువుల యస్థికలపై గట్టినది.

12. బ్రహ్మవిహార భావన.

ఇది 1 మైత్రి 2 కరుణ 3 ముదిత 4 ఉపేక్ష అని నాలుగు విధములు.

1 మైత్రీభావన = అన్ని ప్రాణుల యందు మైత్రితో నుండుట.

2 కరుణా భావన = అన్ని ప్రాణులయందు దయ గలిగి యుండుట.

3 ముదితా భావన = అన్ని ప్రాణుల సుఖములఁ జూచి సంతసించుట.

4 ఉపేక్షా భావన—దేనిని కోరక అన్నిటిని ఉపేక్షించుట.

13. పారమితలు=పూర్ణప్రజ్ఞలు.

ఇవి 1 దానపారమిత 2 శీలపారమిత 3 నిష్కామ పారమిత 4 ప్రజ్ఞాపారమిత 5 వీర్యపారమిత 6 క్షాంతిపారమిత 7 సత్యపారమిత 8 అధిష్ఠానపారమిత 9 మైత్రీపారమిత 10 ఉపేక్షాపారమిత అని పది విధములు. ఇవి పది పూర్తిగానిచో బుద్ధుఁడు గాలేఁడు.

14. పుద్గలము=వ్యక్తి, జీవుఁడు.

15. శ్రావక సంఘము=శిష్యసంఘము.

16. బోధి సత్త్వుడు=బుద్ధుఁడగుటకు యత్నము చేయువాఁడు.

17. ఉపోసథ=ఉపవాసము.

18. పాచిత్తియ=ప్రాయశ్చిత్తము.

రు. 15/-

19. నిదానములు :

1 జరామరణములు 2 జాతి (పుట్టుక) 3 భవము (పుట్టుకకు గారణమైన ధర్మాధర్మములును) 4 ఉపాదానము 5 తృష్ణ 6 వేదన 7 స్పర్శ 8 షడాయతనములు (ఇంద్రియములు మనస్సు) 9 నామ రూపములు 10 విజ్ఞానము 11 సంస్కారము 12 అవిద్య.

20. ప్రతీత్య సముత్పాదము=పై నిదానములను అవిద్యనుండి వరుసగా జరామరణములవఱకు భావించుట. అవిద్యాదులను నశింపఁ జేసినచో వరుసగా సంస్కారాదులు పుట్టవని భావించుట. (చూ. నిర్వాణమార్గము)

21. నిర్వాణము = మోక్షము. సమ్యక్సమాధి. రాగద్వేషాది దుఃఖములను నిరోధించుటచేఁ జిత్తము ఏకాగ్రమగుట. శరీరము విడచుటయును.



# 66. బౌద్ధమతశాఖలు

బౌద్ధసంఘము

